శ్రీమతే రామానుజాయనమః.

పరమకారుణికులగు

శ్రీ ఎఱుంబి అప్పాగారు

రచియించిన,

# విలక్షణ మోక్షాధికారి నిర్ణయము

ఇత్యాది

కావ్యరత్న, వేదాంతరత్న, వేదాంతతీర్థ, వేదాంతవాచస్పతీత్యాది
బిరుదాలంకృతులును, శ్రీభాష్య, శ్రీవచనభూషణ,
ఆచార్యహృదయాది గ్రంథములను ఆంధ్రీకరించిన వారగు

శ్రీమాన్

## కందాడై శేషాచార్యులు

వారిచే ఆంధ్రీకరింపబడి

స్వకీయ

వేదాంత ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపబడినది.

**MADRAS**

**1926.**



గ్రంథకర్త
కావ్యరత్న, శాస్త్రరత్న, శాస్త్రనిధి, శాస్త్రవాచస్పతి
శ్రీమాన్
కందాడై శేషాచార్యులు.

శ్రీమతే రామానుజాయ నమః.

# ప్రవేశము.

శ్రీమణవాళమహామునులు శ్రీరంగమున వేంచేసియుండి సకలచేతనుల నుజ్జీవింపఁజేయుటకై యుభయవేదాంతార్థములను సవిస్తరముగ నుపన్యసించుచు వెలయుచుండఁగా ఎఱుంబియను అగ్రహారమున నివసించువారై వేదవేదాంతాది సకలవిద్యల యందును నసమానులని ప్రసిద్ధిఁబొందిన ఎఱుంబి అప్పాయను విద్వాంసులు దేవరాజులు అను తిరునామముగలవారొకనాఁడు శ్రీరంగనాథుని సేవించుటకై శ్రీరంగమునకు విచ్చేసి, అక్కడ సకల నక్షత్రమండల మధ్యంబున పూర్ణచంద్రునిపగిది విలసిల్లుచున్న శ్రీ మణవాళ మహామునులను సేవించి, ఆమహనీయుని దివ్యతేజంబునకును సకలశాస్త్ర తత్త్వార్థ సమేతములైన యుపన్యాసములయందలి యుక్తివిశేషములకును నత్యద్భుతానంద భయ।వినయవిశేషంబులు పురిగొన, నమ్మునీంద్రుని సన్నిధిని తదేకచిత్తులైయుండి గ్రంథకాలక్షేపానంతరము ము

## ప్ర వే శ ము.

సీంద్రునిచే భోజనమునకు పిలువంబడినవారయ్యు, యత్యన్న మనర్హమను సామాన్యశాస్త్రము ననుసరించి యచట భుజింప నొల్లక తమకు శరీరసంబంధులగు కందాడై అణ్ణగారి గృహము నందు భుజించి స్వగ్రామమున కరిగిరి.

ఇట్లు స్వగ్రామముచేరి మరునాడుదయమున ననుష్ఠానములఁ దీర్చికొని, భగవదారాధనమునకు సన్నిధితలుపులు తెరువఁబోవగా, సర్వవిధములఁ బ్రయత్నము చేసినను, ఆతలుపులు రాలేదు గనుక ఖేదపడినవారై యుపవసించియే యుండి సాయంకాలమనుష్ఠానము దీర్చికొని శయనింపఁగా స్వప్నమందు వారి తిరువారాధన మూర్తులైన శ్రీ సీతారాములు సాక్షాత్కరించి " అప్పా! నీవు మహనీయులైన శ్రీమణవాళ మహామునుల యందు యతిసామాన్యబుద్ధియుంచి వారిప్రసాదమును స్వీకరింపవైతివి గాన, నీవుచేసెడి యారాధనము మాకు సరిపడదని యానతీయగా అప్పగారాశ్చర్యభయసంభ్రమంబుల నద్దేవుని క్షమింప వేడుకొని, వెంటనే శ్రీరంగమునకు వచ్చేసి మణవాళ యతీంద్రుని సేవించి, అపరాధమును క్షమింపవేడుకొని. తన్ను రక్షింపుమని ప్రార్థింప, ఆ పరమదయాళుండు సంతుష్టాంతరంగుండై, పంచసంస్కారములు కృపచేసి, సంప్రదాయసిద్ధంబులగు పరమరహస్యార్థముల నుపదేశించి, అప్పగారిని గొప్పవారిగ జేసిరి. అప్పగారును మునివర్యుని తానుదర్శించినది మొదలు తన ననుగ్రహించిన చరిత్రముతోసహ వారిదినచర్యను గ్రంథరూప

ముగ సాయించి మఱియు నుదారమధురగంభీరముగ వరవర ముని శతకమును సాయించి విలక్షణమోక్షాధికార నిర్ణయమును సర్వశాస్త్రసమ్మతముగ రచించి శ్రీసీతారాముల యనుగ్రహమునకు పాత్రులై వెలసిరి.

శ్రీవైష్ణవ సంప్రదాయమున ఆహ్నానియతి ఆచార్యశిష్య ప్రవర్తనాదులలోఁ గొన్ని యక్రమములు జరుగుచుండుటం జూచి, వాటినన్నింటిని సరిచేయుటకై లోకోపకారార్థము వీరీ గ్రంథమును రచియించినటుల చదువరులకే తెలియగలదు. శ్రీవైష్ణవసిద్ధాంతమందలి రహస్యములనన్నింటిని సుస్పష్టముగాను తెలుపునట్టి గ్రంథములలో నిది యొక్కటియని చెప్పుటకు సందియము లేదు.

ఒకానొక దినమున వీరి శిష్యులగు సేనాపతి జీయాళ్వార్ మొదలగువారు వీరిసన్నిధికేతెంచి దండము సమర్పించి ముముక్షువులగు దాసులకు మోక్షాధికారులగు విలక్షణులయొక్క స్వరూపమును నిర్ణయించిచెప్పవలయునని విన్నవింపగా, అప్పా గారును ఈ విషయమును మేమిప్పుడు నిర్ణయింపవలసియున్నదా! ఋషులును, ఆళ్వారులును, ఆచార్యులును అందఱును దీనిని స్పష్టముగా నిదివరకే నిర్ణయించియుండిరి కదా! అయినను మీరడిగినారుగనుక పూర్వాచార్యులు సాయించిన యర్థములను విన్నవించెదనని యీ గ్రంథమును సాయించిరి.

మద్రాస్,
1-9-1925.

ఇట్లు,
బుధజనవిధేయుఁడు,
కందాడై, శేషాచార్యులు

## తెనిగించిన శ్రీవైష్ణవ సంప్రదాయ గ్రంథములు.

శ్రీమదాంధ్ర శ్రీభాష్యము. (శ్రీరామానుజబ్రహ్మసూత్రభాష్యమునకు సరియయిన తెనుగు) మొదటి సంపుటం 8 0 0

శ్రీమదాంధ్ర శ్రీభాష్యము. రెండవ సంపుటం 8 0 0

శ్రీవచనభూషణము. శ్రీపిళ్ళైలోకాచార్యులవారు వ్రాయించిన దివ్యమగు శ్రీవైష్ణవ సిద్ధాంతగ్రంథము. ఇది శ్రీ మణవాళమహామునులు వ్రాయించిన వ్యాఖ్యానముతోఁగూడ తెనిగింపఁబడి ద్రావిడ భాషలోనుండు మూల వ్యాఖ్యానములతోఁగూడ ముద్రింపఁబడినది. 8 0 0

ఆచార్యహృదయము. పిళ్ళైలోకాచార్యులవారి తమ్ములగు అళగియమణవాళ పెరుమాళ్ నాయనార్ వ్రాయించిన దివ్యమయిన శ్రీవైష్ణవ సిద్ధాంత గ్రంథము. డిటో డిటో 8 0 0

ఈశావాస్యోపనిషత్తు. శ్రీరామానుజ సిద్ధాంతపరములగు టీకాతాత్పర్యములతోను విపులమయిన పీఠికతోను గూడియున్నది. 0 8 0

కేనోపనిషత్తు. డిటో డిటో 0 8 0

అధ్యాత్మచింత. భగవద్విషయమునకు పన్నీరాయిరప్పడి వ్యాఖ్యానము వ్రాయించిన అళకియమణవాళజియ్యరు వారు వ్రాయించినది. ఇందు సులలితములగు శ్లోకములతో తిరుమంత్ర, ద్వయ, చరమశ్లోకార్థములును అర్చిరాది మార్గమును వివరింపఁబడినవి. ఇది చక్కఁగ తెనిగింపఁబడినది. 0 4 0

స్తోత్రరత్నము. శ్రీయాళవందారులు రచియించిన స్తోత్రము. టీకాతాత్పర్య పీఠిక ఆంధ్రపద్యసహితము. 0 12 0

ముకుందమాల. డిటో డిటో 0 8 0

యతిరాజవింశతి. శ్రీమణవాళమహామునులు రచియించినది. శ్రీరామానుజుల వారి విషయమగు స్తోత్రము, టీకాతాత్పర్యసహితము. ఇందు ప్రతిశ్లోకమునకును మధురంబులగు పద్యంబులును కలవు, 0 4 9

గోదాచతుశ్శ్లోకి. ఆండాళు విషయమగు స్తోత్రము, టీకాతాత్పర్యసహితము ఇందు ఆండాళు వైభవంబును కలదు, 0 1 0

చతుశ్శ్లోకి. శ్రీ ఆళవందారులు రచియించినది. శ్రీదేవి విషయమగు స్తోత్రము టీకాతాత్పర్యసహితము, 0 2 0

కందాడై శేషాచార్యులు,

ప్రొప్రైటరు, వేదాంతముద్రాక్షరశాల, 88 మేకుభావులవీధి, మద్రాసు.

# విషయ సూచిక.

# విషయసూచిక.

| విషయము | పుట సంఖ్య. |
| --- | --- |

| విషయము | పుట సంఖ్య. |
| --- | --- |

## ప్రకటన.

వార్తామాల—పిన్బళకియ పెరుమాళ్ జియ్యరువారు సాయించినది.

శ్రీమన్నాథమునులు మొదలగు పూర్వాచార్యులు అప్పుడప్పుడు గోష్ఠిగాఁ జేరినప్పుడు "బోధయంతః పరస్పరం" అన్నట్లు అధ్యాత్మవిషయములను గురించి చర్చించిన అనేక విషయములును, అనేకరహస్యార్థములను గురించి వారియభిప్రాయములును, అనుష్ఠానములును, సిద్ధాంతములును అనేకములు ఈ గ్రంథమువలనఁ దెలియఁగలవు, ఈ యొక గ్రంథమును చదివినందున నన్ని గ్రంథములను చదివినంత యుపయోగము కలదని వేఱు చెప్పనక్కఱలేదు, ' ౫ ౦ ౦

శ్రీః

శ్రీమతే రామానుజాయ నమః.

# విలక్షణ మోక్షాధికారి నిర్ణయము

శ్లో॥ సౌమ్యజామాతృయోగీంద్ర చరణాంబుజషట్పదం ।
దేవరాజగురుం వందే దివ్యజ్ఞానప్రదం శుభం ॥

శ్లో॥ శమదమాదిగుణైకనికేతనం చరమపర్వణి నిశ్చలచేతసం।
యతివరాంఘ్రిసరోరుహషట్పదం సమరపుంగవసద్గురుమాశ్రయే॥

శ్రియఃపతియును, నిఖిలహేయప్రత్యనీకకల్యాణగుణాశ్రయుండును నగు సర్వేశ్వరుండు నిరంకుశ స్వాతంత్ర్యుండును, పరమకారుణికుండును నగుటం జేసి, "మణ్‌పల్లుయిర్‌కళుమాకి ప్పలపలమాయ మయక్కుక్కళాలిన్ పురుమివ్విళైయాట్టుడైయాన్" అని సాయించియున్నట్లు, అనేకవిధములును, మోహజనకంబులునగు కార్యంబుల మూలముగ లీలావిభూతిలోనుండు చేతనులతో నాటలాడుచుండును.

## 1—* నిర్హేతుక జాయమాన కటాక్షము. *—

అట్టి సమయమున, ఎవ్వరినయిన కొందఱిని, ఈ సంసారమునుండి యుజ్జీవింపజేయుట కిచ్ఛగలిగినప్పుడు "ఏవం సంసృతిచక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః । జీవే దుఃఖాకులే విష్ణోః కృపా కాప్యుపజాయతే" అన్నట్లు ఈ చేతనుండు సంసారచక్ర

మునందుండి తాను సంపాదించుకొనినట్టి పుణ్యపాపంబుల మూలముగ జన్మ, మరణ, నరకాది దుఃఖంబుల ననుభవించుచు నీతంటు పడునట్టిపాత్రులను వీక్షించి, యీతనివిషయమున కృపగలవాఁడగును. అది యెట్లనిన "నాసౌ పురుషకారేణనచాప్యన్యేనహేతునా । కేవలంస్వేచ్ఛయైవాహం ప్రేక్షేకంచిత్కదాచన" (పురుషకారమువలన కాదు. వేఱొకహేతువువలన కాదు. అయితే నాయిచ్ఛవలన నెవనికో యొక్కనిని యొకప్పుడు కటాక్షించుచును) అన్నట్లు పట్టపుటేనుగ మెడలో హారమువైచి రానున్న రాజును ఏర్పఱచినట్లు, తనయొక్క నిర్హేతుక కృపవలననితనిని విశేషముగ కటాక్షించును. "జాయమానంహి పురుషంయం పశ్యేన్మధుసూదనః సాత్త్వికస్సతువిజ్ఞేయః సవై మోక్షార్థచింతకః" అన్నట్లు అట్టిజాయమాన కటాక్షము మూలముగ సత్త్వగుణ నిష్ఠుండై మోక్షాపేక్షగల వాఁడగును.

—* ఆచార్యుని యాశ్రయించుట *—

జ్ఞానమువలన మోక్షమును బొందును, అజ్ఞానము వలన సంసారమును బొందును అని చెప్పియున్నట్టి మోక్షమనునది యనుష్ఠానపర్యంతమగు అర్థపంచకజ్ఞానమువలన లభింపవలసినది కావున, నట్టిజ్ఞానములేకుండినట్లయిన, సంసార దుఃఖమే సంప్రాప్తించుచుండు, ఉజ్జీవించుట కుపాయములేదు. ఇవ్విధమున తలంచినట్టి మోక్షార్థియగు యీ చేతనుండు, "తద్విజ్ఞానార్థంసగురుమేవాభిగచ్ఛేత్ । సమిత్పాణిఃశ్రోత్రియంబ్రహ్మనిష్ఠమ్ । తస్మైసవిద్వానుపసన్నాయ సమ్యక్ప్రశాంతచిత్తాయశమాన్వితాయ యేనాక్షరంపురుషంవేదసత్యం

ప్రోవాచ తాంతత్త్వతో బ్రహ్మవిద్యాం” అని శ్రుతియందుఁ జెప్పియున్నట్లు, అట్టి జ్ఞానము లభించుటకు గాను, శుశ్రూషాపరుండై నిత వేదాంత సారార్థ వేత్తయు, పరమాత్మేతరము లగు వాటివిషయమున వైరాగ్యముగలవాఁడై పరమాత్మానుభవైకనిష్ఠుండగు సదాచార్యుని యాశ్రయింప వలయును.

—* ఆచార్యునికృత్యము (అజ్ఞానజ్ఞాపనము) *—

అట్టి యాచార్యుండు శమదమాద్యాత్మగుణసంపన్నుండగు ఈచేతనుని మనస్సును బాగుగ పరిశోధించి, బ్రహ్మప్రాప్తికి సాధనభూతమగు విజ్ఞానమును ఉపదేశించి, యట్టి విజ్ఞానమున కనుకూలములగు అనుష్ఠానంబులును ఈతనికి బాగుగ తెలియునట్లు ఈతనిని దిద్దుపాటుచేయును. ఇవ్విధమున ఆచార్యుండు చేయఁగా, శిష్యుండును వాటిని లభించి కృతకృత్యుండై, మోక్షాధికారియునయి యుజ్జీవించును.

ఈపైని యుదహరించిన శ్రుతివాక్యమునందు “సమ్యక్ ప్రశాంతచిత్తాయ” అనుదానఁ జెప్పఁబడిన శమదమ గుణములు రెండును అన్యగుణంబులలోఁ బ్రధానంబు లగుటం జేసి, యీ రెంటినిఁ జెప్పినందున సచ్ఛిష్యునికుండవలసిన లక్షణంబులన్నియును ఈ దావున సూచితములగుచున్నవి. “శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్” అనుదానఁ జెప్పఁబడిన శ్రోత్రియత్వమున్ను బ్రహ్మనిష్ఠత్వమున్ను సదాచార్యుని కుండవలసిన లక్షణంబులన్నింటిని సూచింపుచున్నవి.

—* సచ్ఛిష్యలక్షణము. *—

సచ్ఛిష్యుని కుండవలసిన లక్షణంబు లెవ్వియనఁగా “శరీరం వసు విజ్ఞానం వాసః కర్మగుణానసూన్ । గుర్వర్థమ్ ధార

యేద్వస్తు స శిష్యోనేతరః స్మృతః" అని చెప్పియున్నట్లు శరీరము, ద్రవ్యము, ప్రాణము, గృహము, పొలము, పుత్రులు భార్య మొదలగువాటిలో నొక్కటియు తనవియని భావింపక, యివియన్నియును ఆచార్యునికిఁ గానే యని తలంచి, వేఱొక్క ప్రయత్నము నెద్దియును చేయక, ఆచార్యుని యిష్టప్రకారము నడచుకొనుచు, క్రయవిక్రయార్హుఁడుగా నుండి "సద్బుద్ధిస్సాధుసేవీ సముచితచరితః తత్త్వబోధాభిలాషీ శుశ్రూషుస్త్యక్తమానః ప్రణిపతనపరః ప్రశ్నకాలప్రతీక్షః శాన్తో దాన్తోనసూయుశ్శరణముపగత శ్శాస్త్రవిశ్వాసశాలీ శిష్యః ప్రాప్తః పరీక్షాం కృతవిదభిమతః తత్త్వతః శిక్షణీయః" అని చెప్పియున్నట్లు సద్విషయముల విషయమున నాసక్తిగల బుద్ధిగలవాఁడై, సాధుసేవాతత్పరుండై, సదనుష్ఠానసంపన్నుఁడై, తత్త్వజ్ఞానాపేక్ష గలవాఁడై, గురుశుశ్రూషాపరుండై, అహంకార రహితుండై, దండప్రణామపరుఁడై, ప్రశ్నకాలమును నిరీక్షించుచుండువాఁడై, బాహ్యాభ్యంతరేంద్రియ నిగ్రహములవాఁడై, యితరులయతిశయమునుజూచి సహింపజాలకుండుటయనెడి యసూయలేనివాఁడయి, శరణాగతుండయి, శాస్త్రమునందు విశ్వాసముగలవాఁడగు శిష్యుండు లభించినట్లయిన, అతనిని యథావిధిగ విద్వ పాటుచేయునదియని యిట్లు శ్రుతియందుఁ జెప్పియున్నట్లు సచ్ఛిష్యలక్షణములుగలవానికి హితము నుపదేశింపఁగలఁడు.

—* విలక్షణులుకాని శిష్యులఁ జేర్చుకొనుట యనర్థకము. *—

ఇవ్విధమున నుండనివానిని శిష్యునిగాఁ జేర్చుకొనఁ గూడదు. తనకు ఖ్యాతియు, లాభమును, గౌరవమును, అను

వర్తనమును గలుగునని తలంచి అందులకుగాను దేవతాంతర సాధనాంతర విషయాంతరపరులై తిరుగుచుండువారిని పరిమండిని యొకతావునఁజేర్చి "తన్మ్యజ్ఞ్ తో త్రైనతే శాస్త్రే" అని సాయించినట్లు పూర్వాచార్యుల శ్రీసూక్తులను, వారి యనుష్ఠానములనున్ను విడనాడి, తనకుఁగల దుర్వాసనములమూలముగ తనకు తోచిన విపరీతార్థముల నుపదేశించుచు, వారిమూలముగ ద్రవ్యాదులను సంపాదించుకొనుచు, దేహపోషణ పరవశుడై, కాలము గడపునట్టి యాచార్యుండు "యజమాన కృతంపాపం ద్రవ్యమాశ్రిత్యతిష్ఠతి" అన్నట్లు చేతనునికిఁగల పాపము వాని సొత్తును ఆశ్రయించి యుండుటంజేసి, "శిష్యపాపంగురోరపి" అన్నట్లు అనధికారియగు శిష్యునియొక్క యభిమానముచే అపవిత్రమైన ద్రవ్యముద్వారా అతనిపాపము నతనికి సంప్రాప్తించి తనదిన్ని వానిదిన్ని ఈరెండు పాపములున్ను చేరి మిగుల వృద్ధిపొంది యుండును.

— * విలక్షణ శిష్యసంబంధము ఉత్తారకము. * —

కావున శిష్యుండయినప్పటికిన్ని విలక్షణసంబంధమే ముఖ్యముగా కావలసినదిగాన, సదాచార్యసంబంధముతోపాటు సచ్ఛిష్యసంబంధమున్ను ఉపాదేయమనితలచి విలక్షణులైనవారినే శిష్యులనుగాఁ జేర్చుకొనునది. కావుననే "సోయం రామానుజమునిరపి స్వీయముక్తింకరస్థాం । యత్సంబంధాదమనుత కథం వర్ణ్యతే కూరనాథః" అన్నట్లు ఇంతకుముందుండిన యాచార్యులకును ఇఁకమీదు రాబోవు ఆచార్యులకున్ను అందఱికిన్ని మోక్షము నిచ్చువారుగా ప్రసిద్ధిజెందినవారలగు శ్రీరామానుజులవారును గురువుయొక్క యాజ్ఞనతిక్రమించి త్రైకాల్యజ్ఞాను

కోవిలలో ఉపదేశించిన శ్రీవైష్ణవుల కందఱికిన్ని తిరుమంత్రార్థమును బహిరంగముగా నుపదేశించినందువలనవచ్చిన యపచారమువలన తమకు అధోగతిగలుగనని నిశ్చయించుకొని సచ్ఛిష్యులగు కూరత్తాళ్వారుల సంబంధమువలన మోక్షము తమకు అరచేతిలోనున్నట్లు భావించుకొని, కాషాయవస్త్రముపైకెగురునట్లు నృత్యముచేసిన విషయము సుప్రసిద్ధముకదా! ॥గురోర్వచోతిక్రమణే నిశ్చిత్యనరకస్స్వయమ్ । పరానర్థాసహిష్ణుత్వాన్మంత్రంప్రోవాచభాష్యకృత్'' (ఆచార్యానుజ్ఞాతిక్రమణమువలన తమకు దుర్గతి కలుగునని నిశ్చయించుకొనినను, ఇతరులకష్టములఁజూచి సహింపఁజాలమిచే శ్రీ భాష్యకారులవారు తిరుమంత్రార్థమును అందఱికి బయలుపరచిరి) అని చెప్పియున్నది కదా!

—* విలక్షణుండు కాని శిష్యునితో సంబంధము అనర్థహేతువు *—

ఇట్లు విలక్షణుండగు శిష్యునితోఁగల సంబంధము ఉజ్జీవన హేతువగునట్లు, విలక్షణుండు కానట్టి శిష్యునితోఁగల సంబంధము అనర్థమునకు హేతువు కాఁగలదు. సత్పుత్రునితోఁగల సంబంధము తండ్రికి నరకోత్తారకమైనట్లు, దుర్నడవడికగల పుత్రునితోఁగల సంబంధము అట్టి పుత్రుండొనర్చుచువచ్చిన నిషిద్ధకార్యములమూలముగ ॥పితౄన్ప్రాతయతే సుతః'' అన్నట్లు పితృవర్గము కంతకును వినాశహేతువగునని శాస్త్రమునఁ దెలిపియున్నది కదా! ॥సహివిద్యాతస్తంజనయతి తచ్ఛ్రేష్ఠం జన్మగరీయాన్ బ్రహ్మదః పితాగురుః పితాముముక్షోస్తు'' (ఆచార్యుఁడు విద్యద్వారా శిష్యుని కనుచున్నాడు. అట్టి జన్మమే శ్రేష్ఠమయినది. జ్ఞానమునిచ్చిన తండ్రి గొప్పవాఁడు. ముముక్షు

వుకు ఆచార్యుడే తండ్రి) అగుటకావున శాస్త్రమునందును గురు
శిష్యులకు పితాపుత్ర సంబంధమున్నట్లు చెప్పియున్నది కదా!
కావున దుర్నడవడికగల శిష్యునితోఁ గలసంబంధము, వాని ద్రవ్య
మును స్వీకరించుటమూలముగ, నదియున్నయనర్థములకును
హేతువై నశింపఁజేయును. అట్లు శిష్యునితోఁ గల సంబంధమే
యపాయముఁ గలుగఁజేయునది యయిన పిమ్మట, జ్ఞానానుష్ఠా
నములులేని యాచార్యునితోఁ గల సంబంధము వినాశహేతు
వని చెప్పవలసినది యేమున్నది? "జ్ఞానహీనం గురుం ప్రాప్య
కుతో మోక్షమవాప్నుయాత్ । భిన్ననావాశ్రయస్సర్వో యథా
పారం న గచ్ఛతి" పగిలిపోయిన పడవనెక్కి ప్రయాణముచేయు
వాఁడు దరిచేరనట్లు, జ్ఞానహీనుండగు ఆచార్యుని యాశ్రయిం
చినవాఁడెట్లు మోక్షమును పొందగలఁడు) అనుకావున నిది యన
ర్థహేతువుగాను శాస్త్రమునఁ జెప్పఁబడినది కదా!

— * సదాచార్య లక్షణము. * —

కావున "సిద్ధం సత్సంప్రదాయే" ఇత్యాది శాస్త్రమునఁ జెప్పి
యున్నట్టి సదాచార్యలక్షణసంపన్నులగు పరమ విలక్షణు
లతోఁ గల సంబంధమే మోక్షహేతువై మనలను దరిచేర్చును.
"సిద్ధం సత్సంప్రదాయే స్థిరధియమనఘం శ్రోత్రియం బ్రహ్మ
నిష్ఠం సత్త్వస్థం సత్యవాచం సమయనియతయా సాధువృత్త్యా
సమేతం డంభాసూయాదిముక్తం జితవిషయగణం దీర్ఘ
బన్ధుం దయాళుం స్ఖాలిత్యే శాసితారం స్వపరహితపరం దేశి
కం భూష్ణురీప్సేత్" అని చెప్పియున్నట్లు, సత్సంప్రదాయసిద్ధుం
డును, స్థిరబుద్ధి గలవాఁడును, ఉపదేశఫలాదుల విషయమున
విరుద్ధాభిప్రాయ రూపమగు దోషములేనివాఁడును, వేదాంత

శాస్త్రముయొక్క ముఖ్యాభిప్రాయమును బాగుగా నెఱింగిన వాఁడును, భగవదేక నిష్ఠాగరిష్ఠుండును, సత్త్వరజస్తమో గుణ పరవశులగు సంసారులవలెనే సుఖము గలిగినప్పుడు సంతోషమును కష్టము గలిగినప్పుడు దుఃఖమునున్ను బొందక, "సమదుఃఖసుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మకాంచనః। తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిందాత్మసంస్తుతిః। మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః। సర్వారంభపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే" అని చెప్పియున్నట్లు, సత్త్వరజస్తమోగుణాతీతుండై శుద్ధసత్త్వసంపన్నుండై, ఉన్నదున్నట్లు గ్రహించువాఁడును, ఉన్నదున్నట్లు తెలుపువాఁడును, పూర్వాచార్యానుష్ఠానమున కను గుణమగు మంచినడవడికతో ఆహారనియమ, సహవాసనియమ అనువర్తన నియమములు గలవాఁడై, డంబము, అసూయ, మొదలుగునవి లేనివాఁడై, గానశ్రవణము, అంగనాలింగనము మొదలగు క్షుద్రములగు శబ్దాది విషయములయందు దాసులేనివాఁడును, శిష్యుండు తనను విడనాడినను తాను వానిని విడనాడకయుండు వాఁడును, ఇతరుల కష్టములఁజూచి సహించియుండఁజాలని పరమదయాళువును, శిష్యుఁడు చెడుదారిపోవునపుడు అట్లు వానిం బోనీయక కష్టపడి వానిని శిక్షింప సమర్థుండును, చెడ్డనడవడికలొక్కటియును ప్రాపంచికముగనైనను తన చెంతచేరకుండునట్లు, జాగరూకతో నడచుకొనుచు తనకును ఇతరులకును హితపరుండగు ఆచార్యుని యాశ్రయించి వాని యుపదేశానుసారముగఁ బ్రవర్తించునట్టివాఁడు కదా భగవంతునికి యెక్కువప్రియుండై మోక్షమును బొందఁగలఁడు. కావున శ్రీమణవాళమహాముని "జ్ఞానమనుష్ఠానమివై నన్నాకవే యుడయనాన కురువైయ

జాతి దుష్టములనఁగా.—"లశునం మద్యం మాంసాని మూలకం గ్రంజనం తథా అలాబుం శ్వేత వార్తాకం విద్వనీకం తత్రైవచ ఏతమాదీన్యభక్ష్యాణి శాస్త్రదుష్టానియే నరాః ఖాదంతి తే నరా యాంతి విణ్మూత్రక్రిమిభోజనం" (ఉల్లిగడ్డ తెల్లగడ్డ, కల్లు, సారాయి, మాంసములు, ముల్లంగి, గంజాయి గానుగపిండి, మునుగ, బిల్వము, భీరకాయ, తెల్లవంకాయ, పుట్టగొడుగులు ఇవి యన్నియును తినతగినవి కావు. శాస్త్రనిషిద్ధములు. వాటినిభుజించువారు మలమూత్రక్రిమిభోజనమువలెనే త్యాజ్యులు) అని యిట్లు త్యాజ్యములుగాఁ జెప్పఁబడినట్టి నిషిద్ధపదార్థములు. అయితే ఆచారమునే ప్రధానమైన దానినిగాఁ దంచియుండు వాఁడగు శ్రీరామచంద్రుండు "నమాంసం రాఘవో భుంక్తే నచాపి మధుసేవతే" అన్నట్లు సీతా దేవిని విడిచి యొంటరిగా వేంచేసియున్నప్పుడు మద్యమాంసములను విడిచిపెట్టి యున్నాడని చెప్పియుండుటవలన సీతాదేవితోఁగలిసియున్నప్పుడు వాటినియనుభవించుచుండెనని తెలియుచున్నది గదా! "మర్యాదానాంచ లోకస్యకర్తాకారయితాచసః" (లోకమునందలినియమములనుచేయువాడునుచేయించువాఁడునువాఁడే) అనియు, "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" (న్యాయమును స్థాపించుటకై ప్రతియుగమునను అవతరించుచున్నాడను) అనియును చెప్పియున్నట్లు ధర్మసంస్థాపనమునకై యవతరించినట్టి యవతారములయం దాచరించిన ధర్మము స్వీకరింపఁదగినది కదా? యంటివేని, చెప్పెదను. శ్రీరామచంద్రుండు సామాన్యధర్మము నాచరించువాఁడగుటం జేసి, క్షత్రియకులమునకుఁ దగినట్టి మాంసములను రాజులు ఉపయో

గించుకొనునట్టి నానావిధపుష్ప రస సముదాయమగు మద్య మునున్ను స్వీకరించియుండెను ఇంతియేకాని, స్వవర్ణవిరుద్ధము లగు మద్యమాంసములను స్వీకరించి యుండ లేదే?

వర్ణధర్మములననుసరించువారికి తారతమ్యానుగుణము గ కొన్ని త్యాజ్యములును, మరికొన్ని యుపాదేయములును గాఁగలవు. అవి యన్నియును సత్వసమృద్ధిగల పరమాత్మకాంతిక లకు॥ "తథావిద్వాన్ పుణ్యపాపే విధూయ" (బ్రహ్మవేత్త పుణ్య పాపములను రెంటిని వదలుకొని) అని చెప్పియున్నట్లు, భగవ దనుభవముకు విరుద్ధములయినవి త్యాజ్యంబులగునే తప్ప ఏ రిచే స్వీకరింపవలసినవి యేవియునుండవు.

॥"బ్రాహ్మణస్య మధూకమైక్షవం తాళం ఖార్జూరంపా నసం తథా ద్రాక్షం మధుజమారిష్టమ్ మైరేయం నారికేళజం ఇత్యేకాదశమద్యాని నిషిద్ధాని ద్విజన్మనాం। సురాంబు ఘృత గోమూత్రపయసామన్యతమం హ్యగ్నిస్పర్శాద్గాఢం కృత్వా పీత్వా మరణాత్ శుద్ధిం ప్రాప్నుయాత్" (మధూకము, ఐ క్షవము, తాళము, ఖార్జూరము, పానసము ద్రాక్షము, మధు జము, అరిష్టము, మైరేయము, నారికేళము అను పదునకొం డు విధములుగల సారాయములను బ్రాహ్మణుండు త్రాగకూ డదు. అట్లు త్రాగినచో, సారాయమును గాని, ఉదకమునుగా ని, నెయ్యినిగాని, గోమూత్రమును గాని, పాలనుగాని నోరుకాలు నట్లు కాచి త్రాగి మృతినొందినచో పరిశుద్ధుండగును.) అని చెప్పియున్నట్లు సత్వగుణ ప్రచురమగు బ్రాహ్మణ్య ముకే మరణాంతములగు నిషిద్ధపదార్థములు శుద్ధసత్వనిష్ఠులై ఈగ్రామమువాఁడు ఈకులమువాఁడు అనియిట్లు గ్రామకులా

లను బట్టి పేర్కొనందగినవారు కాకుండ అన్నివర్ణములవారి కంటెను, అన్ని యాశ్రమముల వారికంటెను విలక్షణులై భగవత్సంబంధమునుబట్టియే పేర్కొనందగిన వారలగు పరమైకాంతులకు అవి మనస్సుచేఁ దలంపఁదగినవియును కావు కదా!

నింద్యమగు నిషిద్ధద్రవ్యస్వీకారము వర్ణమును బట్టియే నిషిద్ధమైనది కాకుండ, “ద్రవ్యం నింద్యసురాది దైవతమతి క్షుద్రంచ బాహ్యాగమోద్భుక్తి ర్వలకాశ్చ దేశికజనాధిక్ ధిక్ ధిగేషాం క్రమః” (సుర మొదలగునవి నిషిద్ధపదార్థములు. అవి నీచములు. వాటిని వేదబాహ్యమతములను బోధించునట్టి నీచులు ఉపయోగపరచుదురు. వారి యనుష్ఠానము అతిక్షుద్రము) అన్నట్లు క్షుద్రదేవతావిషయములగు, వేదబాహ్యాగమప్రవర్తకుల నిషిద్ధకృత్యములగుటఁజేసి యవి శిష్టులయిన వారిచే బహిష్కృతములయినవి కదా! “యజంతే సాత్వికా దేవాన్” (సాత్వికులు దేవతలను పూజించుదురు) అన్నట్లు దేవతలందరును సాత్వికులచే పూజింపవలసిన వారగుటచే శ్రీరామచంద్రుండు బ్రహ్మేంద్రాదిదేవతలను అవతారముఁ గొనినప్పుడు పూజించినను, అనన్యార్హశేషత్వము మొదలుగాఁగల యాకారములనుబట్టి పిరాట్టితో సమానులగు పరిశుద్ధాత్మలకు దేవతాంతరము పూజింపఁగూడనిది కదా! ఇంకను అవతారముల యందొనర్చినట్టి యతిమానుషచేష్టితములను దృష్టాంతములను గాఁగొనినట్లయిన, బ్రాహ్మణుండగు రావణుని సంహరించినందున బ్రహ్మహత్యాదులును, కృష్ణుని నడవడికనుబట్టి పరహింస పరదార పరద్రవ్యాపహారాదులును ఉపాదేయంబులయినచో

తప్పేమున్నది? కావున అట్లు చెప్పినచో, మహాపాతకములు సయితము ప్రపన్నధర్మములగును, వాటిని సయితము ననుష్ఠింపవలసి వచ్చును గాన అట్లు చెప్పఁదగదు.

ఒకవేళ యవియును ఉండనీయున్నను, చరమశ్లోకమునందలి సర్వశబ్దముయొక్క యర్థమునకు లోపము రాకుండుటకై నివృత్తిరూపమగు ధర్మమును త్యజించుటను తెలుపునట్టిదిగాను *సర్వశబ్దమును గ్రహింపఁగూడదా! యంటివేని యట్లు చెప్పఁదగదు. ఏలననఁగా, తననున్ను సర్వేశ్వరునినిన్ని ఫలమునున్ను పరిశీలించినట్లయిన, యట్టి యకృత్యము నిచట ప్రాప్తించుటకవకాశము లేదని ముముక్షుప్పడియందు శ్రీపిళ్లై లోకాచార్యుల వారట్టి యాక్షేపమును పరిహరించి యున్నారు కదా!

---

* "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" ఇత్యాదిచరమశ్లోకము. ఈతావున "అన్ని ధర్మములనువదలి నన్ను శరణుఁజొమ్ము" అని భగవంతుండు ఉపదేశించి యున్నాఁడు. అన్నిధర్మములనఁగా నేవి యనెడి విచారణరాఁగా అవి యింతకుపూర్వము మోక్షోపాయములుగా నుపదేశింపఁబడినట్టి కర్మజ్ఞానభక్తులని ముముక్షుప్పడియందు చెప్పఁబడినది. ఈతావున నొకశంక గలుగుచున్నది. అది యేమనఁగా అధర్మములను అథవా నిషిద్ధములను ఆచరింపకపోవుటయును ఒకధర్మమే కదా! అన్ని ధర్మములను త్యజింపుమని చెప్పినప్పుడు "అన్ని"యని చెప్పియున్నందున అన్నింటిని గ్రహింపవలయును గాన పైనిచెప్పిన నిషిద్ధధర్మ పరిత్యాగరూపమగు ధర్మమునున్ను త్యజింపవలయునని యర్థము ఏర్పడుచున్నది. అందువలన నిషిద్ధధర్మ పరిత్యాగమును వదలుకొనుట యనఁగా నిషిద్ధధర్మముల నాచరింపుమని యుపదేశించినట్లు కదా యని యాక్షేపముయొక్క యభిప్రాయము.

దలకు బట్టి పేర్కొనఁదగినవారు కాకుండ అన్నివర్ణములవారి
కంటెను, అన్ని యాశ్రమముల వారికంటెను విలక్షణులై
భగవత్సంబంధమునుబట్టియే పేర్కొనఁదగిన వారలగు పరమై
కాంతులకు అవి మనస్సుచేఁ దలంపఁదగినవియును కావు
కదా!

నింద్యమగు నిషిద్ధద్రవ్యస్వీకారము వర్ణమును బట్టియే
నిషిద్ధమైనది కాకుండ, "ద్రవ్యం నింద్యసురాది దైవతమతి
క్షుద్రంచ బాహ్యాగమోద్భూతి ర్దేవలకాశ్చ దేశికజనాధిక్ ధిక్
ధిగేషాం క్రమః" (సురె మొదలగునవి నిషిద్ధపదార్థములు. అవి
నీచములు. వాటిని వేదబాహ్యమతములను బోధించునట్టి నీచు
లు ఉపయోగపరచుదురు. వారి యనుష్ఠానము అతిక్షుద్రము)
అన్నట్లు క్షుద్రదేవతావిషయములగు, వేదబాహ్యాగమప్రవ
ర్తకుల నిషిద్ధకృత్యములగుటంజేసి యవి శిష్టులయిన వారిచే
బహిష్కృతములయినవి కదా! "యజంతే సాత్త్వికా దేవాన్"
(సాత్త్వికులు దేవతలను పూజించుదురు) అన్నట్లు దేవతలంద
ఱును సాత్త్వికులచే పూజింపవలసిన వారగుటచే శ్రీరామచం
ద్రుండు బ్రహ్మేంద్రాదిదేవతలను అవతారముఁ గొనినప్పుడు
పూజించినను, అనన్యార్హ శేషత్వము మొదలుగాఁగల యాకా
రములనుబట్టి పిరాట్టితో సమానులగు పరిశుద్ధాత్మలకు
దేవతాంతరము పూజింపఁగూడనిది కదా! ఇంకను అవతారముల
యందొనర్చినట్టి యతిమానుషచేష్టితములను దృష్టాంతములను
గాఁగొనినట్లయిన, బ్రాహ్మణుండగు రావణుని సంహరించినం
దున బ్రహ్మహత్యాదులును, కృష్ణుని నడవడికనుబట్టి పరహింస
పరదార పరద్రవ్యాపహారాదులును ఉపాదేయంబులయినచో

తప్పేమున్నది? కావున అట్లు చెప్పినచో, మహాపాతకములు సయితము ప్రపన్నధర్మములయి, వాటిని సయితి మనుష్ఠింపవలసి వచ్చును గాన అట్లు చెప్పఁదగదు.

ఒకవేళ యవియును ఉండియున్నను, చరమశ్లోకమునందలి సర్వశబ్దముయొక్క యర్థమునకు లోపమురాకుండుటకై నివృత్తిరూపమగు ధర్మమును త్యజించుటను తెలుపునట్టిదిగాను *సర్వశబ్దమును గ్రహింపఁగూడదా! యంటివేని యట్లు చెప్పఁదగదు. ఏలననఁగా, తననున్ను సర్వేశ్వరునినిన్ని ఫలమునున్ను పరిశీలించినట్లయిన, యట్టి యకృత్యము లిచట ప్రాప్తించుటకవకాశము లేదని ముముక్షుప్పడియందు శ్రీపిళ్లైలోకాచార్యుల వారట్టి యాక్షేపమును పరిహరించి యున్నారు కదా!

---

* "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" ఇత్యాదిచరమశ్లోకము. ఈ కావున "అన్నిధర్మములను వదలి నన్ను శరణుజొచ్చుము" అని భగవంతుండు ఉపదేశించి యున్నాడు. అన్నిధర్మములనఁగా నేవి యనెడి విచారణరాఁగా అవి యింతకుపూర్వము మోక్షోపాయములుగా నుపదేశింపఁబడినట్టి కర్మజ్ఞాన భక్తులని ముముక్షుప్పడియందు చెప్పఁబడినది. ఈ కావున నొకశంక గలుగుచున్నది. అది యేమనఁగా అధర్మములను అథవా నిషిద్ధములను ఆచరింపకపోవుటయును ఒకధర్మమే కదా! అన్నిధర్మములను త్యజింపుమని చెప్పినపుడు "అన్ని" యని చెప్పియున్నందున అన్నింటిని గ్రహింపవలయును గాన పైనిచెప్పిన నిషిద్ధధర్మపరిత్యాగరూపమగు ధర్మమునున్ను త్యజింపవలయునని యర్థము ఏర్పడుచున్నది. అందువలన నిషిద్ధధర్మ పరిత్యాగమును వదలుకొనుట యనఁగా నిషిద్ధధర్మముల నాచరింపుమని యుపదేశించినట్లు కదా యని యాక్షేపముయొక్క యభిప్రాయము.

అయితే యీ గ్రంధమున *"కాట్టినాలుమ్" ఇత్యాది వాక్య
మున, నివృత్తిరూపధర్మత్యాగమును సర్వశబ్దము తెలుపు
నని యంగీకరించిన పిమ్మట యిఁక సంకోచమెందుల కనియం
టివేని, "పిణక్కు రవరు క్కెచ్చియముం నెరియుళ్ళియుగ్గె త్తికణక్కు
రు నల్ల ర్కళ్" అన్నట్లు స్వయముగ సర్వజ్ఞుండును సర్వేశ్వరుం
డు షణ్మతముల వారి వాదము నశించునటుల, సన్మార్గ
మును విచారించి ప్రసాదించినట్టి చరమశ్లోకమునకు నిషి
ద్ధానుష్ఠానము అంతరంగార్థ మంటిమేని, గురు, మంత్ర,
దేవతలను పరిభవించుటయు, విపరీతమైనట్టి యర్థమును గ్ర
హించుటయు, సమస్తములగు ఉపనిషత్తులయొక్కయును సార
మగు సమస్తగీతాశాస్త్రియొక్కయును సారముయినట్టి, "ఉ
పాయాపాయనిర్ముక్తాం మధ్యమాం స్థితిమాస్థితః" అని చెప్పియు
న్నట్లు ఉపాయమున్ను అపాయమున్ను కానిటియగు ప్రపత్తి
కిన్ని పరిభవము కలుగుటం జేసి, వినాశమునకు హేతువగును క
దా! కావున "ఉచ్ఛిష్టమపిచామేధ్యం భోజనం తామసప్రియం"
అనిచెప్పియున్నట్లు అపరిశుద్ధములగు వస్తువులు తమోగుణ
ప్రధానులకు తప్ప సత్వగుణ ప్రధానులకు త్యాజ్యములగును.
సత్వరజస్తమో గుణములకు అధీనముగ ప్రవర్తించునట్టి చేత
నులకన్ననో, అవి వారి వారి యీ యీ గుణంబుల కనుగుణ
ముగ త్యాజ్యంబులును ఉపాదేయంబులును కాఁగలవు.

---

* "కాట్టినాలమత్తై యొఴిన్దవత్తైచ్చొల్లత్తాయిత్తు" = ఒకచోట
"అన్ని" అనుటవలన నిషిద్ధానుష్ఠానత్యాగమున్ను తెలుపఁజేసెను.....
అనునది ముముక్షుప్పడివాక్యము. ఈ కావున "అన్ని" అను దానిని నిషిద్ధాను
ష్ఠాన పరిత్యాగరూప ధర్మమున్ను తెలుపునట్టిదానినిగా చెప్పలేని

"సర్వం ఖల్విదం బ్రహ్మ" అన్నట్లు సమస్త పదార్థములు బ్రహ్మాత్మకములని తలంచియుండునట్టి యధికారులకు త్యాజ్యంబులగు నవియును కలవా? యంటివేని యీచేతనుండు సత్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతిని వదలి ముక్తుండయిన పిమ్మట కదా! సర్వము భగవత్సంబంధమయిన దనెడి తలంపు వలన లీలా విభూతియంతయును అనుభవయోగ్యమగు నది కాఁగలదు. ప్రకృతితోఁగూడి యుండునట్టి వారయినను, సర్వేశ్వరుని కృప వలన మంచి జ్ఞానానందమును లభించిన వారగు శ్రీ నమ్మాళ్వారులవంటివారును, ప్రహ్లాదుని బోటివారును అపరోక్షజ్ఞానముగ వారి సమస్తపదార్థములలోనను సర్వేశ్వరుని సాక్షాత్కరించి, విషశస్త్రాగ్నులయందు ప్రతికూలములనెడి భావన పోయి. అరియుం శస్త్రాస్త్రమువియచ్చుదనెన్ను మయ్ వేవాళ్' (కోసినను కాల్చినను సర్వేశ్వరుండేయని భావించునది) అనియు, "నాగ్నిర్మహాత్మిర్న వాయం శస్త్రైశ్ఛిన్నోన చోరగైః క్షయం నీతో న వాతేన న విషేణ న కృత్యయా సత్యాసక్తమతిః కృష్ణే దశ్యమానో మహోరగైః న వివేదాత్మనో గాత్రం తత్ స్మృత్యామోదసంస్థితః" ప్రహ్లాదుని అగ్ని దహింపఁజాలక పోయెను. శస్త్రములు ఖండింపఁజాలక పోయినవి వాతము శోషింపఁజాలక పోయినది విషయమున్న శోషింపఁజాలని దాయెను. ప్రహ్లాదుండు శ్రీకృష్ణునియందు మనస్సునుంచి వానిని స్మరించుట వలనఁ గలిగిన యానందము మూలముగ పాములు తనను పట్టి పీకుచున్నను తన శరీరమును తానెఱుంగక యుండె

---

యున్నాఁడే? యింత సంతోషమేమున్నది? యని శంకాకారుని మది గలి ప్రాయము. ఈ విషయమును ముముక్షుప్పడియందు మామకోనవసి,

ను) అని చెప్పియున్నట్లు, అన్నియును అనుకూలంబులయి, ,,స
ర్వభూతాత్మకే తాత జగన్నాథే జగన్మయే పరమాత్మని గోవిం
దే మిత్రామిత్రకథా కుతః" (సర్వవస్తువులలో నంతరాత్మగా
నుండువాఁడును, జగన్నాథుండును, జగన్మయుండును, ప
రమాత్ముఁడును నగు గోవిందుని విషయమున నిది మంచిది, యిది
చెడుద నెడి సమాచార మెక్కడిది?) అన్నట్లు సర్వమును సమా
న భావముతోఁ జూచువారలయి, ,,పుక్కమున న్ఱు పువనెన్ఱు పోసు
విల్ శీర్ పూమియె" (తి. వా. ౨-౪-౧) (సర్వేశ్వరుని ఆనం
దముగల యిన్ప్రీతియుండుటందునా? నిరుపమానముగు క్షమ
గలభూమి యందునా?) అవియారంభించి ,,యావయుమ్
యవరుం తానాయ్" (తి. వా. ౩-౪.౧౦) (సకల అచేతనము
లకును సకలచేతనములకును తాను అంతర్యామిగా నుండి) అను
టకును, ,,నల్ కురవుమ్ శెల్వం నరకుం శువర్క్కముమాయ్"
(మంచి కురువయు, సంపత్తు, నరకము, స్వర్గము వీటిలో తానే
యంతరాత్మగా నుండి) అనియు ,,నీరాయ్ నిలనాయ్ కాలా
య్) (ఉదకమయి, భూమియయి, కాలమయి) అనియును చెప్పి
యున్నట్లు పృథివ్యాది భూతములును, భూతములవలన నేర్ప
డిన పదార్థములును తద్ద్వారా చేతనాచేతన పదార్థములును అ
న్నింటిలోను వ్యాపించియుండి అవి యన్నియును తానే యని
చెప్పఁదగినట్లు వానికి శేషభూతములై యున్నట్లు వాటిని తలం
చియున్నారే తప్ప, అన్నియును బ్రహ్మాత్మకములని తలంచి ఉప్పి
నెత్తి మొదలగు వాటిని భుజించి యుండలేదే!

శ్రీ నమ్మాళ్వారులు ,,కాణవారాయ్" (భగవంతుఁ
డా! నాకు సేవ సాయింపుము!) అని ప్రార్థింపఁగా, ,,మేము

జగదాకారమును జూపించినామే? దానిఁ జూచి ధరించియుండ
కూడదా? అని యడుగఁగా, రాజుయొక్క చరసాల మొదలగు
ఐశ్వర్యమంతయును రాజపుత్రునికి తనతండ్రియొక్క యైశ్వర్య
మని తలంచి యాదరింపఁదగినది యగునట్లు, అండములును, అం
డములలోనుండు దేవతలు మొదలుగాఁగల పదార్థములును,
స్వర్గనరకములు మొదలుగాఁగల భోగభూములును, వాటిఁబొం
దుటకు హేతుభూతములగు పుణ్యపాపములును ఇవియన్నియును
నిన్నువిడిచి వేఱుగా నుండుట కవకాశము లేదు, విశేషణము
గాను నీకే శేషభూతములుగా నుండునవియని భావించుకొనెద
ము. ఇంతియె కాని, "అఴుక్కుప్పొదియుడంబా" అన్నట్లు
హేయ వస్తుసముదాయమైనదియు, స్వరూపమును గప్పివేయు
నదియు, విపరీతజ్ఞానమును గలుగఁజేయునదియునునగు జగత్తు
యొక్క యాకారము, దేదీప్యమానమగు శరీరమువలెనే నాకను
భవయోగ్యమైనదా? "కూరారాఴి వెణ్‌శంగేందికొండియేఁ
పాల్వారాయ్" (కదనుగలచక్రమును శంఖమునున్ను ధరించు
కొనినవాఁడవై క్రూరుండనగునాకు సేవసాయింపుమా?) అన్న
ట్లు అసాధారణమగు దివ్యమంగళవిగ్రహముతో సేవసాయింప
మని "నీరాయ్ నిలనాయ్" (తి.వా.) అను తిరువాయ్మొ
ళియందు శ్రీనమ్మాళ్వారులు ప్రార్థించియున్నారు కదా! పిరా
ట్టులయొక్కయును, నిత్యసూరులయొక్కయును, ముముక్షువుల
యొక్కయును నడవడికలన్నియును కలవారగుటంజేసి, మోక్షా
వస్థ ననుభవించు నప్పుడు, సమస్తపదార్థములును భగవదా
త్మకములని యనుసంధించుకొనునట్టి శ్రీనమ్మాళ్వారుతో స్త
న్యపానము మొదలగునవి యన్నియును ప్రకృతి సంబంధము

గలవి యని వాటినన్నింటిని విడిచిపెట్టి, "ఉణ్ణుమ్ శోఱు పరు
గునీర్ తిన్నుమ్ వెత్తిలై యుమెల్లామ్ కణ్ణన్" త్రినేయన్నమును,
త్రాగే నీళ్ళున్ను, వేసుకునే తాంబూలమును అన్నియును శ్రీ
కృష్ణుండు) అన్నట్లు ధారక, పోషక, భోగ్యంబులు మూఁడున్ను
సర్వేశ్వరుండేయని యనుసంధించుకొని, ప్రకృతి సంబంధము
గల వస్తువులఁగాని జీవించునట్టి సంసారులగు చేతనులఁ గంటి
తోఁజూడక, "కాడు వులకంకాట్టిలే" అనియు, "ఇవైయెన్న
వులకియర్కై" అనియు, "నాట్టారోడియల్ వొళిన్దోమ్"
అనియు, "పరికళ్ళన్ఱ్ శామారే" అనియు ఆళ్వారుల
శరీరమును విసర్జించుటకై ప్రార్థించినారు కదా! కావున బ్రహ్మా
త్మకము లయినంతమాత్రమున, ప్రాకృతవస్తువులు ముముక్షు
వులచే స్వీకరింపవలసినవి యని చెప్పఁదగదు.

పరిశుద్ధమైన యాహారమును భుజించుటచే మనస్సుపరి
శుద్ధమగుననియు, మనస్సు పరిశుద్ధమైనందున జ్ఞానము కలు
గుననియు, జ్ఞానమువలన మోక్షముకలుగుననియును శాస్త్ర
మునఁ జెప్పియున్నందున, నట్టి జ్ఞానము కలుగుటకు విరుద్ధము
లయినవి యన్నియును త్యజింపవలసినవియే కదా. ఆళ్వారు
లకు సర్వేశ్వరుండు ఇంచుకైనను అజ్ఞానములేనిజ్ఞానానందము
నొసంగి యుండుటంజేసి, వారికి ధారకాదులన్నియును సర్వే
శ్వరుండే యగుట తగియున్నది. అది లేనట్టి వారలగు ముము
క్షువులకు సత్త్వగుణమును వృద్ధిపొందించునట్టి పదార్థములే
స్వీకరింపవలసినవి. కావున జాతిదుష్టములగు పదార్థములు
త్యాజ్యములు.

—* ఆశ్రయదుష్ట నిమిత్తదుష్ట పదార్థముల విచారము *—

ఆశ్రయదుష్టములనఁగా—నిందితులు పాతకులు, ఛండాలులు, వీరియభిమానముచే దోషవిశిష్టములయినట్టి పదార్థములు. నిమిత్తదుష్టములనఁగా—శ్రాద్ధము, శాంతి, మొదలగు కారణములవలన సేయఁబడినవియు, వెండ్రుకలు పడినవియు, ఉచ్ఛిష్టములును, నీచులచే స్పృశింపఁబడినవియును మొదలగునవి. ఇట్టిమూఁడువిధములగు దుష్టవస్తువులను పరిత్యజించుట యాహారనియతి యని చెప్పఁబడుచున్నది.

—* సహవాసనియతి విచారము. *—

సహవాసనియతి యనఁగా— దేహాత్మాభిమానాదులుగలవారును, దేవతాంతర, ప్రయోజనాంతర, సాధనాంతరపరులును, స్వతంత్రులు మొదలగు ప్రతికూలులఁ జూచినట్లయిన సర్పముఁ అగ్నిని వీటిఁ జూచినట్లు, దగ్గరకుపోవుటకు భయపడువారై, జ్ఞానానుష్ఠానములు ఆకారముననే తెలియవచ్చినట్లు యున్నట్టి పరమాప్తులతోఁ జేరియుండుట.

— అనువర్తన నియతి విచారము. —

అనువర్తననియతి యనఁగా—ద్రవ్యార్జనాదులకుఁ గాను రాజద్వారములయందు సంసారుల ననువర్తించి తిరుగకుండ, జరుగునది యంతయును కర్మాధీనముగాఁ జరుగుననుకొని, యందులకై మనస్సును కష్టపెట్టక, సదాచార్యుని యాశ్రయించుకొని యుండుట.

కావున నీపైని చెప్పిన జ్ఞానానుష్ఠానములు కలవాఁడే సదాచార్యుండని చెప్పఁబడుచున్నాఁడు. జ్ఞానహీనుండు గ్రుడ్డివానివంటివాఁడు. అనుష్ఠానహీనుండు కుంటివాని వంటివాఁడు.

కర్మ కాండలను వుండే కదా! తానున్ను తనను ఆశ్రయించినవా రును దరిచేరగలరు? కావుననే "ఉభాభ్యామేవ పక్షాభ్యామా కాశేపక్షిణాం గతిః। తథైవ జ్ఞానకర్మభ్యాం ప్రాప్యతే భగవాన్ హరిః" (రెండు రెక్కలనాధారముగాఁగొని పక్షులు ఆకాశము నసెగురగలిగినట్లు, జ్ఞానానుష్ఠానముల రెంటిమూలముగ ఈచే తనుండు సర్వేశ్వరుని బొందగలడు) అని శాస్త్రమునఁ జెప్పి యున్నది కదా! "త్యజధర్మమధర్మంచ — ఉపాయాపాయని గ్రహోమధ్యమాంస్థితి మార్గితః! ఉపాయాపాయ సంయోగే నిష్ఠయాహీయ తేసయా" అన్నట్లు శరణాగతుండైన ముము క్షువుకు విధినిషేధములు రెండును త్యాజ్యంబులుగా నుండ, రజస్తమోగుణంబులమూలముగ మనస్సుచెడి "యయాధర్మమ ధర్మంచ కార్యంచాకార్యమేవచ అయథావత్ప్రజానాతి బుద్ధి స్సాపార్థరాజసీ" (దేనిమూలముగ ధర్మమున్ను అధర్మము న్ను కృత్యమున్ను అకృత్యమున్ను ఉన్నవియున్నట్లు తెలియ రావో, అది రాజస బుద్ధియని చెప్పబడుచున్నది) అనియు, "అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా సర్వార్థాన్ విపరీతాంశ్చబుద్ధిస్సా పార్థతామసీ" (ఏబుద్ధి తమోగుణావృతమై ఉన్న వస్తువులను విపరీతముగాఁ దెలిసికొనుచున్నదో, యది తామస బుద్ధి యనఁబడుచున్నది) అనియును చెప్పియున్నట్లు, ఉన్నదున్నట్లు తెలిసికొనక విపరీతములగు అర్థముల ప్రకార మనుష్ఠించుకొనువాఁడై, దానినే యితరుల కుపదేశించుచు, "శ్రుతిస్స్మృతిర్మమైవాజ్ఞా యస్తాముల్లంఘ్యవర్తతే। ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ మద్భక్తోపి న వైష్ణవః" (శ్రుతియును స్మృతియు ను నాయొక్క యాజ్ఞ. ఎవఁడు వాటి నతిక్రమించి ప్రవర్తించు

చున్నాఁడో, వాఁడు నాభక్తుండైనను వైష్ణవుండుకాఁడు) అని
యు, "ప్రియాయమమవిష్ణోశ్చ దేవదేవస్య శార్ఙ్గిణః మనీషీ వై
దికాచారం మనసాపి నలంఘయేత్ యథాహివల్లభోరాజ్ఞోన
దీంరాజ్ఞా ప్రవర్తితాం లోకోపయోగినీంరమ్యాం బహుసస్యవి
వర్ధినీంలంఘయన్ శూలమారోహేదనపేక్షో పితాంప్రతి। ఏవం
విలంఘయన్ మర్త్యోమర్యాదాం వేదనిర్మితాం ప్రియోపిన ప్రి
యోమే సౌమదాజ్ఞావ్యతివర్తనాత్" (రాజుచే యేర్పాటుచేయ
బడినదియు, లోకోపకారకమయినదియు, సుందరమయినది
యు, ఎక్కువ సస్యమును వృద్ధిపొందించునదియునగు నదిని త
నకెట్టియు ప్రయోజనములేకున్నను దానిఁ జెడఁగొట్టినచో ఉరి
తీయబడునట్లు, నాయొక్క యాజ్ఞయగు వేదమునందు చెప్పి
యున్నట్టిమర్యాద నతిక్రమించునట్టి మనుజుండు నాయాజ్ఞనతి
క్రమించుటంజేసి నాకు ప్రియుండుకాఁడు) అనియును సాయిం
చియున్నట్లు భగవదాజ్ఞారూపములగు వైదికమర్యాదల నతి
క్రమించి, యందులకు విరుద్ధములయిన దుష్ప్రవర్తనములమూ
లముగ భగవంతుని కయిష్టుండై తానును నశించి తన నా
శ్రయించిన శిష్యునిన్ని నశింపఁజేసి, తనతోఁగలిసిన వారిలో
కొందఱు తనను ఆశ్రయించియు, మరికొందఱు తనను అనా
దరణచేసియును నశించునట్లు, చెడుమార్గమునఁబోవుచు తనను
ఆచార్యునిగా భావించుకొని ఖ్యాతిని, స్వలాభమును, గౌరవము
నున్ను అనువర్తనమునున్ను అపేక్షించి, విపరీతమైన నడవడిక
గల శిష్యులఁ జేర్చుకొని, వారియొక్క దురభిమానదూషిత
మగు ద్రవ్యమును స్వీకరించి, యందు మూలముగ జీవనము
జేయువాఁడుకాకుండ, శ్రీమన్నాథమునులు, శ్రీయామునాచా

ర్యులు. శ్రీభాష్యకారులు, శ్రీగోవిందభట్టరు, శ్రీలోకాచార్య
రు, శ్రీమణవాళమహామునులు మొదలగు వారి శ్రీసూక్తు
లను, వారి యనుష్ఠానంబులనున్ను పరిశీలించి, దివ్యజ్ఞానసంప
న్నులగు ఆళ్వారుల దివ్యప్రబంధములయందును, వాటి యర్థ
ములను విశదపరచునవి యగు శ్రీవచనభూషణాది సకల సం
ప్రదాయగ్రంథములయందును సంసారములోనుండునట్టి చేతను
లను ఉద్ధరించుటకై గ్రథింపబడినట్టియే గ్రంథములను అతిక్ర
మించి, వేదశాస్త్రవిరుద్ధంబులగు దురాచారములను బొత్తు
గనదలివేసి, లోకహితమునకుగాను, శిష్యప్రశిష్యవర్గమునకు
గాను, తెలియపరచి వారాచరించుటకు గనున్న విషయనిష్కర్షించి
పోయిన శాస్త్రసిద్ధాంతకర్మంబులు మొదల మోక్షోపా
యంబుల నెల్ల బుద్ధిని మహాపాతకములనుబలెను బొత్తుగ వదలి,
ముక్తిమార్గమగు ప్రపత్తియుచున, తనను స్వాచార్యపరతంత్రు
నిగ నుపేక్షించి సహాధ్యాయులగాను, ఉపదేశఫలమును మంగ
ళాశాసనార్థమగానును తలంచి, తనచే ఏర్పాటుచేయబడి
నట్టి శిష్యసంపత్తియంతయును ఆచార్యశేషముని తలం
చి, తనకు సమర్పించి తాను నిష్పృహుడై యుండఁగా, వాటిన
న్నింటిని తాను నిరీక్షించి, వానికి తిరిగి యిచ్చివేచి. మీరును
మాతో సంబంధించినవియును అన్నియును ఆచార్యాధీనము
లయినవిగాన, వాటినిమీరు యథోచితముగ భగవద్భాగవత
కైంకర్యములయందు వినియోగపఱచుకొనునది యని నియ
మింపఁగా, తన యనుజ్ఞవలన, తగిన విధమున భగవద్భా
గవతవిషయములందును, తన జీవనము విషయమునను సంబం
ధము గలవాఁడై యుండి. మరల తనను ప్రార్థించి యైనతావి

యూర్ యూనార్ తందనికొండాక్కినయే” (నా ప్రాణమును నా తండ్రియును నీవే) అన్నట్లు, మనుకాంక్షితుండై యైశ్వర్యము గా సమర్పించినట్టి ద్రవ్యము నంగీకరింపనిచో, తనను విడిచి పెట్టునేమో యనుకొని, తాను ఆద్రవ్యముఁ గాని భగవద్భాగవతాచార్యుల విషయమునఁ బ్రయోగ్యముగఁ జేయును, “ఋతా మృతాభ్యాం జీవేత ప్రవర్తేయాపదాంబుషం” (ఋతము మూలమునను, అమృతము మూలమునను ప్రపన్నుఁడు జీవించునని) అన్నట్లు “ఋతముంఛశిలం జ్ఞేయ మమృతం స్యాదయాచితం) ఋతామృతము లనఁబడు అక్షయపాత్రమూలమునను సత్త్వగుణ ప్రధానులగు పరిశుద్ధులైనవారు అయాచితముగా సమర్పించిన ద్రవ్యము మూలముగను జీవనముఁ గడపుకొనుచు, శిష్యుని యెడల కృపయును, స్వాచార్యుని విషయమున పారతంత్ర్యమును, స్వజీవనము విషయమున వైరాగ్యమును గలవాఁడై అహంకారాదికామముల మూలముగ బాధపడనివాఁడై లోకహితముఁ గోరుచు, ద్వైప్రకృతిసంబంధమువలన శిష్యుం డొకవేళ తప్పుదారిని పోయినను క్షమించి, వాని స్వరూపము నుచక్కఁజేసి, వానిని వదలకుండ స్వరూపమును కాపాడుకొనుచు పోవువాఁడు ఆచార్యుండు.

—* ఆచార్యత్వ ద్వైవిధ్యము. *—

ఆచార్యత్వమనునది ఘటకత్వమనియు, ఉపాయత్వమనియును ద్వివిధము. ఘటకత్వమనఁగా— దివ్యపాటయి కైంకర్యపరులగుట కిష్టులయిన వారిని “సంవత్సరం తదర్ధంవా మాసత్రయమథాపివా” అన్నట్లు సంవత్సరము గాని, ఆఱు మాసములు గాని, మూఁడు మాసములు గాని, వారి హృదయమును పరీ

క్షించి, వారు ప్రాకృతవిషయవాసనారుచుల విషయమున ప్రాణము విసికి పరమాప్తులయిన దానిఁగని, అనన్యప్రయోజనులై మంగళాశాసనపరులు కాఁదగుదురని తోఁచిన పిమ్మట, వారిని భగవంతునితోఁ జేర్చి,శరణాగతులనుగాఁ జేసి,స్వరూపానురూపముగ నడచుకొనునట్లు శిక్షించుట.

ఉపాయత్వమనఁగా—స్వరూపానురూపములగు ననుష్ఠానాదులను బోధించినచో, వాటిఁ దెలిసికొనుటకుఁ దగిన జ్ఞానము గాని, అనుష్ఠించుకొనుటకుఁదగిన శక్తిగాని, లేనట్టి బాలురు,మూగవాండ్లు,జడులు,అంధులు,కుంటివాండ్రు, చెవిటివాండ్రు మొదలయిన వారు భగవంతుని నిర్హేతుకకటాక్షము గలవారయి, సంసారసంబంధములగు పనుల యెడల వైరాగ్యమును జన్మజరామరణాదుల విషయమున భయమును కలిగి, ఆప్తులగు వారిని జూచి దయాపరవశులై జ్ఞానానుష్ఠానోపదేశములను గ్రహించుటకు యోగ్యతలేనందున వారికిగాను తానే శరణాగతి చేసి, యౌషధమును సేవించుటకు యోగ్యతలేని చంటి బిడ్డకు జబ్బు వచ్చినట్లయిన, తాను ఔషధమును తిని తన పాలవలన నాబిడ్డయొక్క రోగమును బోగొట్టునట్టి తల్లివలెనే,వారిని యభిమానించి తమ తీర్థప్రసాదములమాహాత్మ్యములవలన వారు సంసారమునుండి యుజ్జీవించునట్లుచేయుట.

మూఁగవాఁడొక్కఁడు ఆర్తుండుగా నుండుటఁగని, శ్రీ భాష్యకారుల వారు వాని విషయమున దయగలిగి ,తమయొక్క శ్రీపాదంబులఁ జూపించి, వాటిని హృదయమునఁ బెట్టుకొనుమని చేతితో సంజ్ఞ చేసి వాని శిరస్సున నుంచిరి. ఈ సందర్భమును శ్రీ కూరత్తాళ్వారులు చూచి ,,అయ్యో మన

ము కాలవంతేమునఁ బుద్ధి శాస్త్రాభ్యాసముఁ జేసి చెడిపోయి నాము. మనమున్న ఒక [illegible]గవాఁడుగాఁ బుద్ధి నట్టయితే పరగతస్వీకారము లభించి యుండునే యని పశ్చాత్తాపపడిరి.

—* త్యాజ్యములను గురించిన విచారము. *—

ఏరు జ్ఞానానుష్ఠానములను లభించుట కశక్తులయినను ప్రవృత్తి నివృత్తుల కాశ్రయభూతులగు చేతనులగుటం జేసి, ప్రతికూలంబులగు వాటిని వదలుకొనవలయును. ప్రతికూలంబులనఁగా అహంకారమును, మమకారమును, పరహింసయును, పరనిందయును, పరస్తోత్రమును, పరదారపరిగ్రహమును, పరద్రవ్యాపహారము మొదలయినవియును, సత్వగుణమును చెడగొట్టునవియును, రజస్తమోగుణ ప్రోత్సాహకములునగు అభక్ష్య భక్షణమును, అపేయపానమును, (త్రాగ కూడనివాటిఁ ద్రాగుట) దేవతాంతర, సాధనాంతర, విషయాంతరముల యెడలఁ బ్రీతియును, భగవద్భాగవతాపచారములు మొదలగునవి. వీటిని వదలని యెడల, సదాచార్యాభిమానము సయితము రక్షింపఁజాలదు. దృష్టాంతము — ఒక మడిలో నిండుగ సస్యమున్నట్టయిన, ప్రక్కనుండు మడిలోని సస్యము ఆమడిసిటివలనఁ గల్గిన తేమవలన వృద్ధిపొంది ఫలించును. ఇంతియె కాని తుంగ మొదలుగాఁగల కలుపు పెరిగి వేళ్ళు పారకుండ చేయునట్టి భూమియందుండు పయిరును ప్రక్కభూమిలోనుండు నీరు రక్షింపఁజాలదు కదా! అయితే, "అచ్ఛేద్యస్చ్ఛేపి శరీరవ్రణ శ్రేయస్కరీ సద్గురు పాదసేవా। సమిత్పరుచ్ఛేదక శస్త్రియోగ్య రసేన హైమీకరణం సమానం" పరిశుద్ధులయినను అపరిశుద్ధులయినను, సద్గురువును సేవించినచో ఉజ్జీవింపగలరు

దృష్టాంతము — సమిత్తుయొక్క రసము వలన కత్తి బంగారమగు నుగదా) అన్నట్లు రసగుళిక కొడవలినిన్ని కత్తినిన్ని తారతమ్యము లేకుండ లోహ శస్త్రములను బంగారముగాఁ జేయునట్లు, పుణ్యాత్ములనియు పాపాత్ములనియును భేదము లేకుండ, సదాచార్య సంబంధ మందఱిని యుద్ధరింపఁజేయునదియని చెప్పియున్నదంటివేని, దృష్టాంతమున, కొడవలియును కత్తియున్ను అచేతనంబులయినందున ఛేదకత్వము తత్కర్తయగు చేతనుని యధీనంబై రసమునఁగలశక్తివలన బంగారమయినవి. అట్లు యీచేతనుండను స్వాచార్యాధీనంబులయిన సత్తమొదలగునవి కలవాఁడై, తానొక్కఁడానిఁ జేయక అచేతనమువలెనే పరాధీనుండయినట్లాయిన, అతఁడు జ్ఞానానుష్ఠానంబులు లేవనెడి కొఱతలేకుండ, సదాచార్యుని సంబంధమువలన ముక్తుండఁగును. అయితే ప్రతికూలంబులగు వ్యాపారములున్నట్లయిన, నశించిపోవును. దృష్టాంతము — శిష్యాచార్య సంబంధముకు ఎల్లభూమియగు శ్రీకూరత్తాళ్వారుల సంబంధముగల వాఁడయినను, * వీరసుందరుఁడను రాజు భాగవతాపచార

* పూర్వమొకప్పుడు వీరసుందరుఁడను రాజొక్కఁడుండెను. అతండు శ్రీకూరత్తాళ్వారుల శిష్యుండు. కూరత్తాళ్వారుల కుమారులగు భట్టరుకాలమున నతండు శ్రీరంగమున ప్రాకారముఁగట్టింపఁబూని ప్రాకారమువచ్చుదారిలో పిళ్లైపిళ్లై యాళ్వాన్ సన్నిధియున్నందున దానిని తప్పించికట్టితే ప్రాకారము వంకరగానుండునుగాన, నది నేరుగా నుండవలయునని తలంపుతో పిళ్లైపిళ్లైయాళ్వాన్ సన్నిధిని పడగొట్టివేసి ప్రాకారమును నేరుగా కట్టించుకొనిపోయిరి. ఆసందర్భమున భట్టరువారు పిళ్లైపిళ్లైయాళ్వాన్ సన్నిధపురాతనముగా నున్నదనియు దానిని పడఁద్రోయ

మువలన నశించిపోయినాడు గదా! కావున నిషిద్ధానుష్ఠానము గల వానికి సదాచార్య సంబంధ మున్నను అతండు ఉజ్జీవింప నేరడు.

“అచ్ఛేద్యస్యచ్ఛేద్యపి” అను ప్రమాణమున పరిశుద్ధుండైనను, అపరిశుద్ధుండైనను, ఉజ్జీవింపఁగలడని చెప్పియున్న దంటివేని, అది యంతకుముందు జరిగిన దానిని గురించి చెప్పుచున్నది. అదెట్లనిన, ““పాపిష్ఠః క్షత్రబంధుశ్చ పుండరీకశ్చ పుణ్యకృత్। ఆచార్యవత్తయా ముక్తౌ తస్మాదాచార్యవాన్ భవేత్” అన్నట్లు ఆచార్యుని యాశ్రయించుటకుఁ బూర్వము పుణ్యాత్ముండయినను పాపాత్ముండయినను, సదాచార్యుని యాశ్రయించి, వానికి పరతంత్రుండైనట్లయిన, పూర్వమొనర్చిన పుణ్య పాపములు నశించి * క్షత్రబంధు వనియు,

---

కుండ దానిని తప్పించి దానిచుట్టును ప్రాకారము గుండ్రముగా వచ్చునట్లు కట్టించవలసినది యనియు, అంతకుపూర్వము తిరుమంగైయాళ్వారులు కట్టించినప్పుడును శ్రీతొండరడిప్పొడియాళ్వారుల సన్నిధి అడ్డముగా రాగా దానిని చెడగొట్టకుండ దానిని తప్పించి ప్రాకారమును కట్టించినారనియు నిట్లు బహువిధముల చెప్పుచుండిరి. అంతట వీరసుందరునికి కోపమువచ్చి తనరాజ్యమున నుండకూడదని భట్టరువారిని నిర్బంధించిరి. అంతట భట్టరువారు తమశిష్యులగు నంజీయరు వారితోఁగూడ తిరుకోట్టియూరిలో నివసించుచు అచటనే తిరువాయ్మొళి వ్యాఖ్యానము సాయించినారని పెద్దలు చెప్పుదురు.

పూర్వ మొకప్పుడు క్షత్రబంధువనురాజొకఁ డుండెను అతఁడు మాంసాహారి. అతని నౌకరులు ప్రతిదిన మతనికి మాంసముఁ గొని వచ్చియిచ్చుచు నొకనాఁడు మాంస మెచ్చటను దొరకనందున నొక పశి

*పుండరీకుండను పాపాత్ములును పుణ్యాత్ములును సదాచార్య సంబంధమువలన ఉజ్జీవించినట్లు, ఉజ్జీవించుదురని చెప్పఁబడినది. ఇంతేకాని, "దురాచారోపి సర్వాశీ కృతఘ్నో నాస్తికః పురా సమాశ్రయేదాదిదేవం శ్రద్ధయా శరణం యది। నిర్దోషం విద్ధి తం జంతుం ప్రభావాత్పరమాత్మనః" (ఇంతకుముందు దు

---

బిష్ట మాంసముఁ గొనిపోయి యిచ్చిరి. దానిని భుజించినది మొదలు ఆరాజు నరమాంస భక్షణమున నాశగలవాఁడై నరమాంసమును భక్షించుచు క్రమేణ మనుష్యులను పీకితినుట కారంభించెను. అంతట మంత్రులతని చేతి కొక కత్తినిచ్చి యరణ్యమున వదలిరి. అతఁడును ప్రతిదినమును కనపడ్డ జంతువులనెల్ల నరికి తినుచుండెను. అంతట ఒకనాఁడు నారదమహర్షి యతనిఁజూచి నరుకునప్పుడెల్ల "గోవింద" యను నామము నుచ్చరించి నరుకుమని యుపదేశించెను. ఆదినము మొదలుకొని యతండు గోవింద నామ సంకీర్తనముచే ముక్తుండాగెను. కృతఘ్నుండు పాపిష్ఠుండయినను నారదుండను సదాచార్యుని సంబంధమువలన ముక్తుండాయెనని యభిప్రాయము.

* పుండరీకుండను మహర్షి చిరకాలము తపస్సుచేసి దానివలన నుపయోగము లేనందున శ్వేతగిరియను దివ్యదేశమున నందనవనము నొక దానిని నిర్మించి యందన మూలముగ ముక్తినిబొందుటకై యత్నించుచుండెను. ఒకదినమున భగవంతుండు ప్రత్యక్షమై నీకేమి కావలయునని యడుగఁగా, మోక్షము నీయమని కోరెను. నీ నందనవన మెక్కడ? మోక్ష మెక్కడ? అని యడుగఁగా, నాకు తెలియదనెను. అంతట భగవంతుఁడే యాచార్యుండై మోక్షమనునది భగవత్కృపవలన గలుగునది కాని, సాధనాంతరములవలనను గలుగునది కాదని యుపదేశించి మోక్షము నొసంగెను. ఈతఁడు చిరకాలముగ పుణ్యాత్ముండయినను, సదాచార్యుని సంబంధమువలన మోక్షమును లభించినాఁడని యభిప్రాయము.

రాచారుండైనను, అభక్ష్యభక్షణ చేయువాఁడైనను, కృతఘ్నుండైనను, నాస్తికుండైనను, భగవంతుని యాశ్రయించి శరణాగతుండైనచో, పరమాత్మయొక్క యనుగ్రహమువలన ఆతండు నిర్దోషుండగును) అను ప్రమాణవాక్యమున "ఇంతకు ముందు" అని యిట్లు సంశయములేకుండ స్పష్టముగానే చెప్పియున్నది కదా! "పయిలుం తిరువ్రుడయార్ యెవరేలుమ్" (భాగవత వైభవముగలవారు యెవరైనను) అను శ్రీతొండరడిప్పొడియాళ్వారుల శ్రీసూక్తికిన్ని ఇదియే యర్థము కాఁగలదు. ఇంతియే. ఆశ్రయించినపిమ్మటనున్ను బుద్ధిపూర్వకముగా దురాచారపరుండైనట్లయిన అట్టి యాశ్రయణమే రద్దయిపోవును. కావున సంసారబద్ధుండు గాను, దేహాత్మాభిమానిగాను, దారాపుత్రధనాదులయం దాసక్తికలవాఁడుగాను, విషయప్రవణుండు గాను, రాగద్వేషాదులు కలవాఁడుగాను, నడచుకొనుచు మనకు సదాచార్యసంబంధ మున్నది కదా! భగవత్సంబంధమున్నది కదా! యని తలంచుకొని దురభిమానియగుట కవకాశములేదు కావుననే కదా! ప్రపన్నునికి సంసారబీజము నశింపవలయునని శ్రీ తిరుక్కోట్టియూరు నంబిగారు సాధించి యున్నారు. "అనాత్మన్యాత్మబుద్ధిర్యా అస్వేస్వమితియామతిః" అన్నట్లు ఆత్మకానిదానియం దాత్మయనెడి తలంపును, తనదికాని దానియందు తనది యనెడితలంపును కదా! సంసారబీజమనునది. ఈ పై రెండును కదా! అన్ని యనర్థంబులకును మూలకారణములు. "అవిద్యాతరుసంభూతి బీజమేతద్ద్విధాస్థితం" (అవిద్యయనెడి వృక్షమువలనఁగలిగిన బీజములు రెండు) అన్నట్లు ఈ రెండును ఉన్నంతవరకును ఎంతజ్ఞానవంతులయినను, సంసారబంధ

ము నశించి భగవత్ప్రాప్తి గలుగునని తలంచుట కవకాశము లేదు. ఈవిషయమును మనస్సునందుంచుకొనియే శ్రీనమ్మాళ్వారులు “సెన్ఱుమఱ్ఱెన్నై వేర్ ముతల్ మాయ్త్తు ఇఱై శేర్మిన్” (మీరు మీదియనెడి అహంకార మమకారములను వేరుతో (గూడ) తెంచివేసి కడతేఱునది) అనుటవలన భగవంతుని యాశ్రయించినప్పటికిన్ని, సంసారబీజములగు ఈరెంటిను ఉన్నట్లయిన ఉపయోగములేదు, కావున ఈ రెంటిని పొత్తుగ నశింపజేసి అటుపిమ్మట భగవంతుని యాశ్రయించునది యని స్పష్టముగా దెలిపియున్నారు.

ఇవ్విధములగు అహంకారమమకారములును, వాటి మూలకముగ సంభవించునవియగు అర్థకామపరవశతయును, భాగవతాపచారమును ఈ మొదలగువాటిలో నొక్కటియును లేకున్నను, ఇవి సంప్రాప్తించుట కవకాశమిచ్చునది యగు శరీరముతో నుండుటనే హేతువుగాగొని యెక్కువ భయముకలవారై “యానే యెన్ఱనతే యెన్ఱిరుందేన్” (నేనే అనియు నాదే యనియును ఉండినాను) అనియు, “పలనీ కాట్టిప్పడుప్పాయో విన్నుం కెడుప్పాయో” (అనేకములను జూపించి నీవు నన్ను ఇంకను చెడిపెదవా) అనియు, “విణ్ణుళార్ పెరుమాఱ్కడిమై శెయ్వారైయుమ్ శెఱుమైమ్బులనివై మణ్ణుళెన్నై ప్పెఱ్ఱాలెన్ శెయ్యా” (పరమపద నివాసుల కధిపతియగు సర్వేశ్వరునికి కైంకర్యమొనర్చునట్టి నిత్యసూరులనున్న చెఱుపగల పంచేంద్రియములు భూలోకమున నుండునట్టి నన్ను ఆక్రమించినట్లయిన నేమి చేయగలను) అనియు, “కులముదలడుమ్ తీవినై క్కొడువన్ కుళియినిల్ వీళ్క్కుమైవరై వల

ముతల్ కెడుక్కున్ఱ వరుమేత్తదరుళ్ కండాయ్" (అనాదిగా చెడు
పును చేయునవియు, క్రూరమయినగుంటలో పడత్రోయునట్టివి
యగు పంచేంద్రియములను త్రెళ్లతోఁగూడ పోగొట్టునట్టివర
మును కృపజేయుమా) అనియు "అరుళాయుయ్యుమారెన క్కే"
(దాసునికి యుజ్జీవించుమార్గమును కృపచేయుమా) అని యిట్లు
శ్రీ నమ్మాళ్వారులును, "అమర్యాదః క్షుద్రః నృపశుర
శుభస్యాస్పదమపి | అనిచ్ఛన్నప్యేవం" "కృపయాత్వమే
వైవం భూతం ధరణిధర మే శిక్షయ మనః" (నేను మర్యాద
లేనివాఁడను, నీచుండను, పశువువంటివాఁడను, అమంగళ
ములకన్నింటికిని పుట్టినిల్లయినవాఁడను. ఓ సర్వేశ్వరుఁడా!
ఇట్టివాఁడనగు నాయొక్క మనస్సును కృపతో శిక్షింపుము)
అని యిట్లు పరమాచార్యులగు శ్రీ యామునాచార్యులవారును,
"శబ్దాదిభోగరుచిరన్వహమేధతే మే — వృత్త్యా పశుర్నర
వపుః — దుఃఖావహోహమసి శంతవ — శబ్దాదిభోగవిషయా
రుచిరస్మదీయా నష్టాభవత్విహ భవద్దయయా యతీంద్ర"
(శబ్దాదిభోగముల విషయమగు ప్రీతి ప్రతిదినము నన్ను బా
ధించుచున్నది — నేను నడవడికను బట్టి చూచితే మను
ష్యశరీరముగల పశువును — ఎల్లకాలము కష్టములోఁ
బడియుండువాఁడను. ఓ యతిరాజ! శబ్దాదిభోగములయెడల
నాకుఁగల ప్రీతి నీయొక్కదయవలన నశించుగాక) అని
యిట్లు మా ఆచార్యులగు శ్రీమణవాళమహామునులును ప్రతి
కూలంబులయినవాటిని తలంచుకొని దుఃఖపడి వాటినిరాకుండ
చేయుటకై ప్రార్థించియున్నారు కదా! కావున భగవత్సంబంధము

గాని సదాచార్యసంబంధము గాని ప్రతికూలంబులున్నవారి విషయమున నుపయోగపడదని తెలియుచున్నది.

శిష్యాచార్యు లుభయులును చెడి పోదగియుండువారు కావున, వారిలో నొక్కరిని వేఱొక్కరు కాపాడుకొనుచు శిష్యుండు చెడుదారిని పోవుచున్నట్లయిన, ఆచార్యుండు వానిని మందలించి శిక్షించునది. ప్రకృతితోనుండుటచే ప్రామాదికముగ ఆచార్యుండు చెడుదారినిపోవుచున్నచో, "గురుం రహసి బోధయేత్" అన్నట్లు ఏకాంతముగానుండునప్పుడు వాని రెండుపాదములను బట్టుకొని హితమును బోధించి, వీరికీదుర్బుద్ధిపోయి, పరిశుద్ధులగునట్లు, "అవేక్షణాత్ అమలంగళాక విక్రమ్" (అతఁడు పరిశుద్ధుండగునట్లు కటాక్షించును) అని సాయించినట్లు విశేషముగ కటాక్షింపవలయుననియు, "హితత్తై మాఱుడినడ త్తక్కడవన్" (హితమునుగురించి మార్చినడచుకొనఁగలఁడు 32వా) అని శ్రీవచనభూషణమున సాయించినట్లు, సర్వేశ్వరుని ప్రార్థించె జాగరూకుండై ప్రవర్తించునది. ఈ పైనిచెప్పినప్రకారము అధికారిగానుండువాఁడును, సదాచార్యసంబంధముగలవాఁడును, మంచిశిష్యునికుండవలసిన సద్గుణములుగల ముముక్షువుకు "తానే వైకుంఠం తరుమ్" అన్నట్లు సర్వేశ్వరుండే స్వయముగ ఈచేతనుండు తనను చేరునట్లు చేయును.

కావున చేతనులనెడి తారతమ్యమునుబట్టి ఆచార్యునికి సంతోషముఁగలుగఁజేయుటకై (1) జ్ఞాన, (2) వ్యవసాయ, (3) ప్రేమ (4) సమాచారములును, వారిలో జ్ఞానవంతులుకాని

---

(1) స్వరూపయాథాత్మ్యజ్ఞానము (2) ఉపాయాధ్యవసాయము (3) కైంకర్యప్రీతి (4) అనుష్ఠానము.

అశక్తులున్న ప్రతికూలంబులయిన వాటి నాచరింపకుండుట యనునది అవశ్యముగ నుండవలయును. ఇవి తదాచార్యాభిమాన నిష్ఠులకున్ను కావలసియున్నవి. అయితే తిర్యగ్జంతువులు గాని స్థావరపదార్థములు గాని యయినచో, అవి ప్రతికూలముల యినవాటి నాచరించుట యెంతమాత్రము లేదు గాన, వాటికి సదాచార్యాభిమానము మాత్రమే యుద్ధారకము. దృష్టాంతము—పూర్వ మొకప్పుడు శ్రీనంబిళ్ళైగారు కంచినుండి శ్రీరంగమునకు వేంచేయుచుండఁగా నొకరోజున చాలదూరము నడిచి ఎండవేడిమి కాయాసపడుచు వచ్చుచుండ, దారిలో నొక పెద్ద మఱ్ఱిచెట్టు కింద తాము తమతోఁగూడ వేంచేసిన స్వాములును కొంతసేపు విశ్రమించి, శ్రమదీర్చుకొని అచటనే వంట చేసి పెరుమాళ్ళకు ఆరగింపుచేసి తాము ఆరగించిరి. ఆరాత్రి యచ్చటనే శయనించి మఱునాడు ప్రయాణమై పోవునప్పుడు నంబిళ్ళైగారు స్వాములఁజూచి "ఈవృక్షము మనయందఱియొక్కయును క్షుత్పిపాసలను పోగొట్టినది చూచితిరా ? దీనికి మనమేమి చేయగలము" అని పలికి "గచ్ఛలోకానను త్తమాన్" (మంచిలోకములకు బొమ్ము) అని విశేషముగ కటాక్షించి రెండు చేతులతోను ఆవృక్షమును తడిపి పోవుచుండఁగా, సమీపగ్రామమునుండు ఒక బ్రాహ్మణుండు వీరిని చూచి పరిహాసించెను. నంబిళ్ళైగారును శ్రీరంగమునకు వేంచేసిరి.

ఆనాటిరాత్రి "తూవివిశుంపణి" అను తిరువాయిమొழியందు సాయించినప్రకారము గొప్ప మహోత్సవము యొక్క ధ్వని కలుగఁగా, ముందు పరిహాసముచేసిన బ్రాహ్మణుండును, ఆవూరిలోనుండు వారందఱును చూడవచ్చిరి.

అప్పుడు ఆకాశమునందొక దివ్యతేజస్సు కాన్పించెను. దానిసందర్భమును చూచి ఆశ్చర్యపడుచుండఁగా ఆవృక్షమున్ను బద్దలుగా పగిలి రెండుభాగములయి దానిలోనుండి పెద్దధ్వనితో దివ్యతేజస్సు బయలువెడలి ఆకాశమువైపుకుఁ బోయి యా దైత్యుని తేజస్సుతోఁ గలిసి పోవుటఁజూచి యచటికి వచ్చినవారు మిక్కిలి యాశ్చర్యపడి యిదేమోయని విచారింపఁగా నప్పుడు ఆబ్రాహ్మణుండు శ్రీనంజీయర్‌గారు వృక్షమును రక్షించిన విధముఁ దెలుపఁగా, విని యందఱును ఆనందించిరి. మరుదినము ఆ సమాచారమును నంబిళ్ళగారు విని ఆవృక్షముయొక్క చరమశరీరమునకు అభ్యంగనము, శ్రీచూర్ణ పరిపాలనము మొదలగువాటిని గావించి తిరువధ్యయనమును జరిపించిరని శ్రీ నంజీయరుగారు సాయించుచుందురు.

అయితే యిట్టి నిరతిశయపురుషార్థమనునది సదనుష్ఠానసంపన్నుఁడగు పురుషుండు ప్రార్థించి లభింపవలసినదై యుండ, స్థావరపదార్థ మిట్టి ఫలమును బొందుట శక్యమా? యని శంకింపఁదగదు. ఏలననఁగా, సర్వేశ్వరుండు దివ్యశక్తిసంపన్నుఁడై, నిరంకుశస్వతంత్రుండై పరమదయాళువగుటంజేసి వాఁడు అభిమానించి, యీయాత్మ యుజ్జీవింపవలయునని తలంచినట్లయిన, వాఁడు దేనినైనను చేయఁగలఁడు కదా! సర్వముక్తిప్రసంగము రాకుండ చేయుటకై కర్మజ్ఞానభక్తులనియు, ప్రపత్తియనియు, ఆచార్యాభిమానమనియు నిట్టి యొక హేతువును సంకల్పించి యంగీకరింపఁ దలంచినప్పుడు అంగీకరించువాఁ డగుటంజేసి "ఉన్‌మనత్తాలెన్నినైందిరుందాయ్" శ్రీ

మనస్సులో నేమి తలంచియున్నావు) అని సాయించినట్లు వాని యొక్క తలంపే యుత్తారకము.

"నాసౌపురుషకారేణ నచాప్యన్యేనహేతునా" అన్నట్లు మొట్టమొదట నిర్హేతుకముగ కటాక్షించి, అటుపిమ్మట అద్వేషము, ఆభిముఖ్యము, సత్సహవాసము, సదాచార్యోపదేశము, మంత్రార్థజ్ఞానము, దానికనుకూలంబులగు అనుష్ఠానములచేఁ బరిశుద్ధునిగాఁ జేసి, తనతోఁ జేరియుండనప్పుడు సంతోషించువాఁడుగాను, తనను విడనాడియుండునప్పుడు దుఃఖించువాఁడుగాను నగునట్లుచేసి, తానుతప్ప తక్కినవన్నియును "భోగాః పురందరాదీనాం తేసర్వే నిరయోపమాః" అన్నట్లు ఇంద్రభోగాదులను నరకప్రాయములైనట్లు తోఁపింపఁజేసి, క్షుద్రవిషయములయం దాసక్తిగలవాఁడు తాను కోరినది లభింపనందున "దృఙ్మనస్సంగసంకల్పజాగ్రతః కృశతారతిః హ్రీత్యాగోన్మాదమూర్ఛాన్తా ఇత్యనంగ దశాదశ" అన్నట్లు పదిమన్మథావస్థలనుఅనుభవించునట్లు, భగవంతుని యెడల యెక్కువప్రీతి గల యీయధికారియును, "కాణవారాయ్ మెన్నకణ్ణుమ్ వాయుమ్ తువర్న్దు" (కన్నులకుఁ గానఁబడుమాయని కంఠమున్ను నోరున్ను శుష్కించునట్లు) అనియు "ఎణ్ణ్ కొండశిందైయతామ్ నిన్నియన్ఱు" (అసంఖ్యేయములయిన మనోరథములు గలవాఁడై నిర్మలముగానుండి ఘోషించును) అనియు, "అడియేనడి కూడువతెన్నుకోలో" (దాసుండెప్పుడు దేవరవారి శ్రీపాదములఁ జేరునో) అనియు "కంగులుంపగలుమ్ కణ్తుయిలరియాళ్" (రేయుంబగళ్లు నిద్రనెఱుంగదు) అనియు "నైయుమ్ కణ్ణీర్ మల్క నిన్ఱు" (శిథిలమయిన మనస్సుకలవాఁడై కన్నీరుకార్చుచు) అనియు

యోత్తియిల్ వాழுం శరాశరం ముత్తవుం నర్పాలుకు[illegible]త్త
నన్ నాన్ముఖనార్ పెత్త నాట్టుళే" (విలక్షణమైన అయోధ్యా
నగరమున వసించుచున్న గడ్డి మొదలయిన వస్తువులనున్ను
అల్పములగు చీమలు మొదలగు ప్రాణములను, స్థావరజంగమ
పదార్థములన్నింటిని చతుర్ముఖుండు సృజించిన లోకమునందు
ఒక్క సాధనము లేకయే మోక్షమును బొందించెను.) అనియును
శ్రీ నమ్మాళ్వారులు సాయించియున్నారు కదా!

ఈ విభూతిలో నట్లుండ తగునా యని శంకింపఁబనిలేదు. అఘ
టితఘటనా సామర్థ్యముగలవాఁడును, సర్వశక్తిసంపన్నుండగు
సర్వేశ్వరుండు లీలయం దుపయోగపరచుకొన వలయున
ని తలంచి కర్మానుగుణముగ నిర్వహించుకొనునప్పుడు, స్వ
యత్నమువలన నెట్టియును కాఁజాలదే తప్ప, "విధివాయ్
క్కిన్ఱు కాప్పారార్" (కృప ఫలించునట్లయిన నివారించు
వారెవరు) అని సాయించినట్లు వానికి కృప కలిగినట్లయిన,
"ఎమ్మాత్రపావియర్క్కుమ్ విధివాయ్క్కిన్ఱు వాయ్క్కుమ్
కణ్ణర్ మెయ్యమర్ వాలాయ మున్నే" (ఎంతపాపులకయినను, భగవ
త్కృప ఫలించునప్పుడు తప్పక ఫలించునుసుమా) అని సాయిం
చినట్లు ఎటువంటి పాపిష్ఠులైనను, కృపఫలించునప్పుడు ఈ
యాకారంబు లన్నింటిని లభించి యుజ్జీవించుదురు. కావు
ననే "చితః పరమచిన్త్య శక్తిరపినోపధిః! విపర్యయేతు
తైవాస్య ప్రతిపేధాయ పాతకం" అన్నట్లు సర్వేశ్వరుండు ఈ
చేతనుని యుజ్జీవింపఁజేయఁ గోరినట్లయిన, అనాదికాలముగ
నార్జింపఁబడినదియు, భగవత్ప్రాప్తి విరోధియునగు పాపంబడ్డ
గింపఁజాలనందున, భగవంతుండు. తనకుతానే ప్రబడి ఈతనిచే

సుర్లభంతు) అనియు, "కశ్చిన్మాంవేత్తితత్త్వతః" (ఎవ్వండో
ఒక్కండు నన్ను యథార్థముగాఁ దెలిసికొనఁగలఁడు) అనియిట్లు
శాస్త్రమునందును, "ఓరోరువర్కుండాకిల్ అత్తనైనానుళ్ళమో"
(ఎవ్వరైనా నొక్క రున్నంటె అంతమాత్రము చాలునా) అని
యును శ్రీనంపాళ్ళైమహామునుల శ్రీసూక్తియందును దుర్లభ
మనే చెప్పియున్నారి కదా?

## —* కేవల పంచసంస్కారములు నిరుపయోగములు *—

కావున ఆచార్యుని యొద్దకొని పంచసంస్కారములను, నామమును మాత్రము లభించినట్టివారైనను, మంత్రవిరుద్ధము లగు దేహాత్మాభిమానము, అన్యశేషత్వము, స్వస్వాతంత్ర్యము, అహంకార,మమకార, ద్వేష, కామ, క్రోధ, మదమాత్సర్యములు కలవారై బద్ధసంసారులుగానుండి, పుత్ర ధన ధాన్య వ్యాసక్తులై ఒక్కరితోనొక్కరు అర్థకామాదుల మూలముగ గాని, అహంకారాదుల మూలముగఁగాని తగవులాడుకొనుచు, సేవింపగూడనివారి సేవచేయుచుండువారు ఇంకను నాలు రోజులు భగవంతుని లీలకు విషయభూతులగుదురు. దేహావసానకాలమునందైనను "పితరం మాతరం దారాన్ పుత్రాన్" అని సాయించినటుల ప్రతికూలులగు బంధుమిత్రకళత్రాదుల విషయమున విరక్తి కలిగి యొక్కువయార్తిగలవారైనట్లయిన యేటికి నీరురాబోవునప్పుడు ముందుగనే తగిన చిహ్నములు గానవచ్చునటుల,ముముక్షుపురుషుని లక్షణంబులన్నియును, "సదా పరగుణావిష్టో ద్రష్టవ్యస్సర్వదేహిభిః" అని సాయించినట్లు అందరికిని యాతనియందు తెలియవచ్చుటయే కాకుండ, తన కున్ను యిది చరమశరీరమని తెలియవచ్చును. అవసానకాల

మునునున్న పూర్వమువలెనే యున్నట్లయిన, జన్మాంతరము
ను బొందును. ఐతే "సకలు భాగవతా యమవిషయం
గచ్ఛంతి" (భగవద్భక్తులు యమునివశమున పడరు) అని చెప్పి
యున్నందున, అవినీతుండైనను యమలోకముఁ బొందడని
ప్రమేయరత్నమును గ్రంథమున సాధించియున్నారు.

ఒకానొక దినమున ఒక శ్రీవైష్ణవుడు శ్రీపెరియవాచ్చాం
బిళ్ళైగారి సన్నిధికి వచ్చి "స్వామీ మనము లీలకువిష
యమా? కృపకు విషయమా?" అని యడిగెను. అంతట పిళ్ళై
గారును "శరీరమును నమ్మియుంటిమా లీలకువిషయము కాఁ
గలము. ఆత్మను నమ్మియుంటిమా కృపకు విషయము కాఁగల
ము" అని బదులు చెప్పిరి.

కావున "త్వఙ్మాంస రుధిరస్నాయు మేదోమజ్జాస్థిసం
హతౌ। దేహే చేత్ప్రీతిమాన్మూఢో భవితా నరకేపి సః" అని
చెప్పియున్నట్లు దేహాభిమానులై, తైలఘృతాదులవలన దేహ
మును బలపఱచి, విషయములయెడల ప్రీతిగలవారై దేహ
మును బట్టియుండువారగు భార్యాపుత్రాదుల విషయమున నను
రాగము గలిగి శాస్త్రమునకు లోఁబడినవారు కాకుండ, యిష్టము
చొప్పున సంచరించువారయినట్లయిన, సర్వేశ్వరుని లీలకు
విషయభూతులగుదురు. ఆత్మస్వరూపమునకుఁ దగినట్లు ఆకా
రత్రయ సంపన్నులై, యర్థపంచకజ్ఞానముగలవారై, హేయో
పాదేయంబుల నెఱింగి, స్వరూపవిరుద్ధములగు ప్రతికూలంబు
లయిన వాటినన్నింటిని త్యజించి, నువ్వులలో నూనెవలెనే వివే
చింప శక్యముగానిదియు, త్యజించుట కశక్యమైనదియునగు తన
దేహముఁ జూచినట్లయిన, శత్రువునుఁ జూచినట్లు భయపడి,

దానిని పోషింపక, నియతముగు నాహారమునను దేహధారణ
మాత్రము స్వీకరించి శాస్త్రమునకు లోబడినవారై అహంకార
రహితముగ నడచుకొనువారయినట్లయిన, సర్వేశ్వరుని కృపకు
పాత్రులగుదురు. కావున సదాచార్యుని వరించి, వారు ప్రసా
దించిన యర్థములం దెలిసికొని ఆప్రకార మనుష్ఠించుకొను
నట్లయిన మోక్షార్హులగుదురు.

—* ప్రపన్నాధికారి ద్వైవిధ్యము *—

ఇట్లు ఆచార్యుని వరించునట్టి యధికారులు ప్రథమ ప్రప
న్నులనియు, చరమ ప్రపన్నులనియును రెండు తెగలవారు.
వీరిలో ప్రథమ ప్రపన్నులనంగా—ఆచార్యుం డుపదేశించిన
విధమున భగవంతుని కెక్కువ పరతంత్రులై వానియందె
ప్రీతిగలవారై "శేలే కణ్ణియరుం పెరుచెల్వం నన్
మక్కళుం మేలాత్తాయ్ తందైయుమవరే" (మత్స్యముల
వంటి నేత్రములుగల స్త్రీలును మహదైశ్వర్యమును సత్పు
త్రులును మిక్కిలి ప్రీతిగల తల్లితండ్రులును ఇంకమీద
సర్వేశ్వరుండే) అన్నట్లును, "వాసుదేవ స్సర్వమితి"
(సర్వేశ్వరుండే అంతయును) అనియును సాయించి యున్నట్లు,
సమస్తాళ్వారులవలెనే యుండువారు. చరమ ప్రపన్నులనం
గా—ఆచార్యుండు కృపతో నుపకరించిన భగవద్విషయమునం
గల వైలక్షణ్యము బాగుగ మనస్సున నాటి యిట్లుపరమవిలక్షణ
మగు వస్తువునుగురించి తెలుపుటచే నొనర్చిన మహోపకార
మును దలంచి యిందులకు బదులుగ మన మేమిచేయంగలమని
యోచించి "మాతా పితా యువతయః సర్వం" అని సాయిం
చినట్లు, వేఱొక్క విషయము నెఱుంగనివారై దేవతాంతర

విషయమును వాసనయున్ను లేనివారై శ్రీ మధురకవులవలెనే యుండువారు వీరిద్దరికిని ప్రథమ పర్వ నిష్ఠ లనియు, చరమ పర్వనిష్ఠులనియు నిట్లు పర్వభేదమేతప్ప ప్రాతికూల్య నివృత్తి మొదలుగాఁగల యధికార లక్షణము లన్నియును అవశ్యకములే.

—* ఆచార్యుని యాశ్రయించుట సులభము *—

అయితే భగవంతుని యాశ్రయించుట దుర్లభమనియు, ఆచార్యుని యాశ్రయించుట సులభమనియును చెప్పుతారే అది యెట్లాటిదని తెలిపెదను. ప్రథమ నొకయర్థముఁ జెప్పితిమని దానిఁ దెలిసికొనుటకుఁ గావలసిన జ్ఞానమున్ను అనుష్ఠించుకొనుటకుఁ గావలసిన శక్తియున్ను లేనట్టివారగు చెవిటివారు మొదలగు అనధికారులకున్ను ఫలము నిచ్చునదియనియు, (భగవంతునివలెనె) శాస్త్రమువలనఁ దెలిసికొనవలసినవాఁడు కాకుండ ప్రత్యక్షముగాఁ దెలియవచ్చువాఁడనియును, ఈ చేతనుఁడు చెడు దారిని పోవుచున్నట్లయిన, ఈతని యిష్టమునకు నెట్టి అనుమతి నిచ్చునట్టి సర్వేశ్వరునివలెఁ గాకుండఁ బ్రతి యున్నంతవరకును ప్రార్థించి, సిఫారసుచేసి సర్వేశ్వరుండు దిష్టము వచ్చినట్లు [illegible] యోగపడనుకొనుటకుఁ దగినట్టి వానినిగాఁ జేయునని తలంచి సదాచార్యాశ్రయణ మమోఘమని "సిద్ధిర్భవతి వానేతి సంశయోఽచ్యుతసేవినాం। నసంశయోఽస్తి తద్భక్త పరిచర్యారతాత్మనాం" (సర్వేశ్వరు నాశ్రయించువారికి మోక్షము కలుగునా? కలుగదా? యనెడి సంశయము కలదు. వాని భక్తుల నాశ్రయించు వారికిట్టి సంశయ మేదియును లేదు) అన్నట్లు చెప్పఁబడినది. ఇంతియే. అయితే నియమింపఁదగిన

యోగ్యతయుండి. సదాచార్యుండు శాస్త్రమునం జెప్పియున్న ప్రకారము నియమించినట్లయిన, వాని నియమనము ప్రకారము నడచుకొనక, పోమారిపోతులై యథేష్టముగ సంచరించువారై ప్రవర్తించినను,ఫలము సిద్ధించునని చెప్పకూడదు కదా? అట్లు చెప్పినచో, భాగవతాపచారము మొదలుగాఁగల ప్రాతికూల్యములున్నను, కొరత లేదని ప్రసక్తించును. ఇంతయే కాక, పూర్వాచార్యుల శ్రీ సూక్తులలోను, అనుష్ఠానంబులతోనున్ను విరోధము సంప్రాప్తించును.

—* సర్వేశ్వరుని యాశ్రయించుట దుర్లభమనుట *—

భగవంతుని యాశ్రయించుట దుర్లభ మెట్లంటివేని, భగవంతుఁడు కంటికిఁ గానవచ్చువాఁడుకాడు. విగ్రహరూపముగఁ గానవచ్చినను, నోరు తెరచి యొక్కమాటయైనను చెప్పక, యీతండు దుర్వాసనామూలముగ విషయప్రవణుండై చెడుదారిన పోయినను, వీనియిష్టమును గన్పెట్టి యనుమతినొసంగి, కర్మానుగుణముగ ఫలము నొసంగువాఁడగుటం జేసి వానికిచేతనుండు భోగాస్థుండయినను (మోక్షమును బొందినను) లీలార్థుండైనను (సంసారములోనున్నను) ఒక్కటియే. కావున శాస్త్రముకు లోబడినవాఁడై యధికారి యయినట్లయిన, తన భోగమునకై యుపయోగ పఱచుకొనును. ఆజ్ఞ నతిక్రమించి చెడు దారిని పోవువాఁడయినట్లయిన, లీలయం దుపయోగపఱచుకొనును.

—* సదాచార్య సంబంధము శీఘ్రముగ ఫలము నిచ్చునదియనుట *—

సదాచార్యుండన్ననో, తనను ఆశ్రయించినవాఁడు లీలార్థుండగు నట్లు వానిని విడిచిపెట్టక, భోగార్థునిగాఁ జేయుటయే వానిపని. అది యెటువలెననిన, రాజయినవాఁడు రోగ

పీడితురాలగు నొక వేశ్యపై కన్నువేసి, యీపెను భోగంబున కస్తురాలగు నట్లు చికిత్స చేయుమని యొక యుత్తమ వైద్యునికి నియమింపఁగా, నతండు, దివ్యమగు ఔషధమునిచ్చి పథ్యమునుబెట్టి క్రమముగ నయముచేసి బాగుగ పరీక్షించి ఆరోగ్యము గలిగినపిమ్మట యాతనిభోగమున కర్హురాలని యతని కొప్పగించునే తప్ప, లోపలయున్నట్టి రోగము లట్లే యుండఁగా, పైకిమాత్రము పసుపు, కుంకుమ, చందనము, కాటిక మొదలగువాటితోను మంచి మాలలతోను వస్త్రాభరణాదుల తోనును అలంకరించి భోగార్హురాలయినదని వానియొద్దకు పంపినట్లయినచో, ఉభయులకును శిరశ్ఛేదమునకును కష్టం బులు సంభవించును కదా! అట్లే పరతంత్రుండగు తన యా చార్యుండును ఈచేతనుని నిఖిల హేయప్రత్యనీకుండగు సర్వే శ్వరుని భోగంబున కర్హునిగాఁ జేయునప్పుడు, చిరకాలముగ విషయాంతరపరుండై పోయినట్టి యీతనియొక్క యవిద్యా, కర్మ, రుచి, వాసనారూపములగు దోషంబు లట్లే యున్నప్ప టికిన్ని, నామరూపంబు లుండునట్లుచేసినదే చాలుననుకొని, సమర్పించినట్లయిన, ఉభయులకును వినాశమే సిద్ధించుననుకొని బాగుగ దిద్దుపాటు చేయును గాన, సదాచార్యసంబంధము శీఘ్ర ముగ ఫలమునిచ్చునదయని యపేక్షింపఁబడినది.

శ్రీ రామానుజులవారి నాశ్రయించినవాఁడయినను, అరం గమాళికయనువాఁడు విషయప్రవణుండై యుండుటఁజూచి, అనేకవిధములుగ శిక్షించి భగవద్గీతలయందలి పదునెనిమిది యధ్యాయంబులనున్ను చదివి, చెప్పి, దానియర్థము వాని మనస్సులో పడునట్లుచేసి, నిద్రాహారములను గమనింపక

వైరాగ్యము కలవానినిగాఁ జేసి, కృపాపరతంత్రునిగాఁ జేసి నాఁడు. కావున ఈచేతనుండు దుష్టుండైనను, రక్షింపగలరను మాట సత్యము.

„ఇనుమేయినియదుశువర్క్కత్తిలే తిరందు” అను పాశురమున „శ్రీ రామానుజులవారే రక్షకులని శరణాగతి చేసిన పిమ్మట మన యిష్టప్రకారము మనలనువదలి, నేను విషయములయెడల ప్రీతివలన దుర్మార్గము నవలంబించి స్వర్గ నరకంబులను బొందుటకు సమ్మతింతురా? సన్మార్గమున ప్రవర్తించునట్లు దిద్దుపాటుచేసి, కైంకర్యముఁ గొనువారయిన పిమ్మట ఓమనస్సా! భగవత్ప్రాప్తికై యిఁక నీవు కృశింపకు” అని యిరంగత్తముధనారు సాయించియున్నారు కదా!

ఇంకను భగవంతునికి ప్రపత్తిచేసినవానికి ప్రమాదవశముగ ఐహికదోషంబులు సంభవించినను, „అవిజ్ఞాతాహి భక్తానా మాగస్సు కమలేక్షణః” (కమలమువంటి నేత్రములుగల సర్వేశ్వరుండు భక్తులదోషములను గమనింపఁడు) అనియు, „దోషే యద్యపి తస్య స్యాత్” అనియు, „సాధురేవ సమంతవ్యః” (భగవంతుఁడు హితదృష్టిగలవాఁడని తెలిసికొనునది) అనియు, „శెయ్దారేల్ నన్రుశెయ్దార్” (నాథభక్తులు దోషంబుల నాచరించినను వారు మంచిచేసినట్లే) అనియును, చెప్పియున్నట్లు, సర్వశక్తియుక్తుండగు సర్వేశ్వరుండు నిరంకుశ స్వాతంత్ర్యములోఁ గూడియుండునట్టి దయాళువగుటంజేసి! మిత్రభావమే చాలునని తలంచి, తన నెదిరించినట్టి వానితోనున్న పోరాడి తన నాశ్రయించునట్లుచేసి, రక్షించినను రక్షింపవచ్చును.

ఆచార్యుండన్ననో, భగవత్పరతంత్రుండగుటంజేసి, కంసాలి రాజునకు నొకపని చేయునప్పుడు ఫలము వేసి బంగారును పరిశుద్ధముగాఁజేసి రాజునకు పనిచేసియున్నట్లు, ఈచేతనుండు భగవంతుని భోగమున కర్హుండగునట్లు, ప్రాకృతభోగంబుల యెడల వైరాగ్యముగలవానినిగాఁజేసి ఇంకను కావలసినట్టి ప్రపన్నాలంకారంబుల నన్నింటిని గలుగఁజేసి, ఆజ్ఞాప్రకారము నడచుకొనువాఁడయినట్లయిన, భగవద్విషయమున నన్వయించునట్లు విశేషముగ కటాక్షించును. ఇట్లు కటాక్షింపఁబడినట్టి యీచేతనుండు ఏరసుండకునివలెనే, ప్రతికూలుండయినట్లయిన, ఎన్నటికిని వాని ముఖము చూపకుండ పోవువాఁడగుటంజేసి, యాచార్యునికి ప్రపత్తిచేసినవానికే యెక్కువ యధికారి సంపత్తి యుండవలయును.

సర్వేశ్వరుండు తాను స్వయముగ అంగీకరించినట్టి యధికారికంటెను సదాచార్యునిచే బాగుగ శిక్షింపఁబడినట్టి యధికారియెడల యెక్కువ సంతోషముకలవాఁడై యుండును. ఈ యధికారి తన విషయమున ప్రవర్తించునప్పుడు, త్యాజ్యోపాదేయంబులను బాగుగా నెఱింగి, తనకు సంతోషము గలుగునట్లు ప్రవర్తించునని "మమ మద్భక్త భక్తేషు ప్రీతిరభ్యధికా భవేత్" (నాదాసులకుదాసులయినవారి యెడల నా కెక్కువ ప్రీతికలదు) అని భగవంతుఁడే చెప్పియున్నాఁడుకదా! కావున చరమ ప్రపన్నుండైన యధికారియే విలక్షణమైనట్టి యనుష్ఠానము గలవాఁడై యుండవలయును.

### —* రహస్యత్రయానుసంధానమునకుండవలసిన లక్షణములు *—

ఈ యధికారికి రహస్యత్రయానుసంధానము చేయుటకు

ముందుగ "బాహ్య సంబంధములను బాత్తుగ వదలుకొన వలయును" అని యారంభించి చెప్పియున్నట్టి వైష్ణవాధికారి లక్షణంబు లుండియుండవలయును. అవి యేవియనఁగా—

"పితరం మాతరం దారాన్ పుత్రాన్ బంధూన్" అనియు, "క్షేత్రాణి మిత్రాణి ధనానిచ" అనియును చెప్పియున్నట్టి పితా, మాతా, భార్యా, పుత్ర, రత్న, ధన, ధాన్య, గృహ, క్షేత్ర, మిత్ర, పశు, బంధు వర్గాదుల నన్నింటిని యగ్నితో సమానముగఁ దలంచి, వాటిని రుచి వాసనలతో సయితము పరిత్యజించుటయు, ఇవియన్నియును సర్వేశ్వరుండే యనుకొని వాని నాశ్రయించియుండుటయు, అట్లు త్యజింపవలసిన వాటిని త్యజించియు, గ్రహింపవలసినవాటిని గ్రహించియును ఉంటి మేని తప్పక ఫలముకలుగునని నిశ్చయించుకొని యుండుటయు, ప్రాప్యమగు ఫలము లభించుటకై త్వరపడుటయు, ఈ లోకమునను న్నాన్నట్లు దివ్యదేశముల విషయమున ప్రీతియు, సర్వేశ్వరుని గుణానుభవ కైంకర్యములవలన కాలక్షేపముఁ జేయుటయు, ఇట్టి విలక్షణులయొక్క యతిశయముఁగని సంతోషించుటయు, మంత్రత్రయమునందు నియతుండుగా నుండుటయు, ఆచార్యసన్నిధిని వసించుటయు, ఈ మొదలగునవియన్నియు ముక్షుప్పడియను గ్రంథమునఁ జెప్పఁబడినవి.

—* ప్రబంధముల ననుసంధించుకొనుటకుగావలసిన లక్షణములు *—

ఇఁక ఆళ్వారుల గ్రంథముల కధకారులు జీవన్ముక్తులు. వారెవరంటె, "నశబ్ద శాస్త్రాభిరతస్య మోక్షః స్యాత్ వరమ్యావసథప్రియస్య నభోజనాచ్ఛాదన తత్పరస్య నలోక విత్తగ్రహణరతస్య। ఏకాంత శీలస్య దృఢవ్రతస్య పంచేంద్రియ ప్రీతిని వర్త

కస్య, అధ్యాత్మ విద్యారత మానసస్య మోక్షో ధ్రువో నిత్య మహింసకస్య," శమదమనియతాత్మా సర్వభూతానుకంపీ। విషయ సుఖవిరక్తో జ్ఞానతృప్తః ప్రశాంతః అనియత నియతాన్నో నైవరుష్టో నహృష్టః ప్రవసిత ఇవ గేహే వర్తతే యస్స ముక్తః" అన్నట్లు, ప్రాకృత శాస్త్రమునం దభిలాషకలవానికిని, గృహమునందు ప్రీతిగలవానికిని, అశనాచ్ఛాదన స్త్రీభోగాదులవిషయమున ప్రీతిగలవానికిని సంసార సంబంధములగు మహ్యకర్మములయందు ఆసక్తిగలవానికిన్ని మోక్ష యోగ్యత లేనందున వాటిని త్యజించి సంసారులతోఁ జేరి తిరుగకుండ, యేకాంతశీలుండై సర్వేశ్వరునిచేతనున్ను చలింపఁజేయుటకు శక్యము కానంత శిష్టాచారమున దృఢమైన మనస్సుకలవాఁడై, శబ్దాది విషయములయెడల వైరాగ్యముకలవాఁడై వేదాంత విచారపరుండై, భూతద్రోహి కాకుండ, పరమదయాళువయిన వానికే మోక్షము తప్పక కలుగునని నిశ్చయించుకొని, శమ దమాద్యాత్మ గుణ పరిపూర్ణుండై, సర్వభూతదయాళువై, విషయ సుఖవిరక్తుండై, విజ్ఞాన పరిపూర్ణుండై, జ్ఞానశూన్యులగు సంసారులు తనను తర్జన భర్త్సనములచే పరిభవించినను, తాను మనస్సున వికారమును పొందక శాంతచిత్తుండై భోగ్యవస్తువులనే భుజింపవలయునను నియతిలేకుండ, యేదైనను ఆకలి తీర్చుకొనుటకుగాను పరిశుద్ధవస్తువును భుజించి జీవనము చేయునట్టి నియతిగలవాఁడై, లోకమునఁగలుగునట్టి మంచిచెడ్డలను గురించినసుఖదుఃఖములు లేనివాఁడు గృహమునవసించుచున్నను, జీవన్ముక్తుండని చెప్పఁబడును. ఇట్టి యధికారియే యాచార్యుల ప్రబంధముల ననుభవించుటకు యోగ్యుండని గురు

పరంపరా ప్రభావమున పిన్బళకియపెరుమాళ్ జియ్యరువారు సాయించియున్నారు కదా!

ప్రపన్నుండు మంత్రములను ప్రబంధములను అర్థముతోఁగూడ అనుసంధించుకొనునది.

ప్రపన్నుండయినవాఁడు మంత్రములనయినను ప్రబంధములనయినను అర్థానుసంధానముతో శబ్దానుసంధానముఁ జేయవలయును. "ద్వయమర్థానుసంధానేనసహ" అనియు, "ఇప్పొరుళ్ నైకల్ పాడవల్లార్ వానోర్కు రావముతే" అనియును నిర్లశ్రీభాష్యకారులవారును శ్రీనమ్మాళ్వారులును సాయించినారు కదా! జపహోమాదులు శబ్దశక్తి మూలముగ రక్షకములగుట యుపాసకునికి కదా! ప్రపన్నునికన్ననో, అర్థముఁ దెలిసికొనుటచే ఇవి త్యాజ్యములు, ఇవి యుపాదేయంబులనెడి వివేకముఁ గలుగఁజేసి, త్యాజ్యంబులను విడిపించి ఉపాదేయంబులను స్వీకరింపఁజేయుటచే రక్షకములగును ఇంతియే. రక్షించుటయనఁగా రక్షకుండగు సర్వేశ్వరునియొక్క యనుగ్రహమునకు పాత్రులనుగాఁ జేయుట. అది యెట్లనిన, "దేహాసక్తాత్మబుద్ధిర్యదిభవతిపదం సాధు విద్యాత్తృతీయం స్వాతంత్ర్యాన్ధోయదిస్యాత్ ప్రథమ మితర శేషత్వ ధీశ్చేద్ద్వితీయం ఆత్మత్రాణోన్ముఖశ్చేన్నమ ఇతిచ పదం బాంధవాభాసలోలః శబ్దం నారాయణాఖ్యం విషయ చపల ధీశ్చేచ్చతుర్థీం ప్రపన్నః" అన్నట్లు ప్రపన్నుండును శరీర సంబంధముతో నుండువాఁడగుటచే స్వరూపమునకు విరుద్ధములయినవి సంప్రాప్తింపగలవు. ఆయా సమయములయందు అట్టి విరోధులను బోగొట్టునట్టి మంత్రముయొక్క పదముల యర్థమును అను

సంధించుకొని వాటిని తొలగించుకొనునది. అట్లు వాటిని తొలగింపని యెడల పూర్వమువలెనే యజ్ఞానమే ఫలించును.

—* మకారార్థానుసంధానము *—

దేహమే యాత్మయనెడి తలంపు కలిగినప్పుడు, ప్రణవమందలి ( అ - ఉ - మ ) మకారముయొక్క యర్థమును అనుసంధించుకొని మనము జ్ఞానానంద స్వరూపముగలవారము కామా? దేహ, ఇంద్రియ, మనః, ప్రాణ, బుద్ధి లకంటెను విలక్షణులము కామా? అని యిట్లు దానిని తొలగించుకొనునది. తొలగించుకొనుట యనఁగా— దేహముతో సంబంధించి యుండు వర్ణాశ్రమాచారంబులను పైబెట్టుకొని "అహ్ఘ్యోభి జనవానస్మి కోన్యోస్తి సదృశో మయా" (నేను పూజ్యుండను గొప్పవంశమున జన్మించినవాఁడను నాతో సమానుం డెవ్వఁడు?) అన్నట్టి యహంకారమున, పరుష సంభాషణముచే ఈ దేహమును పరిభవించువారిని శత్రువులను గాఁ దలంచి దేహాభిమానమువలన "అతఁడు మనలను పరిభవించుచున్నాఁడే" యని వానిపై కోపమును, అహంకారమునున్ను నివర్తింపఁ జేసికొని, "నాహం విప్రో న చ నరపతిః నాపి వైశ్యో న శూద్రః" (నేను బ్రాహ్మణుండను కాను, క్షత్రియుండను కాను, వైశ్యుండను కాను, శూద్రుండను కాను) అని యారంభించి "లక్ష్మీభర్తుర్నరహరి తనోర్దాస దాసస్య దాసః" (అయితే నేను లక్ష్మీపతియొక్క దాసానుదాసుండను) అనువరకును చెప్పియున్నట్లు, బ్రాహ్మణాదివర్ణములును దేహవికారంబులయినందున, దేహముకంటెను వేఱయిన వాఁడగు నాకు ఇవి యేవియును లేవనియు, నేను వైష్ణవులకు దాసుండను అని తలంచియుండు

టయు, ఈ దేహమును పరిభవించువారిఁ జూచి అత్యంత బంధు
వులనుగాఁ దలంచి, ఈదేహము మనకంటెను వేఱయినదై
త్యాజ్యమై, హేయమైనదై, విపరీతజ్ఞానమును గలుగఁజేయునది
యై, కామక్రోధాది రూప శత్రువర్గముగలదియై, స్వస్వరూప
మునున్ను తెలియరాకుండచేయునదియై, చెరసాలవలెనే అన
ర్థముఁ గలుగఁజేయునట్టిది కాదా? దీనికి బాధపెట్టుటయును
మన పనికాదా? అనుకొని వారియెడల సహనమును, కృప
యును, సఖ్యమును, సంతోషమును, ఉపకారస్మృతియును ఉండ
వలయును. ఇవి యున్నట్లయిన, మకారముయొక్క యథార్థజ్ఞాన
ము సిద్ధించును. ఇవ్విధముగ దేహాభిమానమును నివర్తింపఁ
జేసికొనుటయే మొట్టమొదట యుండవలసినది. ఇది యున్న
ట్లయిన, సంసారబీజము నశించి, స్వరూపము సిద్ధించును.

— * అకారార్థానుసంధానము * —

స్వస్వతంత్రుండనెడి తలంపు గలిగినట్లయిన, కారణత్వమును,
రక్షకత్వమును, శేషిత్వమునున్ను తెలుపునట్టిదియగు
అకారముయొక్క యర్థము ననుసంధించుకొని, "మనము భగ
వంతునికి శేషభూతులము కామా? మనకు స్వాతంత్ర్యము
తగునా" అని యట్టి తలంపును పోగొట్టుకొనునది.

— * ఉకార, నమశ్శబ్ద, అయన ఇత్యాదుల యర్థానుసంధానము. * —

వేఱొక్కనికి శేషభూతులమనెడి తలంపు గలిగినట్లయిన, అ
నన్యార్హత్వముఁ దెలుపునట్టిదియగు ఉకారముయొక్క యర్థ
ము ననుసంధించుకొనునది. తనను రక్షించుకొనుటలో సంబం
ధము తనకు కలదనెడి తలంపు కలిగినట్లయిన, "నమః" అను
శబ్దముయొక్క యర్థము ననుసంధించుకొని నాకు భగవంతుం

జే రక్షకుండు. నన్ను నేను రక్షించుకొనువాఁడను కానని నిశ్చయించుకొని యట్టి తలంపును నివర్తించుకొనునది. అస్త్రానందు రక్షకులు కానట్టి వారియెడల బంధువులనెడి తలంపు గలిగినట్లయిన, "అయన" అను శబ్దముయొక్క యర్థమునను సంధించుకొని, ప్రాప్యుండైనవాఁడే సర్వవిధములచేతను బంధువనుకొని యట్టి తలంపును నివర్తించుకొనునది. విషయ చాపల్యము గలిగినట్లయిన, "ఆయ" అను చతుర్థియొక్క యర్థమునను సంధించుకొని, "మనము వేఱొక్కనికి భోగ్యులము కాము కదా! సర్వేశ్వరుని కిష్టమువచ్చినట్లు వినియోగపఱచుకొనుటకుఁ దగినట్లు ఉండవలయునే తప్ప, మనకు వేఱొక్క విషయానుభవము తగునా? యనుకొని యట్టి తలంపును నివర్తింపఁ జేసికొనునది.

ఇవ్విధమున, మంత్రార్థజ్ఞానమువలన త్యాజ్యోపాయంబుల నెఱింగి, దేహాభిమానాదులను పరిత్యజించి, శేషత్వ, పారతంత్ర్య, కైంకర్యములు సంగీకరించినవాఁడై ప్రవర్తించినట్లయిన, స్వరూపము సిద్ధింపఁగా, భగవదనుభవ ప్రీతులై ముక్తి కర్హులు కాఁగలరు. అట్టి యర్థానుసంధానమున కనుగుణమగు ననుష్ఠానము లేనట్లయిన, నిత్యము నూఱుపర్యాయములు మంత్రార్థ కాలక్షేపములఁ జేసినను, నిత్యసంసారులై పోవుదురని భట్టరువారు సాయించుదురు.

—* ఆచార్యుల ప్రబంధముల యర్థజ్ఞాన ప్రకారము *—

ఇఁక ప్రబంధములను అభ్యసించినందువలన ఫలము వాటిలో సాయించిన విధమున, "అరియక్క ప్పెల్లారానాల్ స్వేష్టవస్తు సిద్ధి" అని సాయించినట్లు తెలిసికొని యనుష్ఠించుటకే సమర్థ

లయినట్టియున నైష్యవత్త్వము సిద్ధించి, "తొణ్డువప్పాడి యాడ
వల్లార్ వైకుంద మేరుపరే" (పాడిన్నృత్యము చేయునట్టి వారయి
నట్టియున వైకుంఠముకుఁ బోవుదురు) అన్నట్లు ముక్తులగుదు
రు. అర్థము తెలియక, నోటిపాఠముమాత్రము వచ్చిన వారయి
నట్టియున, (శర్కరాపాకరసంయుథా) (కూర రుచిపాత్రకు తెలియదు)
అన్నట్లు పూరకు నాలాసారము వచ్చును మోక్షమువ్వారము
వచ్చును అని యహంకారముకు హేతువై ప్రయోజనము
లేనిద యగును. "పాఠాదేవ ప్రశంసితతమః" (నోటిపాఠము
వలననే యజ్ఞానము నశించినవాడు) అని చెప్పియున్నదేయం
టివేని, శాస్త్రార్థజ్ఞానము లేకున్నచో, హేయోపాదేయంబు
లివ్వియని గుర్తెంగి ప్రవర్తించుటకు యోగ్యత లేకపోవుటం
జేసి, అజ్ఞానము నివర్తింపదు కదా! అయినను, అట్లు చెప్పినది
దానియొక్క ప్రభావమును స్తుతించుటకు గావచ్చును. అది
యెట్లనిన "కూరుతప్ వల్లార్ కళ్ళియ్ కేల్ కూడువర్ వైకుంఠమే"
అను తావున ఈ పది పాశురములను అనుసంధించువారు
ముక్తులగుదురని పాడియుంచినారని వాటిననుసంధించుకొని, దానికి
విరుద్ధముగ భాగవతాపచారాదుల నొనర్చువారయినచో, ము
క్తులు కారు కదా! ప్రతికూలంబులయిన వాటినాచరింపనియెడల
నోటిపాఠమే చాలునని చెప్పినను చెప్పవచ్చును. కావుననే
యీపది పాశురములను అభ్యసించువారనఁగా వాటియర్థముఁ
దెలిసికొని, యందుల కనుగుణముగ అనుష్ఠించుకొనువారని
చెప్పుటయందు తాత్పర్యము.

గ్రంథమునఁ జెప్పియున్నదానిని వదలి యనుష్ఠానపర్యంత
ము వివక్షితమని యేల చెప్పెదరంటివేని, ఫలమును జెప్పు సం

దర్భమున, „కామన్సూనెయ్ నోక్కెనక్కే'' (మన్మథుని వలె సౌందర్యులుగానుందురు) అనియు, „మదనన్ మిన్నిడైయువర్క్కే'' (మన్మథుని వలె సౌందర్యులుగానుందురు) అనియును చెప్పినారని దానినే ఆ పాశురముల క్రమమునుగాఁ గొనకూడదు కదా! గాయకులు స్త్రీలకు సౌందర్యులగుదురు, దీని యీ పది పాశురములను అభ్యసించినవారు నిత్యసూరులకు భోగ్యులగుదురని యనుటను తాత్పర్యమునుగాఁ గొనవలయును గాన, వాటి యర్థముఁ దెలిసికొనట యనునది అనుష్ఠాన పర్యంతమని యెఱుంగునది. ఇట్లే, వేదములును, ఋషులును, ఆళ్వారులును, పూర్వాచార్యులును వాటివాటిని స్తోత్రముచేయు సందర్భమునఁ దెలుపుచుందురు. అది యెట్లనిన, „చక్రం బిభర్తి వపుషాభితప్తం బలం దేవానా మమృతస్య విష్ణోః సఏతి నాకం దురితా విధూయ విశంతి యద్యతయో వీతరాగాః'' అని యిట్లు తప్త చక్రాంకణము చేసికొనిన మాత్రమున, వైరాగ్యసంపన్నులగు సన్యాసులు పొందునట్టి పరమపదమును బొందుదురని వేదమునఁ జెప్పియున్నదని దేవతాంతరపరులకును పరహింసము లగు నిషిద్ధానుష్ఠానపరులకును అట్టి ఫలము లభించునని చెప్పకూడదు గాన, వారివలెనే వీరును సద్గతిని బొందుదురనుట మాత్రమే తప్ప, వాటికదియే యర్థమని చెప్పకూడదు. కావున నట్టి వాక్యములు వాటి ప్రభావమును స్తోత్రము చేయునవి యని యెఱుంగునది. మఱియు „యే పాపినోపి శిశుపాలసుయోధనాద్యాః వైరానుబంధమతయః పరమం పదంతే; ముక్తింగతాయే'' అన్నట్లు పాపిష్ఠులయినట్టి శిశుపాలుండు మొదలగువారు ప్రతికూలురై పరుషముగ మాట్లాడినవార

యినను,ముక్తులయినవారని చెప్పినది భగవత్స్మరణముయొక్క ప్రభావముఁ జెప్పుటకుమాత్రమే కాని, భగవద్ద్రోహులకును అట్టి పరమపదము లభించునని చెప్పఁదగదు కదా! ''తింగళ్ శేరు మణిమాడనీడ్'' (చంద్రమండలమును స్పృశించుచుండు మణుల మేడలు) అని యిట్లు శ్రీనమ్మాళ్వారులు శిరీవమంగల మునందు మేడలను స్తోత్రము చేసినప్పుడు, ఈ భూమియందుండు చిన్నమేడలు చంద్రమండలముతోఁ గలిసియున్నవనుయు, ''వెళ్ళిమే య్ందమదిళ్ శూళ్ తిరుక్కణ్ణపురం'' (శుక్రమండలమును స్పృశించునట్టి ప్రాకారములు గలది తిరుక్కణ్ణపురము) అన్నట్లు శుక్రమండలముతోఁ జేరిన ప్రాకారములనుటయు నివి ప్రత్యక్షవిరుద్ధంబులగుటం జేసి, యిట్లు చెప్పియుండుట స్తోత్రము చేయుటకై యని కదా గ్రహింపవలయును. అనఁగా నవి మిక్కిలి యున్నతములయినవి యని చెప్పుటయే యుద్దేశము. ''యథా తథా వాపి సకృత్ కృతోంజలిః'' (ఎవ్విధమున నైనను ఏప్పుడో యొకప్పుడు దండము సమర్పించినవాఁడు) అను తావున దండము సమర్పించుటను స్తోత్రము చేయునట్టి సందర్భమున, ''ఎవ్వఁడయినను,'' ''ఎప్పుడయిన నొకప్పుడు'' అని చెప్పియున్నారని యెప్పుడో ఒకప్పుడు భగవంతునికి దండము పెట్టినంతమాత్రమున భగవద్దాసులను ఉల్లంఘించువాఁడై ప్రవర్తించునట్టి దుర్బుద్ధవడికిగల వానికిన్ని భాగవతాపచార పరునికిన్ని, సర్వానిష్టనివృత్తిపూర్వకముగ ఇష్టప్రాప్తి కలుగఁగలదని చెప్పకూడదు కదా! అట్లు చెప్పినట్లయిన, దేవునికి దండము పెట్టనివాఁడొక్కండును లేఁడు గాన, దేవతాంతరపరులును, ప్రయోజనాంతరపరులును, నిషిద్ధాను

ప్రానపరులును, భాగవతాపచారపరులును వీరు వారనెడి భేద
ములేకుండ అందఱును ముక్తులై పోవలసివచ్చును. అందువలన
వైష్ణవాధికారములన్నియును నిరర్థకములు కావలసివచ్చును.
కావున ॥మహాత్మామపి కేషాం చిదతివాదాః పృథగ్విధాః ।
తత్తదర్థ ప్రశంసాది తత్పర త్వాద బాధితాః” (గొప్పవారు
కొన్నింటిని యెక్కువ యతిశయము గల వాటినిగాను చెప్పు
దురు. వారు చెప్పునవి యన్నియును వారివారి విషయములను
స్తోత్రము చేయుటకుగాన, బాధకములేవని యన్నట్లు, ఇవ్విధ
మునఁ జెప్పునట్టి వాక్యములన్నియును ఆయావిషయములను
స్తుతించుటకై యట్లు చెప్పునట్టి వాటినిగాఁ గొనినచో, బాధక
మెద్దియును లేదు.

—* ప్రబంధములఁ దెలిసికొని యనుష్ఠించుకొనునట్టి విధము *—

ప్రబంధములవలనఁ దెలిసికొనిన విధమున ననుష్ఠించుకొ
నుటయనఁగా—॥పొయ్ నిన్ఱ ఞానముమ్” అని యారంబించి
చెప్పిన విధమున దేహాత్మాభిమానరూపమును అసత్యజ్ఞాన
మును, సాంసారిక దుష్కర్మములయందుఁ బ్రవర్తించుటయు
ను, మలినమైనట్టి శరీరము మొదలయినవి త్యాజ్యంబులని
యెఱింగి, వీటిని బోగొట్టవలయునని సర్వేశ్వరుని ప్రార్థించి
॥వీడుమిన్ ముత్తవుమ్ వీడుశెయ్దు ఉమ్ముయిర్ వీడుడై
యానిడై వీడు శెయ్దినే” (భగవదితరములయిన సమస్త
వస్తువులయందు సంగమును విడిచి మీకంతరాత్మయగు సర్వే
శ్వరునియందు జీవాత్మను సమర్పించుఁడు) అన్నట్లు, పితృమాతృ
కళత్ర, పుత్ర, గృహ, క్షేత్రాది భగవద్వ్యతిరిక్తములగు వాటి
నన్నింటిని పరిత్యజించి, ఆత్మసమర్పణముఁ జేసి, 'సీర్ నుమ

తెన్నై వేర్ ముతల్ మాయ్‌త్తు" (మీరు మీదియనెడి య
హంకార మమకారములను వేరుతోఁ(గూడ ఛేదించి)అన్నట్లు,
సంసారబీజములగు అహంకారమమకారములను తల్లివేరుతోఁ
గూడ మూలచ్ఛేదముఁ జేసి, "మనన కమల మఱ మరక్క
ళువి" (మనస్సునందుండు దోషమును కడిగివేసి) అన్నట్లు,
తన గుణంబులను పరుల దోషంబులనున్ను గన్పట్టునట్టి మన
స్సునందలి దోషముఁ బోగొట్టి, "అరువినైయేన్ నీచనేన్
పావియేన్" (జ్ఞానములేనివాఁడను, నీచుండను, పాపిని) అన్న
ట్లు, స్వదోషంబుల ననుసంధించుకొనుచు, "యెన్నాళ్ యా
నున్నై యినివందు కూడువన్" (ఎప్పటికి నీ శ్రీపాదములఁ
జేరగలను?) అన్నట్లు ప్రతికూలంబులగు దేహేంద్రియాదులను
నివర్తింపఁజేసికొని నేను నీతోఁ జేరునది యెన్నటికోయని శో
కించి, "వళువిలా వడిమై శెయ్య వేణుమ్నామ్" (ఎడతెగకుండ
కైంకర్యము చేయవలయును) అన్నట్లు అన్నివిధములను కైంక
ర్యమునందు ప్రీతికలవారై "యెవయుమ్ యెవరుమ్ తానే"
(అన్నివస్తువులును అందరును సర్వేశ్వరుండే) అన్నట్లు సర్వ
మును భగవదాత్మకమని తలంచి రాగద్వేషాదులులేని వారై
"నెంజినాల్ నినైప్పాన్ యెవన్ అవనాగున్" (మనస్సుతో
నెట్లు ధ్యానించునో అట్టి వాఁడగును) అన్నట్లు, అర్చావతార
మునఁగల గుణపూర్తిని తెలిసికొని, యెక్కువ ప్రీతిగలవారై
"పయిలుమ్ తిరువుడైయారెవరేలుమవర్ కండీర్ యమ్మై
యాళుమ్ పరమరే" (భగవద్భక్తిగలవారెవ్వరయినను వారు
మమ్ములను పాలించునట్టి స్వాములు సుమీ) అన్నట్లు భగవ
ద్గుణానుభవ పరులగు విలక్షణ జన్మగలవారే ప్రాప్యభూతులని

యను సంధించుకొనువారై "పారిలోర్ పత్తైయై పచ్చైప్పశుమ్ పొయ్ కళ్ పేశువార్ కిర్ప్పరే" (భూమియందు అప్రయోజకుండైన వేఱొక్కయల్పమనుష్యుని మీఁచెయ్యు మేఘముతో సమానమనియు నిట్లు అసత్యవచనములను చెప్పజాలను) అన్నట్లు, సేవింపకూడని వారిని సేవించుటయందు మనస్సులేనివారై "ఇచ్చువి కంతరిల్ పం అళివిల్లాచ్చ్ పరమ్" (ఐహిక పారలౌకిక స్వైశ్వర్యములను) అన్నట్లు ఐశ్వర్య కైవల్యములను తృణీకరించినవారై, "మాన్ఱై మొన్నువులగియర్కెల్లాం కొడువులకం కాట్టినై" (ఇవి యన్నియును సంసారులకే క్రూరమయిన లోకమును చూపింపకున్నా) అన్నట్లు ఈ లోక వ్యవహారమును సహింపజాలక, ఇది కూపుమూసి పోవలయునని యెక్కువ వైరాగ్యము గలవారై "నోత్తనోన్బిలేన్ నుణ్ణఱివిలేన్" (నోములను నోచియుండలేను. జ్ఞానసామ్యం డను) అన్నట్లు ఆకించన్యాదుల ననుసంధించుకొనుచుండువారై, "పలనీరాట్ట్పుక్ప్పుమో యున్నై కైవప్పరో" (అనేకములఁ గూర్చి విడవాడెదనా ఇంకను నన్ను చెడిపెదవా) అన్నట్లు విషయాంతరములు కానవచ్చినట్లయిన దుఃఖించువారై, "కణ్గళుఱక్కం పకలు కందు ఉలకియాళ్" (రేయుం బగళ్ల్ నిద్రనెఱుంగను) అన్నట్లు భగవంతుని పొందకపోవుట వలనఁ గలిగిన దుఃఖమువలన నిద్రాహారములయందును ప్రీతిలేనివారై "అప్పనే కాణుమారు అరుళాయ్" (స్వామీ సేవసాయించి కృపచేయుమా) అని పిలుచుచు "మల్లికై కమళ్ తెన్ఱలీరుమాలో" (మల్లెపుష్పము పరిమళముగల మలయమారుతము నన్ను బ్రద్దలు చేయుచున్నది) అన్నట్లు .భగవంతుని

విడనాడియుండునప్పుడు భోగ్యపదార్థములన్నియును అగ్నిసదృశములై. "వఞ్జమ్మాయుం శెయ్యేల్ తిరువాణైనిన్నాణైకండాయ్ నిన్నలాలరికిష్టిత్తేన్ యాన్" (ఒక్క వంచననున్ను చేయవలదు శ్రీదేవితోవొట్టు నేను గతిలేనివాఁడను) అన్నట్లు ఒట్టుబెట్టి ప్రార్థించి ప్రకృతి బంధవిమోచనమును గలుగఁజేసికొనునట్టి పరిపూర్తిఁగలవారై యుండుట. ఇదియే కదా! ప్రబంధముల నభ్యసించుటవలని ఫలము.

### ప్రబంధజ్ఞానము లేనివారికిని అర్థజ్ఞానమున్నను అనుష్ఠానములేనివారికిఁగల తారతమ్యము.

ఈ దర్శనప్రబంధములయొక్క యర్థజ్ఞానములేక సంసారబద్ధులయిన వారికిన్ని, ఈయర్థంబుల నెఱింగియున్నను, విషయాసక్తులై దారాపుత్రాదులతోఁ గూడియుండి బద్ధసంసారులై అహంకారార్థకామపరవశులయి భాగవతాపచారాదులకును భయపడక, ఒకరితోనొకరు కలహించుచు, శాస్త్రవాదములచే నితరులను వోడించి. "గురుంత్వంకృత్య హుంకృత్య విప్రంనిర్జిత్యవాదతః । అరణ్యే నిర్జలేదేశే భవతి బ్రహ్మరాక్షసః" (గురువగు బ్రాహ్మణుని నీవా నేనా అని వాదించి జయించినవాడు నిర్జలదేశమున బ్రహ్మరక్షస్సుగా జన్మించును) అని చెప్పియున్నదానిని గమనింపక, రాజద్వారములయందు కాచుకొనియుండి అసేవ్యసేవఁజేయుచు "కొళ్ళుమ్పయనిల్లై కుప్పైకిళర్త్తన్న శెల్వత్తై వళ్ళల్ పుకళ్న్దు నుంవాయ్ మెయ్యిళక్కుమ్ పులవీర్కాళ్" (ఓ కవీశ్వరులారా! మీరు గుణహీనులయిన మనుజుల విషయమై లేనిగుణము-

నారోపించి స్తుతించినయెడల మీరు అసత్యవాదులగుదురే కాని వేఱొక్క ప్రయోజనము సిద్ధింపదు) అన్నట్లు పురుషాధముండై కొన్ని గ్రామంబులకు ప్రభువై క్రొద్దిద్రవ్యము నిచ్చువాఁడగు క్షుద్రమనుష్యుని వానిదుర్గుణంబు లన్నియును బయలుపడునట్లు వానిని సర్వోత్కృష్టుండవని స్తోత్రముచేసి దేహయాత్రాపరు లయి తిరుగుచుండునట్టి యాస్తికనాస్తికులకున్న యెంతయో తారతమ్యము కలదు. జ్ఞానహీనుని దిద్దుపాటుచేయవచ్చును. అయితే యీతనిని దిద్దుపాటు చేయఁజాలము. ,,నిదుపోతి క్రమే దండభూయస్త్వం'' ప్రంచితుండు అతిక్రమించి ప్రవ ర్తించినచో ఎక్కువగ దండింపఁబడును) అన్నట్లు ఈతని కెక్కువ యపరాధము కలదు. కావున యెన్నటికిని ఆస్తిక నాస్తికులతోఁ గలసిమెలసి యుండకూడదు. అట్లు కలిసిమె లిసి యున్నట్లయిన, ,,తీయకందముళ్ళతోన్ద్రు చ్చేర్నిరుప్పతో న్నుక్కు తీయకందమేరుం తిరుమతుపోల్'' (దుర్గంధముగలపదా ర్థముతోఁ చేరినవానికి దుర్గంధమేగలుగును) అన్నట్లు వానికిఁగల దుష్టస్వభావము ఈతనికిన్ని పట్టుపడి బద్ధసంసారి యగును.

—* ఈవిషయమును భగవదుక్తిచే సమర్థించుట. *—

ఈయర్థము భగవంతుని వాక్యమువలనను తెలియు చున్నది. అది యెట్లనిన, ,,మహత్సేవాం ద్వారమాహుర్వి ముక్తేః । తమోద్వారం యోషితాంసంగిసంగం మహాన్తస్తే సమచిత్తాః ప్రశాంతాః విమన్యవస్సుహృదః సాధవో యే యేవా మయీశకృత సౌహృదార్థాః జనేషు దేహంభరవార్తి కేషు గృహేషు జాయాత్మజరాతిమత్సు నాతిప్రీతా యావద ర్థాశ్చలోకే''అనఁగా మహాత్ములసేవచేయుట ముక్తి ద్వార

మనియు దారాపుత్రాద్యాసక్తు లగు సంసారులతోఁ జేయునట్టి సహవాసము అంధకారమిశ్రమగు (తిరుగ సంసారమునకుగా నివచ్చునట్టి) ద్వారమనియు మహాత్ము లెవ్వరనఁగా "సమశ్శత్రౌచమిత్రేచ తథామానావమానయోః శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః" అన్నట్లు శత్రు,మిత్ర, మాన,అవమాన,శీత,ఉష్ణ, సుఖ, దుఃఖ,లాభ, నష్ట, నిందా, స్తుతులవిషయమున చలనము నొందని మనస్సుకలవారై, శాంతులయి, క్రోధరహితులయి సర్వభూతసుహృత్తులయి పరమసాధువులై కలిగినదానితో తృప్తిపొందువారై యుండువారు. ఇట్టి మహాత్ముల సహవాసము ముక్తిద్వార మని సర్వేశ్వరుండే స్వయముగ చెప్పియున్నాడు కదా!

—* ఈయర్థమును శ్రీమనవాళమామునులు సాయించిరనుట. *—

"నాత్తికరుమ్నర్కలైయిల్ నన్నెరిశేరాత్తిగరుంఆత్తిగనాత్తిగరు మావివర్రైవోర్త్తుంనెంజే మున్నవరుంపిన్నవరుమ్ మూర్క్కరెనవిట్టు నడుచ్చొన్నవరై నాళుమ్తొడర్" అనఁగా శాస్త్రజ్ఞానము లేకుండి నిషిద్ధానుష్ఠానపరులగు నాస్తికులను, సారతరమగు శాస్త్రముచేఁ బ్రతిపాదింపఁబడినట్టి సన్మార్గముననుండువారగు ఆస్తికులను శాస్త్రవేత్తలై యుండియు, స్వేచ్ఛగ సంచరించునట్టి ఆస్తికనాస్తికులనున్ను బాగుగాఁబరిశీలించి ఈముగ్గురిలో మొదట పేర్కొనినట్టి మూర్ఖులను తుదిని పేర్కొనిన మూర్ఖులనున్ను విడిచి మధ్యను పేర్కొనినట్టి యాస్తికులను అనుసరింపవలసినదియని మాయాచార్యులగు శ్రీమణవాళ మహామునులవారును (ఉపదేశరత్నమాలయందు) సాయించి యున్నారు కదా!

—* మోక్షాధికారుల లక్షణములు. *—

కావున మోక్షముఁగోరువాడు సారతమ మగు శాస్త్రా
ర్థము ననుసరించియుండునట్టి పరమ విలక్షణులతో సహ
వాసముఁజేసి, నేటివారికాయవలెనే యాచార్యులమని పేరు
పెట్టుకొని, ఆచార్యలక్షణము లొక్కటియును లేనివారై
“మున్నోర్ మొழிందముఱై తప్పామల్ కేట్టు పిన్నోరుందుతా
మదనైప్పేశాతే తన్నెంజిల్ తోన్ఱినదే శొల్లి యిదు శుద్ధో
పదేశవార్తైయెన్బర్ మూర్ఖరావార్” అనఁగా పూర్వా
చార్యులు సాయించిన ప్రకారము తప్పకుండ వినిపిమ్మట
వారుసాయించిన యర్థమును పూర్వోత్తరవిరోధములు సం
భవింపకుండునట్లు బాగుగ విచారించి విరుద్ధములుకానియర్థ
ములను చెప్పకుండ, తనకుఁదోచినయర్థము నేచెప్పి, యీవి
శుద్ధసంప్రదాయసంబంధమనువారు మూర్ఖులని శ్రీమణ
వాళమహామునులు సాయించినట్లు యథార్థకీర్తిని నిరూ
పింపక తెలిసిన యంశమును దుశ్శకమని పరిత్యజించి, ఒక
తావున నొక పరమార్థము దెలిపియున్నట్లయిన దానికి
నూరులకొలది విపరీతార్థంబులను కల్పించి, ప్రతికూలంబు
లగు దేహాత్మాభిమానాదులను పరిత్యజింపక, బద్ధసంసారు
లయి సదాచార్యాభిమానముకలదు గాన,మన కేమిభయము?
(మోహాంధులకు ఎక్కడపడితే అక్కడ ఏకాంతప్రదేశమున్ను
చీకటిన్ని దొరుకునుగాన వారుపాపముచేయుటకు వెనుతీయరు)
అన్నట్లు మోహాంధులై తమకున్ను భయములేక,తమ నాశ్ర
యించిన శిష్యునియొక్క భయమునున్ను చెడఁగొట్టి యిద్దరును
తోడుదొంగలై యుద్దేశ్యులగు ముగ్గురికిని (భగవద్భాగవతా

చార్యులకు)యయిష్టములగునిషిద్ధానుష్ఠానంబులచే శిష్యునిన్ని
నశింపఁజేసి తననున్ను నశింపఁజేసికొనునట్టి విపరీతార్థము
లను బోధించువారిని నమ్మక, ఇంతకుముందు చెప్పిన ప్రకా
రము సదాచార్యలక్షణ సంపన్నుండగు సదాచార్యుని యా
శ్రయించి నిర్భరుండై, "తమక్కళిక్ తలైవరాయ శాతియుం
దక్క ళేలుమ్" అని సాయించినట్లు గొప్ప జన్మమున జన్మిం
చినవారై భాగవతాగ్రగణ్యు లనిపించుకొనునట్లు నామరూ
పములను ధరించుకొని శమము దమము శాంతి మొదలు
గాఁగల భాగవతలక్షణంబులలో నొక్కటియును లేనివారై
బాగుగ కాళ్ళు చేతులు కడుక్కొని బట్టలను శుభ్రముగా
ఉతుక్కొని నడుముచుట్టు బాగుగ ధరించి, ద్వాదశో
ర్ధ్వ పుండ్రములనున్ను ధరించుకొని, తామరపూసలను
పవిత్రములనున్ను, ధరించుకొని చేతిలో పవిత్రము నుంచు
కొని, అధ్యయనాధ్యాపన సంపన్నులై, వేశ్య చేసికొనినట్టి
యలంకారమువలెనే సర్వజన మనోహరంబగు వేషమును
చేసికొని, అహంకార మమకార గృహ క్షేత్ర దారా పు
త్రాద్యాసక్తులై రాగద్వేషములు కలవారై, ద్రవ్యార్జనతత్ప
రులై యొకరివస్తువు నొక్కసు దొంగిలించి అహంకార
మమకారముల మూలముగ భాగవతాపచారపరులై యుండు
బద్ధసంసారులఁ జూచినతోడనే భయపడి, నామరూపములు
కలవారగుటంజేసి యవమానింపకయు, అనుకూల ప్రతికూ
లంబులఁ జేయకయు,యథాశక్తి సమర్పించి వినయముతోఁగూ
డియుండువారై నమస్కారాదులచే వారిని సంతోషపెట్టి
మనస్సు కలిసి ప్రవర్తింపక,దూరముగానుండి కుమ్మరపురుగు

వలెనే ప్రవర్తించి అర్థపంచకతత్త్వజ్ఞులై (అనన్యార్హత్వ అనన్య శరణత్వ అనన్యభోగత్వము లనబడు) ఆకారత్రయ సంపన్నులైన మహాభాగవతులతోఁ జేరి "బోధయంతః పరస్పరం" అన్నట్లు స్వరూపవిరుద్ధములగు కార్యముల యెడల మనస్సు పోకుండచేయుటకై ఒకరికొకరు సద్విషయము లను బోధించుచు, ఈ లోకమునందుండు నాలుగురోజులును భగవద్గుణానుభవ కైంకర్యములతోఁ బ్రొద్దుపుచ్చుకొని, అహంకార రహితులై భాగవతాపచారమునుండి భయపడువారై నడచుకొనువారు మోక్షాధికారులని మాయాచార్యుల వారు నాయించుదురు.

{ కొందఱ మాచార్యుల నడవడికలను గురించిన యాక్షేప సమాధానములు }

అయినను, ఆళ్వారులలోను ఆచార్యులలోను ఇద్దరు ముగ్గురు తప్ప తక్కిన వారందఱును సంసారమున దారాపుత్రాదులతో నుండి పోయినారే? అని యడిగితివేని చెప్పెదను.

శ్రీమన్నాథమునులు మొదలుకొని మా యాచార్యులగు శ్రీ మణవాళమహామునులవఱకును అందఱును సన్యసించిన వారేయని తలంపవలయును. అది యెట్లనిన "నివృత్తరాగస్య గృహం తపోవనం । ప్రవసిత ఇవగేహే వర్తతేయస్స ముక్తః" (వైరాగ్యముగలవానికి ఇల్లే తపోవనము సన్యాసునివలెనే నడచుకొనుచు గృహమున నుండువాడు మోక్షార్హుఁడు) అనియును చెప్పియున్నట్లు వైరాగ్యసంపన్నులయి అహంకార మమకారశూన్యులై, శమదమాద్యాత్మగుణంబులు కలవారై అన్ని జీవజంతువుల యెడలను దయగలవారై

శత్రుమిత్ర సమానులయి, అర్థకామముల కాశపడనివారై, అక్షయపాత్రచేతను అయాచితముగ ఇతరు లొసంగిన ద్రవ్యముచేతనున్ను జీవించువారై, ఆచార్యునియెడల గల ప్రీతి వలనఁగాని, లోకహితముకుఁగాని ఒక్కరిద్దరు సంతానము గలుగువరకు భోగ్యతాభాగ్యబుద్ధులను వదలి స్వభార్యలోనాలుగురోజు లనుభవించి,విహితవిషయమును శాస్త్రసిద్ధమునయినట్టి స్వభార్యనువిడిచిపెట్టి, సన్యసించువారయి భార్యయయినది తమకు ప్రమాదము గలుగునప్పుడు తమనున్ను దిద్దుపాటు చేయఁగల జ్ఞానాధికురా లయినట్లయిన, ఉభయులును పరస్పరము వైరాగ్యముకలవారయి శ్రీ కూరత్తాళ్వారులవలెను వారి భార్యయగు ఆండాళమ్మగారి వలెనున్ను భగవద్గుణానుభవ కైంకర్యపరులయి ప్రవర్తించినారే తప్ప, నిత్యసంసారులై ౹౹అహంమమేతిచండాలః" అనఁగా నేను నాదియని తలంచువాఁడు చండాలుండు అన్నట్లు కర్మచండాలునిగాఁ జేయునట్టివియు ౹౹నరహరితనోర్దాస దాసస్యదాసః" అన్నట్లు భాగవతశేషత్వమునుబట్టియే నిరూపింపఁదగినట్టిదియగు నాత్మవస్తువును తెలియకుండచేయునట్టివియునగు ౹౹విద్యామదో ధనమదః తృతీయోభిజనోమదః" అన్నట్లు అహంకారమద్యపానాదుల మూలముగ మదోన్మత్తులై యాదవబలమువలెనే యొక్కరి నొక్కరు బాధించువారై, పదిపన్నెండు బిడ్డలను కన్నందున నెక్కువ హేయమైనదయి దేహపోషణ పెరురాలును, స్వరూపవిరోధియు నగు భార్యనున్ను సంసారవర్ధకులయి స్వరూపంబున కెక్కువ ప్రతికూలులగు పుత్రులనున్ను అనువర్తించుకొనుచు ఎక్కువ పరతంత్రులును ఎక్కువ ప్రీతి

గలవారునునయి బ్రతికియున్నంతవరకును విడవకుండ స్వరూ
పవిరోధులనెడి యనుతాపమున్ను లేనివారై స్వరూప యా
థాత్మ్యవేత్తలగు శిష్యులు నిందింతురనెడి లజ్జయున్ను వదలి,
తనను పొందవలయునని కోరునట్టి సర్వేశ్వరునికిన్ని అయి
ష్టులై, యీసాంసారిక దుష్కర్మములయెడల ప్రవర్తించు
ట యనునది తుదకేమిచేయునో యనెడి భయమున్ను లేని
వారై, విషశాస్త్రిగ్నులును భగవత్సంబంధములై సకల
చేతనాచేతనపదార్థములున్ను తదీయములై విశేషముగ
యీలోకముననుండు భాగవతులును భగవత్సంబంధులై
యుండఁగా, ఒక్క ప్రపన్నుని పోషించుటకు శక్తిలేక దారా
పుత్రాదులు మాత్రము భగవత్సంబంధులు కారా! యని యిట్లు
విపరీతముగాఁ దలంచి అహంకారార్థకామంబులకు పుట్టి
ల్లగు తనను జూచినట్లయిన శత్రువుఁ జూచినట్లును, వాటిని
బట్టియుండువారిఁ జూచినట్లయిన, సర్పాగ్నులఁ జూచినచందం
బునను, భయపడియుండ వలసియుండఁగా, అట్లు చేయక,
వారిని పోషించుటకై రాజగృహంబుల కనేక పర్యాయము
లు రాకపోకలఁ జరుపుచు, అసేవ్యసేవఁ జేసి, యితరుల వస్తు
వుల నపహరించి, అయోగ్యులను యాచించుచు, అనధికా
రులగు శిష్యుల ద్రవ్యమును స్వీకరించుచు, ప్రవర్తించునట్టి
వారు కారు కదా?

కావున పూర్వులను దృష్టాంతముగాఁ గొని, మనమున్ను
సంసారము ననుసరించినవార మయితిమేని, కారతమేమని
తలంచితిమేని, "న శ్యేదన్యః చరన్మాహ్యాద్యథా రుద్రోబ్ధి
జం విషం" అన్నట్లు రుద్రుండు కాలకూటవిషమును భక్షిం

చినాడని యొక నీచుండును దానిని భక్షించినచో, నశించిపో
వునట్లు స్వరూపము తప్పక నశించును.

అట్లు యేల చెప్పఁదగును; దారాపుత్రాదులు తన వార
నుకొనినచో కదా!స్వరూపము నశించును. ఇంతియేకాని,
భగవత్సంబంధులని తలంచినచో, వారి ననువర్తించియుం
డకూడదా! యంటివేని, "తదుపకరణం వైష్ణవమిదం" అన్న
ట్లు అన్నింటివిషయమునను భగవత్సంబంధములని తలంప
వలయుననఁగా ఒక్కవస్తువున్ను తనకుగాని,యితరులకుగాని శేష
భూతము కాదనియు, సర్వేశ్వరునికే శేషభూతమనియు నిట్లు
స్వశేషత్వాన్యశేషత్వములఁ బోగొట్టుటకై మాత్రమే చె
ప్పఁబడినది కాని, స్వరూపవిరోధులు పూర్తిగా నుండునట్టి
తన శరీరమును దానిని బట్టియుండువారలగు భార్యాపుత్రా
దులనున్ను అనువర్తించియుండవలసినదియని యొక్కరహస్య
మునను చెప్పియుండలేదు కదా! అట్లు చెప్పితివేని, "నర
కముమ్ శువర్క్కముమామ్" అన్నట్లు ఇరువదియెనిమిది మహా
నరకములును భగవత్సంబంధముతే యైనందున, అవియును
అనుభవింపవలసినవియే యై యుండవలసివచ్చును కాన,యిట్లు
తలంచుట విపరీతజ్ఞానమనిపించుకొనును. అంతేయన్నియును
సర్వేశ్వరునివే యని తలంచియుండుటమాత్రమే కావలసినది.
అన్నియు వానివేయని యనుభవించుటకుఁ దగినట్టివారు శ్రీ
నమ్మాళ్వారులు తప్ప వారికి పయివారెవ్వరును లేరు కదా.

శ్రీ నమ్మాళ్వారులు పిరాట్టి పురుషకారము పూర్వకము
గ సర్వేశ్వరుని శరణుజొచ్చిన పిమ్మటనున్ను అతండుతమను
తనసన్నిధికిఁగొనిపోకుండుటఁగని, మనకు ఆత్మాత్మీయములలో

నెద్దియయిన నొక్కదానివిషయమున నాశయున్నట్లు తలంచి మనలను తనలోఁ జేరకుండునట్లు చేయుచున్నాఁడని నిశ్చయిం చుకొని, "ఇత్తైవల్లై యార్ వళర్త్త కిళికాళ్ పూవైకాళ్ కుయిల్కాళ్ మయిల్కాళ్" అని యారంభించి "నేను పెంచిన చిలుక మొదలగు పక్షులారా! మనస్సు మొదలుగాఁగల నా కుండుకున్న వన్నియును తాను చేకొనినట్టి సర్వేశ్వరుండు మీ మొదల నాకుఁగల యాశాపాశములను నిశ్శేషముగ వద లుకొనిన పిమ్మటనే తప్ప, ప్రాప్యస్థలమగు పరమపదమునఁ జేర నీయకయున్నాఁడు, కావున ఈరోజు మొదలుకొని మీతో నాకు పనిలేదు" అని యిట్లు ఆత్మాత్మీయంబుల మొదలఁగల యాశయును భగవత్ప్రాప్తికి ప్రతిబంధకమని తలంచి వైరా గ్యముండవలయునని తెలిపియున్నందున అవియును భగవత్సం బంధములయినవియేయని తలంచి మోహాక్రాంతులైయుండుట కవకాశము లేదు.

"ఉడక్కిళియై కూప్పిడవణంగినాళ్" (సుందరమైన చిలు కను పిలిచి దండము సమర్పించినది) అని సాధించినట్లు, జ్ఞా నాధికులయినట్టియును, ఆశ్రయింపవచ్చును కదా! యెంటివేని, విషయానుభవపరురాలగు భార్యయును, స్వకార్యధురంధరు లగు పుత్రులును యితఁడు వైరాగ్యవంతుండుగానున్నాఁడు గాన, మనమున్న ప్రతికూలముగా ప్రవర్తించితిమని వైరాగ్య మువిడిచి పోవును, కావున నీతనిని వంచింపవలయు ననుకొని, "మహాసాహసోక్తి ఘనకంచుకవంచితాన్యః" అన్నట్లు కులింగ శకునివలెనే "దండము! దండము" అనుచు వంచకులై ప్రీతికి

గాను ఒకమాట చెప్పినట్లయిన దానిని విని భ్రమించి "శి
ష్యులైనను, పుత్రులైనను, జ్ఞానాధికులు భగవద్భక్తులయినను
దున అనువర్తింపవలసినవారని చెప్పియున్నది కదా. వీరి
నిన్ని చేర్చుకొనినచో తప్పేమున్నది" అనుకొని వారి ఇష్ట
మువచ్చినట్లు ప్రవర్తించుచు విషయప్రవణుండై వారియెడల
యెక్కువ యనురాగముతో నుండినట్లయిన పూర్వముండిన
సంసారబంధము పైకివచ్చి, భ్రష్టుండై పోవును. కావున "శిది
రిళమడవాళ్ తాట్ చిర్దు మదియాదు" (యావ్వనవంతులగు
స్త్రీల ప్రావణ్యమును నమ్మకూడదు) అన్నట్లు అట్టి వంచకులను
తనచెంత చేర్చుకొన కూడదు.

వారైనను భగవద్భక్తిపరవశత వలన ఆనందబాష్పములు
గలవారును పులకాంకురములుకలవారునునై జ్ఞానానుష్ఠానంబు
లాకారమునందే తెలియవచ్చునట్లు, పరమవిరక్తులై భగవం
తుని విషయమున నెక్కువ ప్రీతికలవారై, త్యాజ్యంబులను
విడనాడి ఉపాదేయంబులను గ్రహించిన వారై, భట్టరువలెనే
ప్రవర్తించునట్టి వారైనట్లయిన, లోకములోనుండు జ్ఞానాధికు
లందఱిని తలంచువిధమున వారినిన్ని విశేషముగ గమనిం
పవలయునే తప్ప, ప్రేమాంధుండును విషయప్రవణుండునై
వారితోఁబాటు సంసారమునఁ బ్రవర్తింపఁగూడదు కదా!

అదియేమి? "వీడుముణ్ము త్తవుమ్" అను పాశురమున
త్యాగముఁజెప్పి, త్యజించువిధముఁ దెలుపునట్టి సందర్భమున
"నీర్ నుమతెన్నివై వేర్ముతల్ మాయ్ త్తు" అనుతావున నే
ను నాదియనెడి యహంకార మమకారములు పోయి, అంత
యును సర్వేశ్వరునిదే యనెడి నిశ్చయమున్నచో, చాలును.

అన్నింటిని బొత్తుగ వదలిపెట్టినవారగు భరతుఁడు, సౌభరి మొదలగువారికి మరల సంసారము ప్రాప్తిని వచ్చుటం జేసి, త్యాజ్యంబు లనెడి తలంపే త్యాగమని నాయించినారు కదా! అంతమాత్రము చాలదా? యంటివేని, చెప్పెదను. దాని యర్థమును బాగుగాఁ దెలిసికొనినట్లయిన, అంతమాత్రమే చాలును.

(వీడుమిన్ ముత్తవుమ్) అను పాశురముయొక్క యభిప్రాయమేమనఁగా, ఛండాలుని గృహమును బ్రాహ్మణునికుపయోగపరచునప్పుడుకొన్నింటినివదలి మఱికొన్నింటినుంచుటకూడనట్లు, అన్నింటిని విడనాడవలసినది యని చెప్పినప్పుడు కావలసియుండెడు మమకార దూషితములగు దారాపుత్ర గృహక్షేత్రాదులను విడనాడవచ్చును. తిలలలోనుండు తైలము వలెనే విడిగాఁ దెలియరానిదియగు దేహంబును విడనాడుట యెట్లనఁగా,

ఈతావృత త్యాగమనఁగా, స్వరూపతః దేహమును విడనాడుట. (అనఁగా ప్రాణత్యాగముఁజేయుట) యనునది కాదు. అయితే దేహముయెడల ఆత్మయనెడి తలంపును, దేహమును బట్టియుండువారియెడల నేను నాదియనెడి తలంపే యిచట త్యజింపవలసినది. "కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసాస్మరన్ ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే" అనఁగా బాహ్యవిషయములయెడల కర్మేంద్రియంబులు పోకుండునట్లు, వాటిని నియమించి మనస్సున వాటిఁదలంచునట్టివాఁడు కుటిలమైన యనుష్ఠానము గలవాడని చెప్ప

బడునుగాన అంతమాత్రము చాలదు. అవశ్యముగా తలంపు నే వదలవలసినది. కాయికముగ అన్నింటిని విడనాడిన వారగు సౌభరి భరతాదులకు మానసికసంబంధ ముండుటంజేసి మరల సంసారబంధము తటస్థించినదాయెను? కావున బయటి కన్నింటిని విడనాడుట యనునది యొక త్యాగము కాదని „మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః” అను ప్రమాణమున్ను కాయికముగ త్యజించుటకంటెనున్ను మానసికముగ త్యజించుటయే ప్రధానమని తెలుపుచున్నది, ఇంతియె కాని, త్యాజ్యంబు లివి యని తెలిసికొన్నంత మాత్రమే చాలుననుకొని బద్ధసంసారియైయున్నను, విషయప్రవణుండయ్యెను ప్రవర్తింపకూడదు కదా.

మోక్షాధికారి కుండవలసిన యధ్యవసాయ మెట్టిదియనఁగా, స్వరూపనాశకములగు అహంకారము, విషయప్రావణ్యము, భాగవతాపచారము వీటికిఁ గారణభూతమైనవాఁడు దేహవిశిష్టుండగు తానేయగుటంజేసి,తనను చూచినట్లయిన,బట్టను బిగించికట్టుకొని మీసములు దువ్వుచు కండ్లు యెఱ్ఱచేయుచు జుట్టు ముడివేసికొని కత్తిని చేతిలో గట్టిగా పట్టుకొని చంపవచ్చిన శత్రువుఁ జూచినట్లు భయపడి అట్టి భయమును నివర్తింపఁజేసి రక్షించుటకు సమర్థుండగుటవలనను, తమకు శక్తియు ప్రాప్తియు నీరెండునులేనందువలనను సర్వేశ్వరునే శరణుజొచ్చి„పణెక్కుండాయ్ శామారే” (మరణమునుబొందు విధమునుచెప్పుమా!)అనియు, ‚ఉన్నడిక్కేకూట్టవిప్పుణ్ణొళ్లై' (నీశ్రీపాదములతోఁ జేర్చుకొని కైంకర్యముఁ గొనుమా)అనియు „కూవిక్కొళ్లుమ్ కాలమిన్నుంకుఱుకాతో” (నన్ను నీశ్రీపాద

ములను పొందించుకొనుటకు కాలమింకను రాలేదా" అనియు "అడియేనడికూడువ తెన్నుకొలో" (దాసుండు దేవర వారి శ్రీపాదంబులఁ జేరుటయెన్నఁడో) అనియును "కృతకృత్యాః ప్రతీక్షంతే మృత్యుం ప్రియమివాతిథిం" (జ్ఞానవంతులు మృత్యువును ప్రియమగు అతిథివలెనే నిరీక్షించుచుందురు) అనియును సాయించినట్లు శరీరనివృత్తికై ప్రార్థించుచు అది నశించుటకై నిరీక్షించుచుండునది. దారా పుత్రాదులఁ జూచినట్లయిన, "దేహబంధుసమాజోయం ముముక్షోస్సంసృతావిహ। వైదేహ్యాఇవ లంకాయామేకకర్ణ్యాదిసంగమః" అనఁగా ముముక్షువగు వానికిసంసారమున దేహబంధువుల సమూహము సీతాదేవికి లంకాపట్టమున ఏకకర్ణ్యాదిరాక్షసస్త్రీ సమూహమువలెనే దుఃఖకరమైనది యని చెప్పియున్నందున దుస్సహమైనట్టి దానినిగాఁ దలంచి "రాక్షసానాంవధంకృత్వా సూదయిత్వాచ రావణం లంకా మున్మూలితాంకృత్వా కదాద్రక్ష్యతిమాంపతిః" (రాక్షసులను వధించి రావణునిచంపి లంకను ధ్వంసముచేసి ఎన్నడు నాభర్త నన్ను చూడగలఁడు) అన్నట్లు శ్రీ సీతాపిరాట్టివలెనే ప్రార్థించుచు కాలముకై నిరీక్షించుచుండునది. వీటి నన్నింటిని మనస్సునందుంచుకొనియే కదా శ్రీనమ్మాళ్వారులవారు "వేర్ముతల్మాయ్త్తు" అను తావున అజ్ఞానమును వేరుతోఁ గూడ పెళ్ళగించి వేయవలసినది యని సాయించియున్నారు.

## —*అహంకార ద్వైవిధ్యము*—

అహంకారము దేహాత్మాభిమాన రూపముగాను, స్వస్వాతంత్ర్యరూపముగానును రెండువిధములుగా నుండును. దే

హామే స్వాతంత్ర్యమని తలంచినట్లయిన, ప్రచ్ఛన్నబౌద్ధుండై సంసారులకంటెనున్న తక్కువైనవాఁడగును. స్వతంత్రుండనని తలంచినట్లయిన, భగవద్ద్రవ్యమగు తనను అపహరించినవాఁడై "కింతేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా", (ఆత్మ నపహరించినట్టి చోరుండే పాపమును చేయలేదు) అని సాయించినట్లు శ్రీ సీతాపిరాట్టిని యపహరించినట్టి రావణుఁడు వలెనే నశించిపోవును. ఇవ్విధమున- అహంకార మమకారముల క్రౌర్యమును తెలిసికొనక, త్యాజ్యంబులని తెలిసికొనుటయే చాలుననుకొని, తైలఘృతాదుల మూలముగ క్రొవ్వు పట్టునట్లు శరీరమును పోషించి, లావయిన పొట్టపొడుగుగల వారై మెత్తైన భుజములుకలవారై బలిష్ఠములగు శరీరములుగల వారై విషయప్రవణులై ప్రవర్తించువారు నిత్యసంసారులగుదురు.

—* జ్ఞానాధికులయినను అనుష్ఠానహీనుల ననుసరింపరాదు. *—

అయితే యీకాలమున జ్ఞానవంతులైనను, విషయాసక్తమగు మనస్సుకలవారై ద్రవ్యార్జనపరులై సంసారము కనుకూలముగ ప్రవర్తించుచున్నారే! వారు జ్ఞానవంతులుకారా! ఇది విరుద్ధమైనట్లయిన,వారేల ఇట్లు ప్రవర్తించుచున్నారంటె వేని తెలిపెదను. అది భగవంతుని మాయ. అది యెట్లనిన, "తుయక్కఱుమతియిల్ నన్ఞానత్తు ళమరరై త్తుయక్కుమ్ మయక్కుడై మాయైకళ్ వానిలుమ్ పెరియనవల్లన" (మనస్సునందెట్టి సంశయములులేక దివ్యజ్ఞానవంతులయిన బ్రహ్మాదులను సయితము మోహింపఁజేయువాఁడును, నీలమేఘశ్యాముండును ఆకాశముకంటెనుగొప్పవాఁడును) అనియు, "ఉన్నా

గళ్ మేలెవానవరుమఱియార్" (నీయొక్క యాశ్చర్యచేష్టిత
ములను పైనుండు నిత్యసూరులున్నెఱుంగరు) అనియు, "ఇన్నము
తెనక్కోర్ త్తిరుమాల్ శైవర్ యావరైయుమ్ మయక్కునీవైత్తమున్న
మాయుం" (శబ్దాదివిషయములు భోగ్యములని తోచునట్లుచేసి
యెట్టివారినైనను భ్రమింపఁజేయుటకై నీ వేర్పరచిన మాయ
యంతయును) అనియు, "అకత్తనీవైత్త మాయ వల్లైంపులంగళ్"
(భక్తులను దూరముగావిడుచుటకై నీవుయేర్పఱచిన పంచేం
ద్రియంబులు) అనియును శ్రీ నమ్మాళ్వారుల వారు
నాయించినట్లు, ఎటువంటి జ్ఞానవంతులైనను, "అనన్యాశ్చింత
యంతో మాం యే జనాః పర్యుపాసతే" (వేఱొక్క తలంపు
లేక యెవ్వరు నన్నుధ్యానించుచున్నారో) అనియు "భక్త్యా
త్వనన్యయాశక్యః" (అసాధారణమగు భక్తివలన పొందవల
సినవాఁడను) అనియు నిట్లు వేఱొక్క తలంపు యెంతమాత్రము
కూడనిదియగు తనయొక్క స్వరూపమును యెఱింగియున్నను,
పరమాత్మేతరములగు వాటివిషయమున వైరాగ్యములేనివా
రై, విషయాసక్తమైన మనస్సు గలవారయినట్లయిన, సర్వే
శ్వరుండు వారిని చెఱుపవలయునని తలంచి నిత్యసూరులనున్ను
మాయాబలమువలన మోహింపసమర్థమైనట్టి మాయాశక్తి
వలన దుర్విషయముల నెక్కువ ప్రేమించువారిగాఁ జేయగా అందు
మూలముగ దారాపుత్రాదులవిషయమున ప్రీతి గలవారయి,
వారిని రక్షించుటకై ద్రవ్యార్జనపరులుగా నయి అందు
మూలముగ సేవింపకూడని వారి సేవనుచేయుటయందుఁ బ్రీ
తిగలవారై, అందుమూలముగ రాగద్వేషాదులు కలవారై,
అందుమూలముగ జంతుహింస చేయువారై, రోజురోజుకు

అజ్ఞానము వృద్ధిపొంది, బుద్ధిచెడిపోయి "సంగాత్ సంజాయతే కామః" అని యారంభించి "బుద్ధినాశాత్ప్రణశ్యతి" అని చెప్పియున్నట్లు నశించిపోవుదురు. కావున ఎన్నఁడును ప్రమాదముపొందని జ్ఞానవంతులగు నిత్యసూరులనున్ను మోహింపఁజేయునట్టి భగవంతుని మాయయొక్క ప్రభావమే తప్ప యది వారిదోషము కాదు. ఇట్లు ప్రకృతి (శరీర) దోషమగు సాంసారికధర్మప్రవృత్తిని వారిపైనారోపించి వారిని నిందించినట్లయిన యాతని కదియును అనర్థహేతువు కాఁగలదు.

అనుష్ఠానములేనట్టిదియగు కేవలజ్ఞానాధిక్యమునుబట్టి. "ధర్మజ్ఞసమయః ప్రమాణం" అన్నట్లు శిష్టాచారము ప్రమాణమని "యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనాః" (శ్రేష్ఠుండు, దేనిననుష్ఠించునో దానినే యితరులనుష్ఠించునది) అన్నట్లు శిష్టాచారమే ప్రమాణముగాఁ జెప్పఁబడినదనుకొని వినువారికి వినుకు పట్టునట్లు, దుర్వాసనామూలముగ విపరీతార్థములను బోధించునట్టి అల్పజ్ఞానవంతులను ధర్మజ్ఞులనుగాఁ దలంచి, మాయలోఁబడి వారాచరించునట్టి సాంసారికహీనకృత్యంబులను శిష్టాచారములనుగాఁ దలంచి, "శతాంధాః కూపం ప్రవిశంతి" (నూరులకొలది గ్రుడ్డివాండ్రు భావిలోఁ పడుదురు) అన్నట్లు, తామున్ను వాటినాచరించినట్లయిన, వినాశమే ఫలించును. కావున వారి యనుష్ఠానము నవలంబించుట కాని, వారిని నిందించుట కాని యీ రెండును తగినవి కావు.

అందువలన "సువ్యాహృతాని మహతాం సుకృతాని తతస్తతః। సంచిన్వన్ ధీర ఆసీత శిలహారీ శిలం యథా" శ్రేష్ఠులయిన వారి శ్రీసూక్తులను అనుష్ఠానంబులనున్ను పరిగెను భక్షించు

వాడు దానిని చేర్చునట్లు చేర్చుకొనునది. అనియు, “యాన్య
స్మాకంసుచరితాని తానిత్వయోపాస్యాని” (ఏవి మాయొక్క
మంచినడవడికలో, అవి నీచే నవలంబింపవలసినవి) అనియును చెప్పి
యున్నట్లు, సారంబులగు శాస్త్రార్థంబులను, వాటి యనుష్ఠానం
బులనున్ను కలిగియుండునట్టి మహాత్ములను వంకపెట్టక, చేత
సుల హితమునుగని బాగుగ సాయించినట్టి శ్రీసూక్తులను త
మకున్ను ఇతరులకున్ను నష్టము గలుగకుండునట్లు, గురిగా న
నుష్ఠించుకొని పోయినట్టి మంచి యనుష్ఠానంబులనున్ను బా
గుగ పరిశీలించి పరిగెధాన్యమును భక్షించువాఁడు, దానిపై వె
తకునట్లు, భ్రమప్రమాదాదుల మూలముగాఁ జెప్పునట్టి వా
క్యములనున్ను ప్రకృతివశమునఁ జేయునట్టివ్యాపారములనున్ను
వదలి, మంచిగా నడుచుకొనవలయునని చెప్పియున్నది కదా!

భాగవతులగు వారినిన్ని మాయ మోహింపఁజేయునా?
యంటివేని చెప్పెదను. శ్రీ తొండరడిప్పొడియాళ్వారులు అస్ఖ
లిత బ్రహ్మచారులై కైంకర్యపరులుగానుండియున్నను, దేవదేవి
యను నొక వేశ్యను జూచి మోహించి దానివెంట పోయి, ప్రా
ప్తవిషయమగు కైంకర్యమును పోగొట్టుకొని యావిషయము
న నెక్కువ ప్రీతికలవారై సమస్తదుఃఖంబుల ననుభవించినారు
కదా! మాయయొక్క ప్రభావ మిదియే. కావున సదాచా
ర్యుని యభిమానము నెన్నఁడును వదలుకొనక, ప్రవర్తించు
కొనినట్లయిన, సర్వేశ్వరుండు వాని లీలకుఁ గొనుట కవకా
శము లేకుండ చేయునని వాని యభిమానము నపేక్షించునది.

సర్వేశ్వరుండు తన యభిమానమును సంపాదించుకొనినట్టి
వారినిన్ని తనలీలలోఁ బడవేసి కొనునా? యంటివేని, చెప్పెదను.

ఇతర విషయము లన్నింటియెడల స్పృహలేని వారై, అహం
కార రహితులై పరమార్తులయిననే తప్ప, ప్రాకృతవస్తువుల
యందు రుచికలవారయినను, తాము ఉత్కృష్టులమనెడి య
భిమానము కలవారైనను, దేహమును గాని, దేహమును బట్టి
యుండు వారలగు బంధువులను గాని యనుసరించిపోవువారయి
నట్టయిన, నాల్గు దినములు సర్వేశ్వరుండు తనలీలకు విషయ
భూతులనుగాఁ జేసికొనుటకు సంశయము లేదు. ॥ తెళివుత్తు
ప్పివిట్టనిట్టవర్ కళిన్ పక్కాదిశై య్యుమ్ తీర్ందవడియవర్ తమ్మై
తిరుత్తిప్పణికొళ్ళవల్ల" అనఁగా అర్థపంచకమును బాగుగాఁ
దెలిసికొని, వివేకముతో ప్రవర్తించునట్టి యనన్యప్రయోజను
లగు శేషభూతులనే తనను పొందుటకుఁ దగినట్టివారినిగాఁ
దిద్దుపాటుచేసి, వారివలన నిత్యకైంకర్యమును స్వీకరించునని
శ్రీ నమ్మాళ్వారులవారును సాయించియున్నారు. మేము భగ
వంతుని మందిరమును పాలించువారమనెడి యహంకారము
గల జయవిజయులను మునిశాపమనెడి మిషవలన రాక్షసుల
నుగాఁ జన్మింపఁజేసినాడు కదా! ఇంద్రద్యుమ్నుండను రాజు స
ర్వేశ్వరునే ధ్యానముచేయుచుండి తనతో సమానముగ భక్తి
నిష్ఠుండు లేడని వాని మనస్సునఁదోచిన తోడనే అగస్త్యుని శాప
మనెడి మిషవలన ఏనుగనుగా జన్మింపఁజేసి, కొంతకాలమచ్చ
టనే యుంచి ॥పోయ్ గైముదలైచిరైప్పట్టునిన్ఱ మావుక్కరుళ్
శెయ్ త" (సరస్సునందు చరపడియున్నట్టి గజేంద్రునిరక్షిం
చినవాఁడు) అన్నట్లు సరస్సునందు మొసలిచేఁ జిక్కికొని
గర్వముడిగి ॥రక్షించు! రక్షించు!" అని ఘోషించుచుస్తోత్ర
ముచేయఁగా, ఒట్టువిడిపోఁగా తలముడి విడిపోఁగా, ॥భగవతః

త్వరాయైనమః" (భగవంతుని త్వరకునమస్కారము) అని క్షానాధికులున్ను ప్రేమించునట్లువచ్చి రక్షించినాడు కదా! కావున అహంకార, విషయప్రావణ్య, భాగవతాపచారాదులతో సంబంధమున్నట్లయిన, జ్ఞానభక్తులున్నప్పటికిన్ని, వ్యర్థములై లీలకె విషయభూతు లగుదురు. వారికంటెను భక్త్యతిశయము కలవారైనట్లయిన, కొంతకాలము లీలలోనుంచి గర్వముడుగునట్లుచేసి, అటుపిమ్మట యనుగ్రహించును. శుష్కజ్ఞాన వైరాగ్యంబులు కలవారైనట్లయిన, "పద్మకోటిశతేనాపి నక్షమామి" అన్నట్లు యెప్పటికిని లీలలోఁబడియుండి నిత్యసంసారులగుదురు. కావున మనము భగవంతునిచే నభిమానింపఁబడినట్టి వారముకామా? మనకేమిభయమని తలంచి అహంకార, విషయప్రావణ్య, భాగవతాపచారములు కలవారు కాకూడదు. బద్ధసంసారులుగా నుండకూడదు. పూర్వకాలమున జంబాదిరాక్షసులు తనకు భక్తులైయుండియు, పరులను హింసపెట్టునట్టి వారైనతోడనే వారలు తనను విడిచిధ్వంసమైపోవునట్లు మోహశాస్త్రములను ప్రవర్తింపఁజేసి, విపరీతార్థముగలవారినిగాఁజేసి తనకు దూరమైనవారినిగాఁ జేసినాడు కదా!

అట్లే సుకృతవిశేషమువలన శ్రీవైష్ణవులయింట బుట్టియు, రాక్షసస్వభావముకలవారై, భూతవహింస చేయువారై, అర్థకామములమూలముగ భాగవతాపచార పరులయినట్లయిన, విపరీతజ్ఞానమును గలుగఁజేసి, సర్వశబ్దంబులకును విపరీతార్థములు తోచునట్లుచేసి, నిషిద్ధానుష్ఠానపరులనుగాఁజేసి, తననుండి వేరుచేయును. సర్వేశ్వరుండు ఏరిని తననుండి వేరుచేయుటకుఁగారణంబులు మూఁడు "పుత్రోర్లైవంపేణప్వార

త్తిట్టు" (దేవతాంతరములఁ బ్రేమింపఁజేసి) అనియు "నెరికాట్టి
సిక్కుతిరాయో" (వెరేచూపించి చెడిపెదవా) అనియు, "అకత్తనీవై
త్తమాయవల్లైంపులాకళామవై" (వేరుచేయుటకై నీ వేర్పరచిన
క్రూరములైన ఇంద్రియములు) అనియు "పలనీకాట్టిపడుప్పాయో"
(అనేకములను చూపించినన్ను చెడిపెదవా) అనియును సాయించి
నట్లు, దేవతాంతర, సాధనాంతర, విషయాంతరముల యెడల ప్రీతి
యనునది సర్వేశ్వరునుండి వేరయిపోవుటకుఁ గారణ మగునని
శ్రీనమ్మాళ్వారులు సాయించియున్నారు. వీటిలోనొక్కొక్క
టియె సర్వేశ్వరునుండి వేరు చేయునదియైనను ఒక్కదాని కం
టె నొక్కటి యెక్కువక్రూరమైదిగానుండును. ఈ విషయము
వారి పాశురములనుండియె తెలియగలదు. అదియెట్లనిన "ప్రో
త్తిమత్తోర్ దైవమ్ పేణప్పుర త్తిట్టు" (వేఱొక్కదైవమును
ప్రేమింపి వేఱగునట్లుచేసి) అని చెప్పియున్నందున దేవతాం
తర విషయము వేరుచేయునట్టిదియై "నెరికాట్టి నీక్కుతిరాయో"
(అనేకములనుచూపించి వేరుచేసెదవా) అనుటచే ఉపాయాంత
రము వేరుచేయునదియె "వలనీకాట్టి ప్పడుప్పాయో ఇన్నుం
కెడుప్పాయో" (అనేకములనుచూపించి యింకను చెడిపెదవా)
అనుటచే విషయాంతర సంబంధము స్వరూపమును నశింపఁ
జేయునని నిస్సంశయముగాఁ దెలిపియున్నారుకదా! ఇట్లు స్వరూ
పనాశకమగు విషయాంతరముకదా భార్యాపుత్రాదిసంబంధము.
లోకమున నొకక్షుద్రమనుష్యుని పోషణలోనున్నట్టిస్త్రీ
వేఱొక్కనిని మోహించినట్లయిన చిత్రవధనుచేయు నట్లు చూ
చియున్నాము కదా! ఇట్లుండ సర్వస్వామియై, సకలేతరవిల
క్షణుండై పరమభోగ్యుండై సర్వశక్తియగు సర్వేశ్వరునియాశ్ర
యించి, వాని యభిమానములోనుండి, అరు ప్రకారములుగ

అయితే «భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ" ప్రచు రముగా నీకు నమస్కారమని చెప్పెదము" అనియు, «త్వదంఘ్రి ముద్దిశ్య కదాపి కేనచిత్ యథా తథా వాపి సకృత్కృతోఞ్ జలిః" (ఎవ్విధమునన్నైన నొకవిధమున నెవ్వడైన నొకప్పుడు దండము సమర్పించిన మాత్రమున) అనియు. «అంజలిః పరమా ముద్రా క్షిప్రం దేవ ప్రసాదినీ" (నమస్కారము శీఘ్రముగ భగవదనుగ్రహమును గలిగించునది) అనియు, «యెన్నాతు మెన్నుమిత్తుమిక్కై" (దాసుండనని వ్రాసియిచ్చి చాలును) అనియు నిట్లు ఆప్తులును, సర్వేశ్వరుండును, ఆచార్యులును, నమస్కారమాత్రము చాలుననియు, అదే యెక్కువయనియు దేనినైన లెక్కపెట్టునప్పుడు ఒక్కటి రెండు అనియిట్లు వరు సగా చెప్పుకొనుచువచ్చి ఇరువదియారంటిమేని ఇరువదియార వ వాఁడను నేనని వచ్చుననియు నిట్లు యెక్కువ సులభము ని మేలచెప్పి యున్నారంటివేని తెలిపెదను. ఆశ్రయించుటకు న్యస్తుండగు ఈ జీవుండు తనయొక్క దోషములనున్ను దారి ద్ర్యమునున్ను తలంచుకొని భయపడి, మరలిపోకుండునట్లు శర ణ్యుండగు సర్వేశ్వరుని ప్రభావముఁ జెప్పుటకుగాను మాత్రము అట్లు చెప్పఁబడినది. ఇంతియె కాని, అవి శరణాగతరక్షణము ను గురించి చెప్పునట్టి సందర్భమున చెప్పవలసిన మాటలు కావు.

తనకు శేషభూతుండనని కాని, ఇతరులకు శేషభూ తుండనని కాని తలంపక, భగవద్విషయము నవలంబించి నట్లయిన, అటుపిమ్మట క్రమప్రకారము «పార్యైకైమైశోస్తి ప్పరమే వ్యరమే సూదిమెయ్యే పెత్తోక్షిస్సేక" (ప్రత్యుప

కారమువచేసెకననియుబద్ధమునే చెప్పి తుదకు సత్యముగు ఫలమునే
లభించినవాడను) అని యెంచినట్లు పైకి మంచిమాటలు చెప్పి
నను, అవియె సత్యములగునట్లు పూర్తిచేయుటకు సమస్థం
డును సర్వశక్తుండగు సర్వేశ్వరుని కృపవలన కావలసిన యో
గ్యత లన్నియును తమంతటనే సిద్ధించునంత సులభమైన విష
యముని చెప్పఁబడినట్లు గ్రహించునది. ఇట్లు గ్రహింపక అవి
యెట్లున్ననో అట్లు యత్నముచేసికొనినట్లయిన, కర్మజ్ఞానాదు
లును అక్కఱలేదు. భక్తిప్రపత్తులును అక్కఱలేదు. ఆచా
ర్యాభిమానమున్ను అక్కఱలేదు. వైష్ణవత్వమున్ను అక్కఱ
లేదు. దేవతాంతరాదులను వదలుకొనవలసినదియును లేదు.
శాస్త్రీయములను నెఱుంగవలసినదియును లేదు. అకృత్యకరణాది
భాగవతాపచారపర్యంతములగు నిషిద్ధానుష్ఠానంబులకున్ను
భయపడ నక్కఱలేదు. ఇష్టమువచ్చినట్లు నడచుకొనుచు
యెదొక రోజున ఒకదండము పెట్టినట్లయిన సర్వము సిద్ధిం
చునని ప్రసక్తించును. అందువలన మోక్షశాస్త్రము ఉప
యోగములేనిదై, ఆళ్వారులయొక్కయును, ఆచార్యులయొ
క్కయును వచనానుష్ఠానంబులును వ్యర్థంబులై భగవద్విష
యమునకుఁగల వైలక్షణ్యమున్ను తుచ్ఛమై పోవును.

వేదమునందుఁ జెప్పియున్నట్లయిన, స్తుతించుటకయి చెప్ప
బడిన దనవచ్చును. ఋషులు చెప్పినట్లయిన, భ్రాంతివశమున
చెప్పినారనవచ్చును. సర్వేశ్వరుండు చెప్పినట్లయిన, తమో
గుణపరవశులైన వారికి గాను చెప్పినాడనవచ్చును. ఇందుకయి
యును ప్రమాదములేని జ్ఞానానందమును లభించి, చేతనుల
హితమునకై ప్రవర్తించువారలయి, యథార్థజ్ఞులఁ దెలిసి

కొనువారును, తాము తెలిసికొనినట్టివారలని యితరులకుఁ దెలుపు నట్టివారునగు ఆళ్వారుల "పొయిల్ పాటెన్" (అసత్యములేని పాశురములు) అన్నట్లు కించుకయినను అసత్యములేకుండ సాధించియున్నట్టి ప్రబంధములయందు "ఎ'త్తుత్తేత్తామననే" అనఁగా దండముపెట్టిన మాత్రమున నుజ్జీవన హేతువగునని యు, "పత్తుడైయడియవర్క్కెళియవన్" అనఁగా కొంచమైనను భక్తికలవారైనట్లయిన వారికి సులభుండను అనియు, "పరివతిల్ ఈశనైప్పుకైపూవే' అనఁగా యేదయిన నొక ధూపమును గాని పుష్పమును గాని యాభిముఖ్యసూచకము గాను సమర్పించినట్లయిన, అంతే చాలుననియు, "కణ్ణిక్కినియ్యున్ కాతల్ నైన్దూల్ తొణ్డివెళ్ళుంవరుం" అనఁగా పరమభక్తి పరిగణన లున్నంతే మాత్రమున సేవసాయించుననియు, "కండామే నెంజే కరుమంగళ్ వాయ్క్కిట్టు వోరెండానుమిట్టమే వందియలు మాఁగ్" అనఁగా ఓమనస్సా సర్వేశ్వరుండు మన మపేక్షింపకమే తనకు తానే యనుగ్రహించుటను జూచితివా! అనియు, "శిత్తవేండా శిందిప్పేయమైయుమ్" అనఁగా కష్టపడి చేసినిన్ని చేయ నక్కఱలేదు వానిని పొందవలయు ననుడి కోరికయున్నట్లయిన, అంతమాత్రమే చాలును అనియు నీ మొదలగు పాశురములయందు ఆశ్రయణము సులభమని చెప్పి "శరణమాకుం తనతాళడైన్దార్కెల్లామ్ మరణమానాల్ వైకుందం కొడుక్కుమ్ పిరాన్" అనఁగా తన శ్రీపాదముల నాశ్రయించిన వారికందఱికిని అనిష్టనివృత్తి పూర్వకముగు నిష్టప్రాప్తికి తానే యుపాయమై శరీరవిమోచనానంతరము పరమ పదము నొసంగునని సాధించినది యసత్యమా? యం

ట్టివేసి, యింకులకు సమాధానమును శ్రీమధురకవియాళ్వా
రులు కణ్ణినుణ్ శిరుత్తాంబునందు సాయించియున్నారు
—అదియెట్లనిన, "అన్నైయాయ్ త్తనాయొన్నై యాండెనన్
తన్నురియాన్" అనఁగా మొదట శ్రీనమ్మాళ్వారులు ఈ
చేతనులు భయపడకుండ తల్లివలెనే దయాళువులై శరణ్యుఁ
డగు సర్వేశ్వరుని ప్రభావముఁ దెలిపి, వశపఱచుకొని,
లాలించి, అటుపిమ్మట ఉద్ధసంసారులై పోకుండ, తండ్రివలెనె హి
తపరులై శరణాగత రక్షణముఁ దెలిపి వశపఱచుకొని సమ్మతిం
పఁజేసి నన్నాశాపాశినారనిసాయించినారు కదా! అది యెటువ
లెననఁగా—బిడ్డకు లేచినగడ్డకు చికిత్సచేయునప్పుడు తల్లియై
నది బిడ్డకు పాలిచ్చును, తండ్రియయినవాఁడు దగ్గరయుండి ఇ
దిగో పోయింది పోయింది యనుచు లాలనచేసి, క్రమముగా
నాకుగఫును [illegible]రించివేసి, నయముచేసి రక్షించునట్లు, శ్రీ
నమ్మాళ్వారులును మొట్టమొదట "తొఴుతుఁతొఴుతు" అను
తావున నమస్కరించుటయే చాలునని చెప్పి, యటుపిమ్మట "వీ
డుమిన్ ముత్తమున్" అనుతావున భగవద్వ్యతిరిక్తము లగు
పశు, పుత్ర, మిత్ర, కళత్ర, గృహ, క్షేత్రాదుల నన్నింటిని విడి
చిపెట్టుడని చెప్పఁగా, అనాదికాలముగ పరిచితములయిన వి
షయములను వెంటనే యెట్లువిడువ గలము? వానిని యాశ్ర
యించిన పిమ్మట క్రమముగ విడిచిపెట్టెదమంటె, యదికూడన
సియు. చండాలులు నివసించిపోయిన తావును బ్రాహ్మణుల
యుపయోగమునకై గొనునప్పుడు, కొన్నింటి నుంచుకొనవచ్చు
నా? "అహంమమేతిచండాలః" అన్నట్లు అహంకార మమకా
రదూషితములైన వన్నియును, "భవంతిసర్వేప్రతికూలరూపాః"

(అన్నియును ప్రతికూలములగును) అని తలంచి "వీసు శెయ్‌దు
న్న్యాయిన్ వీసుడై యూసిడై వీసు శెయ్ మినే" అను తావున వాటి
నన్నింటిని విడిచిపెట్టి ఆత్మసమర్పణముం జేయుడనియుం దేశిం
చి తిలలయందుండు తైలమువలె దుర్వివేచనముగు దేహమును
న్ను దానినిబట్టియుండువారై విడువరాయుండునట్టి భార్యాపు
త్రాదులనున్ను, వారికి జీవనోపాయములగు గృహక్షేత్రధన
ధాన్యాదులనున్ను యెట్లు విడువగలమంటివేని, "సెర్‌నుమదెన్ని
నై నేర్‌ముతల్ పూయ్ తిరశేర్మినే" అను తావున దేహమువిష
యమున నేను అనెడి తలంపును, ఆత్మవిషయమున స్వతంత్రుం
డనెడి తలంపును దానినిబట్టియుండువారివిషయమున తనవార
నెడి తలంపునున్ను తల్లివేరుతోంగూడ మూలచ్ఛేదముం జేయు
టచే వాటిని నివర్తింపజేసికొని సర్వేశ్వరునిం బొందుటకై ని
రీక్షించుడని సాయించియున్నారు.

త్యజించువిధముం దెలుపుట,

వీటిని వేలుతోంగూడ ఛేదించుటయనంగా—ఇట్లు శత్రు
గృహముగు శరీరమును తనను హింసించునట్టి శత్రువునుగాం దలం
చి, పెరుగు, పాలు, నెయ్యి మొదలగువాటిని భుజించుటచే బల
పడుచక, పుట్టుకతోంగాని, వేతొక్క దానిసంబంధమువలనంగాని
వేతొక్కనిమిత్తమునంగాని దూషితములుకానివై పరిశుద్ధము
లయినట్టి పదార్థములను భగవంతునికి నివేదనముచేసి, శరీరధా
రణముకు కావలసినంతమాత్రము స్వీకరించుచు స్వల్పంబుగ
భుజించువాండై ఇంద్రియంబులకవకాశమునీయక, వీటిని నిగ్ర
హించియుండువారిం జూచినట్లయిన, పరమాప్తులనుగాం దలం
చుచు, వీటిని వృద్ధిపొందించువారిని శత్రువులనుగానును త

లించుచుండుటయును, ఈ యాత్మవస్తువు భగవంతునికే శేషభూతమైనదనియు, పరతంత్రమైనదనియును తలంచుచు నుండుటయే యహంకారము త్యాజ్యమని నిశ్చయించుకొని యుండుట యనునది

ఇక దానికి బట్టియుండువారలగు భార్యాపుత్రాదులను లంకాపట్టణమున సీతాపిరాట్టిని హింసపెట్టువారగు యేకకర్ణాది రాక్షసస్త్రీలవలెనే మనలను బాధపెట్టునట్టి వారలని తలంచి “అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు” అన్నట్లు వారితోఁ గలిసియుండుటను అగ్నితోఁ గలిసియున్నట్లు తలంచి పరితపించుచుండుటయే మమకారము త్యాజ్యమని నిశ్చయించుకొనియుండుట యనునది.

కావున “శరైస్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః । మాం నయేద్యది కాకుత్స్థః తత్తస్య సదృశం భవేత్” (శత్రుహింసకుఁడగు రామచంద్రుఁడు లంకయందంతటను బాణంబులను వేసి నన్నుఁ గొనిపోయినట్లయినది వానికి తగియుండును) అని యపేక్షించియుండునట్టి శ్రీ సీతాదేవివలెనే చరసాలవంటిది యగు శరీరంబును, రావణునివలె నాత్మాపహారియగు దుర్మోహమును, రాక్షసులవలెనే బాధకులగు దారాపుత్రాదుల సంగమమునున్ను విడిపించి నన్నుకటాక్షించుట యెన్నటికో యని యపేక్షించియుండుటయే అహంకార మమకారములను వేళ్లతోఁ గూడ ధ్వంసముచేయుట యనునదియని చెప్పఁబడినది. ఇట్టి యార్తి లేకుండినచో, వట్టి నోటిమాటలవలన ప్రయోజనము లేదు. పాము కరచిన తావును గుడ్డతో తుడిచివేసిన మాత్రమున విషము పోఁజాలదు గదా!

అట్లు మేలచెప్పఁదగును? తిరుమంత్రమందుండు "నమః" అనుపదము ఈ యాత్మ అచేతనమువంటి పరతంత్రుండని విధించియుండఁగా, సర్వేశ్వరుని నిర్బంధించి తామున్ను స్వతంత్రులయి ప్రార్థింపఁదగునా? ఇందువలన తన రక్షణముకై తాము ప్రయత్నించినట్లు కాదా యంటివేని, చెప్పెదను. ఇది ఈ తనకాగంతుకము కాదు, కైంకర్యప్రార్థనవలెనే కైంకర్య ప్రతిబంధకములగు అవిద్యా, కర్మ, వాసనా, ప్రకృతిసంబంధంబులు నివర్తించుటకై ప్రార్థించుటయనునది స్వరూపము కనుకూలమైనది యగును. (నారాయణాయ) అను తావునను "ఆయ" అనుచతుర్థియందు కైంకర్యప్రార్థనవలెనే, "నమః" అను పదమునందే కదా యిష్టవిరోధినివృత్తికిగాను ప్రార్థనయును ప్రకాశించును. "కైంకర్యప్రార్థనవలెనే యీపదమున (నమః అనుపదమున) ప్రార్థనయొక్కటి కలదు. అందు అవిద్యాదులు నివర్తింపఁబడును" అని కదా ముముక్షుప్పడియను గ్రంథమున శ్రీ పిళ్ళైలోకాచార్యులవారు సాయించియున్నారు. శ్రీ రామానుజులవారును గద్యత్రయమను గ్రంథమున, సమశ్శ్రద్ధముయొక్క యర్థమును దెలుపు సందర్భమున, "మనోవాక్కాయైః" అను చూర్ణికయందు ఇట్టి విరోధినివృత్తికిగాను ప్రార్థనను తెలిపి యున్నారు కదా!

తనను తానే రక్షించుకొనుటకై యజ్ఞము, దానము, తపస్సు ఇవ్విధముగ కర్మయోగాద్యుపాయానుష్ఠానమునఁ బ్రవర్తించినచో కదా! పరతంత్రుండయినవానికి స్వరక్షణమున స్వప్రయత్నము కూడదని చెప్పవచ్చును. అయితే కైంకర్యమునకై ప్రార్థించుటయు, అందులకుగాను విరోధులు తొలఁగిపో

సహింప శక్యముకానిదో" అన్నట్లు మిక్కిలి ప్రియమయినది గానుండునని చెప్పఁబడినది. ఇంతియే. ఆర్తులు కాకూడదంటివేని విషయవైలక్షణ్యమున కనుగుణముగ ఆర్తియే లేకున్నట్లయిన, అధికారులుకానివారై మూఢులై పోవలసివచ్చును. అట్లునర్వేశ్వరునికి భక్తుల శరీరమభిమతమని సాయించినట్టి నమ్మాళ్వారులే "మంగవొట్టుక మాపూరై" (నీయొక్క యాశ్చర్యములయిన ప్రకృతిప్రాకృతములనునశింపఁజేయుమా) యని కాళ్ళు పట్టుకొని, "తిరువాణైనిన్నాణై" (పిరాట్టితో బట్టుసుమీ) యన్నట్లు వొట్టుపెట్టి ప్రార్థించి శరీరవిమోచనమును గలుగఁజేసికొనినారు కదా! ఈతనికి ఆర్తియున్నట్లయిన, భగవంతునికి యిష్టుండగును. ఆర్తి లేకుండ, కామపరవశుండయినట్లయిన, సంసారులలోనితండును ఒక్కండగును. కావునఅర్తికలవాఁడే యధికారి.

ఈ యధికారికి దేహము విషయమునను, దేహమునుబట్టియుండు బంధువుల విషయమునను సర్పమును జూచినట్లు, భయము కలిగినటయిన, అహంకార మమకారములు నశింపగలవు. అట్లు కాకున్న, అవిద్యావృక్షముయొక్క విత్తనము మొలచి, అనేకవిధములుగ వృద్ధిపొంది, అర్థ కామాపేక్షలును, రాగద్వేషములును, శోక మోహంబులును, పుణ్యాపాపంబులును, సుఖదుఃఖంబులును వృద్ధిపొంది, ఎటువంటి జ్ఞానాధికుఁడయినను, బద్ధసంసారియై చెడిపోవును. వీటినన్నింటిని మనస్సున నుంచుకొనియే శ్రీనమ్మాళ్వారులవారు "మీారు మీాది యనెడి యజ్ఞానమును వేరుతోఁగూడ త్రెంచివేయనది" అని శరణాగతుని లక్షణంబులఁ జెప్పునట్టిసందర్భమున సాయించియున్నారు.

«పత్తుడైయడియవర్క్కెళియవన్» (భక్తిగలదాసులకు సులభుండు) అనుతావున సౌలభ్యముఁజెప్పి, «వణక్కుడైత్తవనెరి వఴినిన్ఱు» అనఁగా భగవద్గీతలయందుఁజెప్పియున్నట్టి భక్తిప్రపత్తులను గలుగఁజేసికొనుడనిచెప్పి «పురివదువుకైప్పూవే» అనుతావున భగవంతునియారాధింపమని, «కడుమినె త్తొండీర్ కత్తిత్తొత్తుమినే» అనఁగా బాహ్యవిషయములతో సంబంధమును వదలుకొని, దండముసమర్పించునట్టి వారయి నటయున్న, వాఁడు తనను లభించునట్లు చేయునసియు, ఇరువదియారు వరకు లెక్కపెట్టినను లభించునని యును చెప్పియు, «సీయుమ్ నానుమ్ నిన్నైర్నిర్కిల్ మేల్ మత్తోర్ నోయుమ్ శారకొడా నెంజమే» (ఓమనస్సా! నీవు నేను ఇట్లు నిలిచియుంటిమేని సర్వేశ్వరుండు మనకేయుపద్రవములను రానియ్యఁ" అనుల చేభయపడ వలదని చెప్పి «పున్మైయిలాదవర్క్కు వాన్తత్తేయామ్» (అనన్యప్రయోజనులకుజ్జీవన హేతువు) అనియు, «మరణమానాల్ వైకుందమ్కొడుక్కుం» (మరణించినప్పుడు వైకుంఠము నిచ్చువాఁడు) అనిచెప్పి «మెయ్యనాగుమ్విరుమ్బిత్తొళువార్క్కెల్లామ్ పొయ్యనాకుమ్ పురమే తొళువార్క్కెల్లామ్» (ప్రేమించి దండముసమర్పించువారికిసత్యవంతుండగును. అట్లుగాకుండ. పైకిమాత్రము నమస్కరించువారికి అసత్యముగలవాఁడగును) అనుటచే మొదట శరణ్యుండగు సర్వేశ్వరుని వైభవముఁదెలిపి, యటు పిమ్మట, శరణాగతుండగు జీవుని లక్షణములఁ దెలిపియున్నందున, మొదట చెప్పినది యీచేతనునికి భగవద్విషయమున రుచిఁ గలుగఁజేయుటకనియు, తరువాత చెప్పినది యీచేతనుని కుండవలసిన స్వరూపమును తెలుపుటకనియును గ్రహించునది.

అయితే ముందుచెప్పినవిధమున శరణ్యుండగు భగవంతుని స్వభావముండుట యసత్యమా? యంటివేని, యది యసత్యము కాదు. "అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్" అని యారంభించి సాధించినట్లు, పూర్వము మిక్కిలి దురాచారుండై యున్నను, సర్వేశ్వరునే భజించునట్టి వాఁడయినట్లయిన, శీఘ్రముగ విలక్షణుండై యుజ్జీవింపఁగలఁడు. అటు పిమ్మటనున్ను, పూర్వపువాసన ప్రకారము నడుచుకొని నట్లయిన, అట్టివాసన నశించి భగవదనుభవ యోగ్యుండగుటకు కొన్నిదినములు ఆలస్యమగును. ఇంతియేకాని, ఫలము సిద్ధించుటలో సందియము లేదు. అది యెటువలెననిన, రాజకుమారుఁడు కొందఱు ఆడపిల్లలను తనపోషణలో నుంచుకొని, వారికి యౌవ్వనమువచ్చినప్పుడు వారిని తనభోగమునం దుపయోగపఱచుకొను నట్లును, వ్యవసాయదారుఁడు వ్యవసాయముచేయునప్పుడు విత్తనముఁ జల్లి మొక్క మొలచినవెంటనే కోసి తినకుండ, పెరిగి కాడముదురి ఫలించిన పిమ్మట వాటిని తాను భుజించుటకుఁ దగినట్లు రసాన్నమునుగాఁ జేసి భుజించునట్లును, సర్వేశ్వరుండును వైలక్షణ్యానుగుణముగ దిద్దుపాటు చేసి, వినియోగపఱచుకొనును. కావున ఈ జన్మమున అంత్యకాలమునందైనను, అప్పుడు కాకున్న, వేఱొక్క జన్మమునందైనను, యోగ్యుండగునట్లు దిద్దుపాటుచేసి, తనతోఁ జేర్చుకొనఁ గలఁడు. కావున వానితో సంబంధమున్నట్లయిన, యెల్లకాలము బద్ధసంసారియై, విషయప్రవణుండునై పోవునట్లు విడనాడఁడు. "నమేభక్తః ప్రణశ్యతి" (నాభక్తుండు నశింపఁడు) అని తానే చెప్పియున్నాఁడు కదా! "అడియరైవల్వినైత్తుప్పాంపు

ల్లేందుమెత్తుంజక్కొడా॥” (దాసులను క్రూరములగు పంచేంద్రియములమూలముగ కష్టపడనీయనివాఁడు)అనియాళ్వారులును సాయించియున్నారు కదా! ఒకానొక దినమున నంబిళ్లగారు పిన్నప్రకియనాయనార్ పెరుమాళ్ జీయ్యరువారి మఠమునందు వేంచేసియుండఁగా, వారినాశ్రయించి యుండునట్టి స్వాములు “ప్రాప్యము సిద్ధింపవలయునన్న నమ్మాళ్వారులదశను పొందవలసియున్నదే! అన్నపానాదుల నాశించియుండునట్టి మేము యేమిచేయగలము? అని విన్నవింపఁగా. నంబిళ్లగారు “ఈలోకమునందట్టి దశ కలుగక పోయినను,స్థూలశరీరమువిడిపోయ్యేలోగా తనను పొందుటకు ముందుగ అట్టి దశను సర్వేశ్వరుండే కలుగఁజేసి తనతోఁజేర్చుకొనును” అని సాయించిరి.

అధికారి లభింపనందున సర్వేశ్వరుం డవతారంబులనెత్తుట యెట్లుంటిదని, “వెంట్రుకలు నాలుకకు చుట్టుకొనునట్లు” అని నంబిళ్లగారు సాయించుదురు. అది యెట్లనఁగా—అధికారిని లభింపనందున నానావతారమును ధరించి లభించినను, ప్రయోజనాంతరపరులగుటంజేసి, వెంట్రుకలుపడిన యన్నముతినుటచే నాలుకకు చుట్టుకొని కష్టపడినట్లుండనని నంబిళ్లగారు సాయించుదురు.కావున అనన్యప్రయోజకుండగు అధికారిని సర్వేశ్వరుండు వెదకి పట్టుకొను దామంటే, దుర్లభ మాయెను. అనన్య ప్రయోజనులగు అధికారులను విరజానదియొక్కయావలివద్దున చూడవచ్చునే కాని, యీ విభూతియందట్టివారలు కాన్పించుట యపరూపమని ప్రమేయరత్నమను గ్రంథమున సాయించి యున్నారు కదా!

ప్రపన్నుండయినను, ఇట్టి దౌర్లభ్య మున్నట్లయిన, (ప్రపత్తి) సులభోపాయంబని యేల చెప్పఁదగునంటివేని, చెప్పెదను. ఉపాయాంతరముల వలెనే కఠిన ప్రయత్నములచే సాధింప వలసినది కాసిపై, అన్నింటిని వదలుకొనుటచేతను మాత్రమే సాధింపఁబడునది యగుటంజేసి సులభమైనట్టిదిగా నుండును కదా! ఈ చేతనుని దుర్వాసనాబలమువలన నిది దుష్కరముగాఁ దోచునే తప్ప, యజ్ఞము, దానము, తపస్సు, ధ్యానము కృచ్ఛ్రము, చాంద్రాయణము, ఫలమూలాదులను భక్షించుటచే శరీరమును శుష్కింపఁజేయుట యీ మొదలగువాటిలో నొక్కటియును నిందు లేవు కదా! వాటినన్నింటిని బొత్తుగ వదలుకొనుటయే కదా దీనికి కావలసినది. ఇంతమాత్రమైనను చెయనియెడల, నిత్యసంసారిగా పోవలసినదియె.

అయితే యిది యంతసులభమైనట్లయిన, "సమహాత్మాతు దుర్లభః" (అట్టిమహాత్ముండు దుర్లభుండు) అనియు, "ఓరొరువరుణ్డాకిల్ అత్తనైకాణ్" (యెవ్వరైనా ఒక్కరువుంటే అంమాత్రము చాలునా) అనియును ఏల చెప్పియుండ వలయునంటివేని, చెప్పెదను. "త్రిభిర్గుణమయైః భావైరేభిస్సర్వమిదంజగత్ మోహితంనాభిజానాతి" (సత్త్వరజస్తమోగుణమూలకములగు మూడుభావనలచే ఈ జగత్తు మోహింపఁబడియున్నదను మాటనెఱుంగదు) అన్నట్లు సత్త్వరజస్తమోగుణ మూలకముగను, అతిక్రమించుట కలవికానిదియునునగు భగవన్మాయయొక్క ప్రభావమువలన వాటినన్నింటిని వదలుకొనుటయును సంభవింపదు కదా! అందువలన దుర్లభమని చెప్పియున్నారు.

అయితే ప్రకృతి వశ్యుండగు ఈ చేతనునికి ఇట్టి యధికారము లభించుట యెట్లంటివేని, చెప్పెదను. ఇది స్వప్రయత్నమువలనఁగాని, వేఱొకరి మూలమునఁగాని లభింపశక్యము కాదు. భగవత్కటాక్షము మూలముగ లభించిన సదాచార్యుని యనుగ్రహమువలన లభించు ననుటకు సందియము లేదు. "మరంగళుం మిరంగళుంవై" స్మృతములును కృపగలవియగునట్లు చేయువాఁడు) అనుతావున సదాచార్యుని సన్నిధియందు స్థావర పదార్థములు సయితము ఆత్మగుణములు కలవి యగునట్లు చెప్పియున్నది కదా! కేవలము భగవదనుగ్రహమువలననే అయోధ్యయందును, గోకులబృందావనమునందునుండుచరాచర పదార్థములుభగవద్గుణములవలననే ప్రాణములనుధరించియుండునట్టివిగాను, ముక్తియోగ్యములయినట్టివిగాను నైనవికదా!

అయితే భగవత్కటాక్షము మూలముఁ గలుగునట్టివాటికిగాను ఈచేతనునిపై నొకస్వాతంత్ర్యమునుంచి "ఈ పనిచేయుము-ఈ పనిచేయవద్దు" అని యిట్లు శాస్త్రములును, ఋషులును, ఆళ్వారులును, ఆచార్యులును, విధించుట యెట్లంటివేని, చెప్పెదను. సర్వేశ్వరుండు యెవ్వరి నయిన కొందఱిని యుజ్జీవిపఁజేయవలయునన్న, వారు తమను ఆత్మగుణములు కలవారినిగాఁజేసికొని యుండవలయును. అయితే సర్వేశ్వరుండు కంటికిఁ గానఁబడునట్లు యెదురుగ వచ్చినిలిచి నోరుతెరచి చెప్పఁడు. కావున, తాను ఉజ్జీవింపఁజేయఁదలంచిన వారు త్యాజ్యోపాదేయంబులనెఱుంగుటకుగాను, చెట్టుపాదు తీగను చెట్టుపాదు పందిలి కెక్కించుటకుగాను ప్రక్కన నొకమండను పాతునట్లు, సామాన్యశాస్త్రమును, తనను శీఘ్రముగ పొందు

టకుగాను విశేషశాస్త్రమునున్ను ప్రవర్తింపఁజేసి, జగత్తుయొక్క యుత్పత్తియును, స్థితియును, సంహారమును సంసారవిమోచనమున్ను వానికి క్రీడ యగుటంజేసి, ఒక మట్టి బొమ్మను చేసి దానిని కాకిబంగారముతో నలంకరించి పిల్లలు ఆడుకొనునట్లు, చతుర్ముఖ బ్రహ్మను సృజించి వానిలోనున్ను రుద్రునిలోనున్ను అంతర్యామియై వారిమూలముగ జగత్తుయొక్క సృష్టిసంహారంబులనున్ను, తానుస్వయముగ దానియొక్క రక్షణమునున్ను చేయుచుండునట్లు, సంసారవిమోచనమునకుఁగాను శ్రీనమ్మాళ్వారులను, శ్రీ తిరుమంగై యాళ్వారులను, శ్రీమన్నాథమునులను, శ్రీ యామునాచార్యులవారిని, శ్రీరామానుజులవారు మొదలగు వారిని యవతరింపఁజేసి, వారిమూలముగ విశేషశాస్త్రమును ప్రవర్తింపఁజేసి, ఈ చేతనులను తనతోఁ జేరునట్లు చేయఁదలంచి, యీ చేతనులను ఉజ్జీవింపఁజేయుటకుగాను ఏర్పాటుచేసినట్టి నియమములు గాన, కృపాపరతంత్రులై మోక్షార్హులయిన వారు ప్రమాణ పరతంత్రులై శాస్త్రములును శిష్టులున్ను సాధించిన యర్థములయందు నమ్మకము గలవారగుటకుగాను అంతరాత్మగానుండి ప్రేరింపఁగా నందుల కనుగుణముగ నడుచుకొనుటకు గాను యేర్పాటుచేసిన వారయిరి. ఇంతియే. పూర్వపు వాసన వలన మనస్సుచెడిన వారికి "ఉపదేశో నిరర్థకః = ఉపదేశము నిష్ప్రయోజనము" అన్నట్లు వీరి యుపదేశము నిరుపయోగము కాఁగలదు.

ఈ చేతనుండు ఉజ్జీవింపవలయుననెడి సర్వేశ్వరునికృప యెల్లప్పుడున్నను, ఈ చేతనులు పూర్వమొనర్చినట్టి పుణ్యా

పాపకర్మంబులను సంపూర్ణముగా ననుభవించి తద్వాసనా
మూలముగ నడచుకొను వారయినప్పుడు, వాని కటాక్షము
వారివైపుకు ప్రసరింపనందున, తనకవకాశము గలుగువరకును
అందులకై నిరీక్షించియుండి, యట్టి యవకాశము కలిగినతో
డనే, కొంతకాలముగడచిన పిమ్మట మోక్షార్హులగువారు సా
మాన్యశాస్త్రమునఁ జెప్పియున్నట్లు అనుష్ఠించుకొనుచు, సా
ధనాంతరపరులై పోవునట్లు కటాక్షించి, తత్క్షణమే భగవంతుని
చేరవలయుననెడి యిచ్ఛగలవారు విశేషశాస్త్రము ప్రకార
మనుష్ఠించుకొనునట్లు విశేషముగ కటాక్షింపఁగా, వీరు పర
మార్థులై ఆళ్వారులును, ఆచార్యులును, తామాచరించియు,
సాధించియునున్నట్టి యర్థంబులను బాగుగాఁ దెలిసికొని, ప్రతి
కూలములయిన వాటిని పూర్తిగాఁ ద్యజించి గుణానుభవ కైంక
ర్యనిష్ఠులును, అనన్యప్రయోజనులునై యుజ్జీవింతురు.

పైని చెప్పిన సాధనాంతర పరులన్ననో, "జన్మాంతరస
హస్రేషు తపోజ్ఞాన సమాధిభిః నరాణాం క్షీణపాపానాం కృష్ణే
భక్తిః ప్రజాయతే" (వెలకొలది జన్మములు గడువగా తపస్సు,
జ్ఞానము, సమాధి వీటిమూలముగ పాపములు నశించిన వారికి
శ్రీకృష్ణుని విషయమున భక్తికలుగును) అన్నట్లు అనేకజన్మము
లుగ తపోజ్ఞానాదులమూలముగ పాపము నశించిననేతప్ప, ఆత్మ
సాక్షాత్కారమును, సర్వదాభగవంతుని ధ్యానించుటయును,
వానిని ప్రేమించుటయును, అనన్య ప్రయోజనమును, వస్తుసా
క్షాత్కారమును లభింపనందున, చిరకాలముగ ధ్యానించు
చున్నట్టి యుపాసకునికి ఉపాసనాంగముగ ప్రపత్తిసయితముం
డుటంజేసి, యనాదికాలముగ సంపాదింపఁబడినట్టి పాపాధిక్య

మువలన విషయాంతరములయెడలఁగల దుర్వాసనవలన చెడ
పోయిన మనస్సుగలవానికి మనోనైర్మల్యముకలుగకపోయినచో,
దుఃఖపడి "నాయొక్క మనస్సునందుండు దోషమును నేనుపో
గొట్టుకొనజాలను అందులకై నీవే యుపాయమని" సర్వేశ్వరు
ని యపేక్షించి, క్రమముగ సిద్ధోపాయ నిష్ఠుడై, అప్పటికున్న
దుర్వాసన పైకివచ్చి ప్రయోజనాంతరపరుడై ఐహికభోగము
ల విషయమున మనస్సుచలించి, భార్యాపుత్రాదుల యందా
సక్తికలవాఁడై దుర్విషయముల ననుభవించు చుండినచో,
సిద్ధోపాయము వేఱొక్కయుపాయముతో చేరియుండుటను స
హింపనందున, సంభవించునట్టి యుపాయాపాయ సంయోగ
మువలన నట్టి నిష్ఠను పోగొట్టుకొనినాఁడని తెలిసికొని "ఉ
పాయాపాయసంయోగే నిష్ఠయా హీయతేనయా అపాయ
సంప్లవే సద్యః ప్రాయశ్చిత్తం సమాచరేత్" (ఉపాయాపా
యంబులు రెండును చేరినట్లయిన, ఈ నిష్ఠ చెడిపోవును అపా
యము పోవుటకై వెంటనే ప్రాయశ్చిత్తముఁ జేసికొనునది)
అన్నట్లు మరలప్రపత్తిచేయుటచే ప్రాయశ్చిత్తముఁ జేసికొనుచు,
భాగవతాపచారాదులు సంభవించినట్లయిన, చాలాకాల
ముగ రూపుమాసి పోయినవాఁడై తిరుగుచు, పశ్చాత్తా
పపడి యిట్లు చాలాకాలము సంచరించి, సిద్ధోపాయము ఫలించు
సమయము వచ్చినప్పుడు తిరుక్కణ్ణమంగై యాండాను వలెనే
స్వవ్యాపారమును బొత్తుగ విడనాడి, మిక్కుటమయినయాతురతగ
లవాఁడై, పిళ్లైతిరునరయూ రరయరువలెనే తనశరీరమునున్న
ఉపేక్షించి, క్రమక్రమముగ ముక్తుఁడగును.

...ని పేర్కొనిన విశేష కటాక్షపాత్రునికి యెక్కువ యాతురతగలిగి మొదటినుండియు "సోయ్ నిత్య ఞానం ప్రాల్లా వాప్రుక్కుమ ప్రుక్కుడంబు" (అన్యథాజ్ఞాన విపరీతజ్ఞానములును మలినమైన శరీరమును) అని సాయించినట్లు వీటి యన్నింటియెడలను వైరాగ్యము కలవాఁడై "కూవిక్కొళ్ళుం కాలమిన్నంకురుకాతో" (నన్ను గొనిపోయి కైంకర్యముఁ గొనునట్టి కాలమింకను రాలేదా) అనునట్లు కాలము నై నిరీక్షించుచుండుటం జేసి, యీ విషయము తెల్వియును ఈతని మనస్సునఁ బ్రవేశించుటకు వీలులేనందున, శరీరవిమోచనానంతరమున ఈతండు ముక్తుండు కాఁగలఁడు.

సిద్ధోపాయమును స్వీకరించియున్నను, ఇంకను ఆలస్యముండుటకు ప్రసక్తి కలదా? యంటివేని, తెలిపెదను స్వీకారమునకు ఈతండు అధికారియయినట్లయిన, సర్వేశ్వరుండు ఫలము నొసంగవలసినప్పుడు వేఱొక్కదాని సహాయము నపేక్షింపక వెంటనే ఫలము నొసంగును. ఇంతియె కాని, ఉపాయాధికారము నందిచేతనునికి కొరతయున్నట్లయిన, సంపూర్ణముగా అధికారి యగువరకు ఫలము నొసంగఁడు.

ఇట్టి యుపాయస్వీకారమనునది అన్ని ఫలములనున్ను ఇచ్చునట్టిది కాన, ప్రయోజనాంతరపరులకు ఐశ్వర్యార్థులకున్ను ఇది యున్నను, వారివారి మర్యాదానుగుణముగ స్వాత్మానుభవరూపములగు స్వల్పభోగముల నొసంగునది యగుచున్నది. కావున ఈ చేతనుండు తనకోరికలను సాంసారికదుష్కర్మముల నుండి మరలించి, అనన్యప్రయోజనుండయినట్లయిన, వెంటనే ఫలము నొసంగ గలదు. అనన్యప్రయోజనుండనఁగా భార్యా

పుత్రాది సంబంధము మొదలుకొని, బ్రహ్మాద్యైశ్వర్యము, స్వాత్మానుభవరూపమగు కైవల్యము మొదలగు వాటినన్నింటిని వదలుకొని సర్వేశ్వరు నొక్కనినే ప్రయోజనమునుగా నపేక్షించియుండు వాఁడు కదా ? కావున భార్యాపుత్రాది సంబంధమున్ను, క్షుద్రవిషయానుభవమున్ను ప్రయోజనాంతరముగ టంజేసి, సిద్ధోపాయమును స్వీకరించినాననుకొనినంత మాత్రమున ప్రయోజనాంతరపరునికి భగవంతుని పొందుటకు యోగ్యతలేదు కదా! ఈ విషయము "భోగా ఇమే విధిశివాది పదంచ కించస్వాత్మానుభూతిరితియాకిల ముక్తిరుక్తా సర్వంతదూషజలజోషమహంజుషే.యం హస్త్యద్రినాథ తవదాస్యమహారసజ్ఞః" (బ్రహ్మలోకము కైలాసము ఆత్మానుభవము ఇవ్విధమునఁ జెప్పఁబడినట్టి ముక్తియనునది నీకు దాస్యము నొనర్చుటయందు రసము నెఱింగినట్టి నాకు తుచ్ఛము) అనియు, "తృణీకృతవిరించ్యాది నిరంకుశవిభూతయః రామానుజపదాంభోజసమాశ్రయణశాలినః" (శ్రీరామానుజులవారి శ్రీపాదముల నాశ్రయించినవారు బ్రహ్మలోకాదులను తృణీకరించినవారు ) అనియు పితాన్రులఁ జెప్పఁబడినది కదా!

ఇవ్విధమున నుండవలసియుండఁగా, హేయంబులగు క్షుద్రవిషయములయందు ప్రీతిగలవారై భార్యాపుత్రాదులను విడవకుండువారు, తమకులభింపనందున మన కిక్కఁ అలేదనుకొనియుండు రేతప్ప, లభించినట్లయిన, ఈలోకమునందున్నట్టివాటికంటెనున్న విలక్షణంబులగు భోగంబులను విడిచిపెట్టుదురా? కావున విషయాంతరములయందాశగలవారికి ఉపాయోపాయాధికారంబులతో రెంటితోను సంబంధము లేదు.

ఉపాయాధికారస్వరూపమును సారార్థచతుష్టయమను గ్రంథమున అమ్మంగియమ్మాళ్ళనువారు విపరీతార్థము లెంతమాత్రము తోచకుండునట్లు విశదముగాఁ దెలిపియున్నారు కదా!

అదియెట్లనిన, ఉపాయజ్ఞానమనియు, ఉపాయ యాథాత్మ్యజ్ఞానమనియును రెండువిధములు. వాటిలో ఉపాయజ్ఞానమనునది సంబంధజ్ఞానమనియు, సంబంధయాథాత్మ్య జ్ఞానమనియు, సంబంధస్వరూపజ్ఞానమనియు, సంబంధస్వరూప యాథాత్మ్యజ్ఞానమనియును నాల్గువిధములు. వీటిలో సంబంధజ్ఞానమనఁగా—సర్వేశ్వరుని శేషిత్వమునున్ను తనయొక్క శేషత్వమునున్ను తెలిసికొని ఇష్టమువచ్చినట్లు భగవంతుండు ఉపయోగపఱచుకొనుటకుఁ దగినట్టివాఁడై యుండుట. సంబంధయాథాత్మ్యజ్ఞానమనఁగా — శేషభూతులగు దారాపుత్రాదులవలెనే వేఱుగా నుండువాడనుకొనక, తనకున్ను వానికిన్నిగల శరీరాత్మసంబంధమును బాగుగా నెఱిఁగియుండుట. సంబంధస్వరూపజ్ఞానమనఁగా—శరీరి శరీరములవలెనే భిన్నవస్తువులుగా నుండునప్పుడు, భేదమున్నట్లు తోచనట్లుండక, వాఁడు ధర్మియనియు తాను ధర్మమనియును తెలిసికొని యుండుట. సంబంధస్వరూపయాథాత్మ్యజ్ఞానమనఁగా — ధర్మిధర్మముల ఐక్యమును బాగుగాఁ దెలిసికొనియుండుట. అనఁగా విశిష్టస్వరూపమున వాఁడే యున్నట్లు తోఁచి, తాను లేనివాఁడుగాఁ దోఁచుట. ఈ నాలుగును ఉపాయజ్ఞానములు. ఉపాయయాథాత్మ్యజ్ఞానమనఁగా—వాటియందు దీతనకిఁగల నిష్ఠ. అది యెద్దియనఁగా— శేషత్వమున కర్తృత్వము లేకపోవుటయు, జ్ఞాతృత్వమున కర్తృత్వము లేకపోవుటయు, కర్తృత్వమున

కర్తృత్వము లేకపోవుటయు, భోక్తృత్వమున కర్తృత్వము లేకపోవుటయును. వీటిలో శేషత్వమున కర్తృత్వమనఁగా రాజసన్నిధిని వదలి ప్రజలను పీడించునట్టి మంత్రులవలెనే, భగవత్సన్నిధిని వదలి సదాచారమును త్యజించుట. అదియెట్లనఁగా, మేము భగవంతునికి శేషభూతులము కామా? మాకు భయమేమని శబ్దాదివిషయములయెడల ప్రీతిగలవారై, బొత్తుగ భయములేనివారై ప్రవర్తించుటయు, భగవద్భాగవత కైంకర్యవిషయమున ఆశలేనివారైయుండుటయును. అదిలేని వారుగానుండుటయనఁగా — ప్రామాదికగానైనను, సంభవించినట్టి విషయాంతరాసక్తినుండి భయపడుటయు, ప్రామాదికముగ కైంకర్యమును పోగొట్టుకొనినట్లయిన, ఎక్కువ యాతురత గలవారగుటయును. జ్ఞాతృత్వవిషయమున కర్తృత్వమనఁగా — నేను జ్ఞానవంతుండను కాఁబట్టి కదా! నన్ను అంగీకరించినాఁడనుకొని తనయొక్క జ్ఞాతృత్వవిషయమున సహంకారపడుట. అది లేకపోవుటయనఁగా — దేహాత్మాభిమానులకంటెనున్న తక్కువవాఁడనై, అచిత్తువలెనుండువాఁడనై, బొత్తుగ యేమిన్ని తెలియనట్టి నన్ను, ఇనుమును బంగారుగాఁ జేయునట్టి వారివలెనే, అజ్ఞానమును పోగొట్టి జ్ఞానమునిచ్చినవాఁడని తలంచియుండుట. కర్తృత్వమున కర్తృత్వమనఁగా — నేను శాస్త్రనిషిద్ధంబులయినవాటిని వదలి, శాస్త్రసిద్ధములయిన వాటి ననుష్ఠించుటం జేసి కదా! నన్ను అంగీకరించినాఁడనుకొని, తన ప్రవృత్తి నివృత్తులవిషమున సహంకారపడుట. అది లేకుండుటయనఁగా — మనము చేసినది యేమిన్ని లేదు. తోలుబొమ్మలవాఁడు బొమ్మలనాడించునట్లు, తానే నాచే నిషిద్ధంబు

లను త్యజింపఁజేసి, శాస్త్రసిద్ధములైనవాటిని చేయించి నాడని తలంచి యుండుట. అది లేకపోవుటయనఁగా, తన చేతితో తన తలవెండ్రుకలను చిక్కుతీసికొనినట్లయిన తన చెయ్యి తన కుపకారిమొనర్చినదని తలంపనట్లు, అవయవభూతుఁడగు ఆత్మ అవయవియగు సర్వేశ్వరునికి చేయుచున్నది యని తలంచియుండుట" అని సాయించినారు.

కావున శేషభూతుండైనవాఁడు విషయప్రవణుండు కానివాఁడై యుండవలయును. తాను జ్ఞానవంతుడని గర్వపడి నశించి పోకూడదు అయితే "నేను జ్ఞానహీనుండను ఇది సర్వేశ్వరుం డిచ్చిన జ్ఞానమే" అని తలంచియుండవలయును. తాను నిషిద్ధములను పరిత్యజించి శాస్త్రసిద్ధములైన వాటి ననుష్ఠించుటయును, కాయ్యబాహ్యవశైనే తాను పరతంత్రుండుగానుండగా, సర్వేశ్వరుండిట్టి త్యాగస్వీకారములను గలుగఁజేసినాడని తలంచియుండునది తాను సర్వవిధ కైంకర్యంబులఁ జేసియుండినదియును వానివలననే యని తలంచియుండునది. ఇట్లు అనన్యాంగియనుమ్మాళ్ సాయించినారు. ఇవియే యుపాయాధికారి కుండవలసిన లక్షణములు.

వాస్తవస్థితి ఇట్లుండఁగా, ఈచేతనునికిన్ని సర్వేశ్వరునికిన్ని గల శరీరాత్మభావమునున్ను అవయవావయవి రూపమగు ఐక్యమునున్ను తెలిసియున్నవారు ఈచేతనుండు నిషిద్ధంబుల నాచరించినను, అది సర్వేశ్వరుని దేయై యుండవలయునని యజ్ఞానమూలముగాఁ జెప్పుదురు కాని, అట్లు చెప్పకూడదు. శరీరాత్మభావమును చెప్పినది యెందులకనఁగా—దాని లక్షణములగు ఆధేయత్వ, విధేయత్వ, శేషత్వములు తనయొ

క్క స్వరూపమని తెలుపుటకుగానును, అవయవావయవిభావ మున నైక్యముఁ జెప్పినదియొందులకనఁగా— తా చేయునట్టి కైంకర్యమువిషయమున, "నేను కర్తను భోగమునాది" యనెడి యహంకార మమకారములు పైబడకుండునట్లు, కర్తృత్వ భోక్తృత్వరహితమగు పారతంత్ర్యము ననుసంధించుకొనువాఁడై యుండవలయునను తలంపుతోఁ జెప్పినది మాత్రమే. కావున దుర్వాసనామూలముగ విషయాసక్తికలవాఁడై తానుచేయునవి యన్నియునుసర్వేశ్వరునివే యనుకొనుట వినాశహేతువగును. అది యెట్లువలెననిన, నహుషచక్రవర్తియును, బలిచక్రవర్తియును, యయాతిమహారాజున్ను క్రమముగ యజ్ఞ,దాన, తపస్సుల నొనర్చి 'మేము కదా! యొనర్చినామని యహంకారపడినందున క్షణకాలములోనే అవియన్నియును వ్యర్థములై పోయి, అధోగతు లయినట్లు వినియున్నాము కదా! చిత్రకేతువనురాజు చిరకాలము రాజ్యముచేసి, పిమ్మట విరక్తుండై భగవంతుని యుపాసించి, యట్టి యుపాసనబలము వలన, దివ్యవిమానము నెక్కి ఊర్ధ్వలోకంబులయందంతటను సంచరించుచు, ఒకానొకదినమున కైలాసమార్గమునఁ బోవునప్పుడు, అచ్చట పార్వతీదేవితోఁగూడియుండి ప్రమథగణములసంబడు పరిచారికులతోఁ గూడియున్నట్టి గుక్రునిఁగని తాను విరక్తుండ ననెడి యహంకారమువలన "సిగ్గులేక భార్యతోఁగూడియున్నావే!" అని పరిహసింపఁగా, పార్వతీదేవి యొక్క శాపమువలన ఆ యుపాసనయంతయును నిష్ఫలమై పోయి, రాక్షసుండుగా జన్మించెనని వినియున్నాము కదా! కావున తామొనర్చునట్టి సత్కర్మముల విషయమున, మేము

కదా చేసినామని తలంచి యున్నట్లయిన, అవి నశించిపోవుట మాత్రమే కాకుండ, మీదిమిక్కిలి యనర్థంబులున్ను సమకూడు నుగాన, ప్రపన్నుండైనవాఁడు తనకుఁ గలజ్ఞాన, వ్యవసాయ, ప్రేమ, సమాచారంబులు భగవంతునివలనఁగలిగినవియని తలంచుకొని, కర్మమూలముగ సంభవించునట్టి నిషిద్ధానుష్ఠానంబులన్నింటిని గుఱించి ‹‹ యానేయెన్నై యరియకిలాదేయానే యెన్నదే యెన్ఱిరుందేన్'' (నాస్వరూపము తెలియక నేను నాది యనెడి తలంపుతోనుంటిని) అని యనుసంధించుకొనునది ఇట్లు అను సంధించుకొనువాఁడయినట్లయిన, స్వరూపము ఉజ్జీవించును.

‹‹ యోయోజల్పః సతుజపః యద్ధ్యానం తన్నిరీక్షణం'' (దేని ని చెప్పునో అదియే జపము దేనిని తలంచునో, అదియే భగ వన్నిరీక్షణము) అను తాత్పర్య సహితంబు చేయునట్టివి యన్నియు ను సర్వేశ్వరునికి గానే యని చెప్పియున్న దంటివేని, చెప్పె దను. మొట్టమొదట ‹‹నారాయణైకనిష్ఠస్య'' (నారాయణుని నే ధ్యానించువాఁడు) అనుటచే మొదటిపాదమున నధికారిని జూపించినారు కదా! భగవద్వ్యతిరిక్తములు సమస్తమునున్ను పరిత్యజించి అంతయును సర్వేశ్వరుండే యనుకొని యనుభ వించునట్టి శ్రీనమ్మాళ్వారులవంటివారు కదా నారాయణైక నిష్ఠులయినట్టివారు. అటువంటి యధికారులు నిషిద్ధంబుల నా చరించునట్టివారు కారు కదా?

ఇఁక, ‹‹అఝువన్ తొఝువన్ నాడికాణ్పన్ పాడియలత్తు ఎన్ తఝువల్ వినైయాల్ పక్కనోక్కి నాణిక్కవిఝ్న్దిరుప్పన్'' (పడిచెదను, నమస్కరించెదను, నర్తనముచేసి చూచెదను, గానముచేసి అరచెదను, కౌగలించుకొనియున్న క్రూరమైన

భక్తియనెడి పాపమువలన శ్రియఃపతి వచ్చుచున్నాఁడా యని
నాలుగుప్రక్కలనుచూచి రాకుండుటచే స్రుక్కిపడి తలవంచు
కొనుచుండు) అన్నట్లు శ్రీనమ్మాళ్వారులు వారు పడినపాటున్న
యును సర్వేశ్వరునికిగా నయినందున,నవి యన్నియును వాని
కొక యతిశయముఁగలుగఁ జేయునట్టివియై యిష్టైకకర్తవ్యము
వలెనే వానికి సంతోషమును గలుగఁజేయునవియగునని చెప్పి
యున్నారేకాని, "శబ్దాదిభోగనిరతశ్శరణాగతాఖ్యః" శబ్దాది
భోగముల విషయమునఁబ్రీతిగలవాఁడు అయితే శరణాగతుం
డని పిలువబడువాఁడు" అన్నట్లు దుర్విషయములయందు ప్రీతి
గలవారైనను,శరణాగతులమై, యితరులకు కష్టములఁ గలుగఁ
జేయునట్టి మనబోటివారు చేయునట్టి -పరహింసాపరదారా
సంగమాదులును భగవత్కైంకర్య మనినవిధమున, చిత్ర
వధకారు లగుదురు కదా?

అయితే అజామిళుఁడు మొదలగువారు, దుర్మార్గప్రవర్తన
గలవారేయైనను, పుత్రభ్రాంతివలన స్వనామోచ్చారణముఁ
జేసినదానిఁగొని భగవంతుం డనుగ్రహించినాఁడే! అది యెట్టం
టివేని, తెలిపెదను వానిని యమభటులు కొనిపోకుండ, అడ్డ
గించి విడిపింపఁగా, నంతట యతండు విస్మయపడి భగవం
తుని ప్రభావముఁ దెలిసికొని, ఇతరవిషయ వైరాగ్యముగలిగి,
పరమాత్మవిషయమునఁ బ్రీతికలవాఁడై, ముక్తుండైనాఁడని చె
ప్పియున్నది కదా!

ఏల మీరిట్లు చెప్పెదరు? శ్రీనమ్మాళ్వారులు మొదలుకొ
ని యందఱును భగవంతుని సౌలభ్యమునుకొనియాడుచుండ,
భగవద్విషయము దుర్లభమని చెప్పవచ్చునా? యెట్టివేని,వాని

కి సౌలభ్యాదిగుణములు లేవని మేము చెప్పియుండలేము. వాఁడు తన స్వరూపమునుబట్టి "రిపూణామపి వత్సలః" (శత్రువులయెడ లనున్న దయగలవాఁడు) అన్నట్లు సులభుండైయే యున్నను, ఈ చేతనుండు తన స్వరూపమునకు అనుగుణముగ ప్రవర్తింప వలయును కదా! సర్వేశ్వరుండు పిరాట్టివిషయమున అపచార పడిన కాకాసురుని రక్షించినాఁడని తలఁచి, ఈతండును అట్టి మహాత్మద్రోహమును చేయవలయునా? "ప్రపన్నశ్చాతకోయ ద్వ్యాప్త్రిప స్తవ్యః కపోతవత్" * ప్రపన్నుని చాతకపక్షివలెను కపోతపక్షివలెను గ్రహింపవలెను' అన్నట్లు యీతండుతన స్వరూపమును చెడగొట్టుకొనకుండయున్నట్లు యుసర్వేశ్వరుని ప్రతీక్షించుచుండును. "ఇంతియె ఏదోక కాలమున, సర్వేశ్వరుం డెవ్వరినో యొక్కరిని తనయొక్క నిరంకుశస్వాతంత్ర్యమువలన రక్షించినాఁడని యెల్లను అట్లే ప్రవర్తించినట్లయిన- అనర్థము కలుగును కదా!

"నభీతేతికుతశ్చన పతంహావావ నకపతి కిమహంసాధునాకరవం కిమహం పాపమకరవం" అనుతావున బుద్ధిపూర్వకముగ నొనర్చినట్టి పాపమునకు భయపడవలసినదిలేదని చెప్పియున్న దేల యంటివేని, "ఆనందం బ్రహ్మణో విద్వాన్" అనుతావునఁ జెప్పియున్నట్టి యానందగుణముగల పరబ్రహ్మమును ధ్యానిం

* చాతకపక్షి వేఱొక్క జలమును త్రాగక, మేఘోదకమునకైయే నిరీక్షించుచున్నట్లు, ప్రపన్నుండును వేఱొక్కదానిని నాశ్రయింపక భగవంతునకైయే నిరీక్షించుచుండువాఁడు. కపోతము తన తోటికపోతమును విడిచి యుండజాలనట్లు. ప్రపన్నుండును భగవద్విశ్లేషమును సహించి యుండజాలని వాఁడు.

చినందున నేకష్టమునుండియును భయపడవలసినదిలేదని యీ
పై వాక్యమున కర్థము. ఇట్లు ఆనందవల్లియందుఁ జెప్పఁబడ్డ
నిరతిశయానంద విశిష్టుండగు పరబ్రహ్మము నుపాసించినందు
వలన నట్టి యుపాసకుని సర్వకష్టములును తొలగిపోవునని చె
ప్పియున్నదే కాని, ప్రపన్నుండయినవాఁడు బుద్ధిపూర్వకముగ
నిషిద్ధంబుల నాచరించుచు భయపడవలదని చెప్పియుండలేదు
కదా! అయితే ఉపాసకుండు "శాంతో దాంత ఉపరత స్తితిక్షు స్స
మాహితో భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యేత్" అనుతావునఁ
జెప్పియున్నట్లు మొదటినుండియును జితేంద్రియుండై భగవం
తుని ధ్యానించునట్టి యధికారి కావున, నతండు ఇఁకమీఁద
నున్న పాపముఁ జేయఁడు కదా!

అయితే జితేంద్రియత్వము ఉపాసకునికే తప్ప, ప్రపన్నునికుం
డవలసిన నిర్బంధము లేదే? యంటివేని, ఈతఁడు భగవంతునే
యుపాయముగాఁ గొనినందున, నట్టి యుపాయము కది కావల
సినది కాకున్నను, ఉపేయాధికారము కది యవశ్యముగ కావ
లసియున్నది. కావుననే "వలముదల్ కెడుక్క— వరమేశంద
రుళ్ కండాయ్" (పంచేంద్రియములు పాడైపోవునట్లు కటా
క్షించినావు) అని సమ్వ్యాఖ్యాతలు వ్రాయించియున్నారు.

అయితే "అపిపాపేష్వభిరతాః మద్భక్తాః పాండునందన!
ముచ్యంతే పాతకైస్సర్వైః పద్మపత్రమివాంభసా" (ఓ పాండు
నందనా! నాభక్తులు పాపాత్ములైనను, తామరాకును నీరం
టని చందంబున; పాపంబులు వారినంటవు) అన్నట్లును, "యే
నృశంసా దురాత్మానః పాపాచారరతాస్తథా। తేపియాన్తి పరం
ధామ నరా నారాయణాశ్రయాః" (పాపిష్ఠులయినను, దురాత్మ

ష్ఠులయినను, దురాచారపరులయినను, నారాయణుని యాశ్ర
యించినవారలు పరమపదమును బొందుదురు) అన్నట్లు
తనను ఆశ్రయించినవారు మహాపాపులయినను, ముక్తులగుదు
రని సర్వేశ్వరుండే స్వయముగ చెప్పియుండఁగా, మీరేల యిట్లు
భయపడ్డుచుండెదరంటిరేని, మహాపాపిష్ఠుండయినను, తనను ఆశ్ర
యించినట్లయిన, "క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వత్ శాంతిం
నిగచ్ఛతి" అన్నట్లు తనయొక్క యనుగ్రహమువలన, శీఘ్ర
ముగానే ధర్మాత్ముండును శాంతిచిత్తుండునై ముక్తుండగునని
చెప్పియున్నదే తప్ప, బ్రతికియున్నంతవరకును అన్నో యాచ
రించినను, ముక్తుండగుననుట యర్థము కాదు. అయితే ఇదే
యర్థమని మీకు తోఁచి, మీకు చెడ్డదారిని పోవుటకిచ్ఛ
యున్నట్లయిన, నన్నడుగ నక్కఱలేదు మీకు వైష్ణవత్వ
మున్ను అక్కఱ లేదు. ఆచార్యాభిమానమున్ను అక్కఱ
లేదు ఆళ్వారాచార్యుల వచనానుష్ఠానంబులున్ను అక్కఱ
లేదు. ఈ సిద్ధాంతము నవలంబించి దీనివైలక్షణ్యము చెడిపోవు
నట్లు, విపరీతార్థములను శంకింపక, దూరముగానుండి అజా
మిళ ఘంటాకర్ణాదులను రక్షించినట్టివాఁడు మనను
రక్షింపడా యనుకొని, బ్రహ్మహత్యాదులను వేశ్యాగమ
నాదులనున్ను చేయుచు, పాపిష్ఠులును, దురాత్ములును, దురా
చారపరులును యథేచ్ఛగ సంచరించుచు, సుఖముగానుంటి
రేని, సమయము వచ్చినప్పుడు సర్వేశ్వరుండు వానియిష్టము
వచ్చినట్లు వినియోగపఱచుకొనును. తన నిరంకుశ స్వాతం
త్ర్యమువలన ముక్తులనుగాఁ జేయవలయునని తలంచిన యెడల

అనుగ్రహ చేయగలడు ॥శక్తోహమి సక్షమోహమి" అన్నట్లు నిగ్ర
హించినను, నిగ్రహింప గలడు.

సర్వేశ్వరుండు తనయొక్క నిరంకుశ స్వాతంత్ర్యము
వలన ముక్తులనుగాఁ జేయునప్పుడు దేవతాంతర పరులనియు,
విషయాంతర పరులనియు, బ్రహ్మహత్యాది పాపశీలురనియు,
భాగవతాపచార పరులనియును తలంపకయే, తనను బొందు
నట్లు చేయునట్టి స్వభావముగలవాడయిన నిమ్మట, మనకు దేవ
తాంతరస్పర్శము కూడదనియు, సాధనాంతర సంబంధము
కూడదనియు, భాగవతాపచారము కూడదనియు, సంసా
రులతో సహవాసము చేయకూడదనియు నిట్లు కొన్ని
నియమంబులను చెప్పుకొనుచు, దేహముంతో ఆత్మ యంత
యని వాదించునట్టి వేదబాహ్యులు హింసావిధురత్వ, దిగం
బరత్వ, పాణిపాత్రభోజన, కేశోల్లుంఛనాది నియమంబులను
చెప్పుకొనుచు తిరుగునట్లు, మీరున్ను కొన్ని నియమములను
చెప్పుకొనుచు తిరుగకుండ, అన్నింటిని వదలి మీ యిష్టమువచ్చి
నట్లు సంచరించుచు సుఖముగా నుండుఁడీ.

కోసలదేశమునను, గోకుల బృందావనములనుండు
స్థావరజంగమ పదార్థములకున్ను, విదురుండు, మాలాకా
రుండు, దధిభాండుండు మొదలగువారికిన్ని పంచసంస్కారం
బులనున్ను ఆచార్యాభిమానమునున్ను గలుగఁ జేసి, వారిని
కటాక్షింప లేదా? అట్లే సర్వేశ్వరుండు సులభుండుగానున్నను,
పూర్వాచార్యులు వాఁడిచ్చునట్టి మోక్షము నపేక్షింపక,
వానిని సంతోషపెట్టుటయందే యపేక్షగలవారై, స్వరూపము
ప్రకాశించునట్లు, ॥ఏమాత్రపీట్టుత్తిరముమ్ శెప్పుమ్" [సర్వవిధముల

సేత్రను విలక్షణమైన స్వర్గమోక్షముయొక్క విధమునైనను చెప్పము)
అనియు ‹‹ శిరప్పిల్ వీడు శువర్క్క నరకం ఇరప్పిలుమ్ తుకవెయ్
దర్క్క ''(మిక్కిలి మహిమగల మోక్షము, నరకము వీటినిమర
ణదశయందు పొందినను సరే, పొందకపోయినను సరే), ‹‹తన
క్కేయాక వెనక్కొళ్ళవేణుమ్ '' (తనకే శేషభూతునిగా
నన్ను అంగీకరించుటనే నేను అపేక్షించునది) అనియును
చెప్పియున్నట్లు నిత్యవిభూతి లీలావిభూతుల రెంటియెడలను విరక్తు
లని చెప్పఁదగినట్లు, అన్నింటివిషయమునను విరక్తులయి, భగవ
దనుభవమునందు మాత్రమే లగ్నమైన మనస్సుకలవారై,
మంచి జ్ఞానానుష్ఠానములుకలవారై, ‹‹ప్రియోహిజ్ఞానినోత్యర్థమ్
అహంసచ మమప్రియః'' అనియు, ‹‹తేపెయద్విరహాసుదు
స్సహః'' అనియును చెప్పియున్నట్లు, సర్వేశ్వరునికి మిక్కిలి
యిష్టులైరి. వీరుపోయినదారి మీకిష్టమయినట్లయిన, వీరు చూ
పించిన దారినిపోయి కృతార్థులు కాండి.

మేము ఆచార్యాభిమాననిష్ఠులు పోయిన దారిని పోవువా
రమని చెప్పుకొనుచు, పూర్వాచార్యుల శ్రీసూక్తులయందును
అనుష్ఠానములయందును నిషిద్ధానుష్ఠానంబు లెవ్వియును చేయ
యుండెనందున వాటిని వదలి, సర్వేశ్వరుని యతిమానుష
వ్యాపారములనున్ను వాటిని స్తుతిచేయునట్టి వాక్యములనున్ను
చెప్పుకొనుచు, వాటికన్ని కొన్ని విపరీతార్థములను కల్పించు
కొనుచు, దాని యభిప్రాయమేమి? దీని తాత్పర్యమేమి? దాని
కాధారమేమి? అని వాదించుచు, ప్రతికూలంబులయిన వాటిని విడ
నాడక, అభిప్రాయభేదమును బట్టి యవియున్ను సరిపోవుననుచు
నిషిద్ధానుష్ఠానంబుల విషయమున ప్రీతిగలవారై ప్రవర్తింపక,

మేదైన నొకపద్ధతిప్రకారము నడచుకొనవలయునని ప్రార్థిం
పఁగా, తిరిగి దండము సమర్పించి «నాయందు అజ్ఞుఁడయి
నందునను దేవరవారు తల్లివలెనే వాత్సల్యము కలవారయినం
దునను, మనస్సు నొప్పించుకొనక, దాసుఁడను మనస్సునఁ దోఁచి
నట్లు విన్నవించుకొనిన వాటికన్నిఁటికిని కృపతోఁ జూచి
సమాధానములఁ జెప్పవలయునని శ్రీపాదములపైఁబడి ప్రార్థిం
పఁగా, నంతట అప్పాగారు సంతోషించి అట్లెచెప్పెదను అడుగు
మనిరి.

«దోషబుద్ధ్యా భయాద్ధేతోః నిషిద్ధాన్న నివర్తతే,
గుణబుద్ధ్యాతు విహితం నకరోతి యథార్భకః» (జ్ఞానాధి
కుండు బాలునివలెనే దోషమనెడి భయమువలన నిషిద్ధము
లను విడనాడఁడు, మంచివనితలంచి విహితంబుల నాచరింపఁడు)
అనుటవలన జ్ఞానాధికుండు విధినిషేధంబులకు వశ్యుండు గా
కుండ, బాలునివలెనే తిరుగుచుండునని చెప్పియున్నదికదా!
యని యడుగఁగా, జ్ఞానముకలిగి పుణ్య, పాప, శత్రు, మిత్ర,
మాన, అవమాన, సుఖ, దుఃఖ, స్తుతి, నిందలను గమనింపక,
రెండువిధములగు వ్యాపారములనున్న (విధినిషేధములను) అతి
క్రమించి అద్వితీయ బ్రహ్మానుభవానంద మకరందానుభవ
ము తృప్తులై ప్రొద్దుతెలియక, మనోబుద్ధులు రెండునుభగ
వదధీనంబులై, బుద్ధిపూర్వకముగా నొక్కదానినిన్ని చేయక
బాలులవలెను, పిచ్చివాండ్రవలెను, పిశాచము పట్టినవారివలె
నున్న తిరుగుచుందురని చెప్పియున్నది. ఇంతియెకాని, దారా
పుత్రాదులయెడల ప్రీతికలవారై వారిని రక్షించుటకుగాను
గొప్పవారి వాకిట కాచుకొని పడియుండి, ద్రవ్యార్జన తత్ప

గున్డే అహంకారార్థ కామపరవశుఁడగుటంజేసి, విధినిషేధ
వశ్యుండు కానివాఁడై తిరుగుచుండునని చెప్పియుండలేదే?
ఇంతియే కాక, బాలుని దృష్టాంతముగాఁగొని యున్నందున,
బుద్ధిపూర్వకముగా నొక్క దానియందును ప్రవర్తించుటలేదని
స్పష్టమగుచున్నది కదా! మనోబుద్ధులను రెంటినిన్ని ॥మయ్యేవ
మన ఆధాయ మయి బుద్ధింనివేశయ'' అన్నట్లు భగవంతుని
విషయమునసుంచి భక్తిపరవశుండయినవాఁడు బ్రహ్మమువలె
యేదుష్కార్యంబుల నొనర్చినను, కొరతలేకని సర్వేశ్వరుండే
స్వయముగా ॥యస్యనాహంకృతోభావో బుద్ధిర్యస్యనలిప్యతే।
హత్వాపి స ఇమాఁల్లోకాన్ నహంతి న నిబధ్యతే'' అను
తావునఁ జెప్పియున్నాఁడు కదా!

అయితే యిట్లు సర్వేశ్వరుండే చెప్పియుండఁగా, ॥సర్వ
తంత్రుండగువానిని (సర్వేశ్వరుని) ఉపాయంబుగాఁగొనినచో
కదా భయప్రసక్తిగలుగును ఆచార్యాభిమాన నిష్ఠుండయినట్ల
యిన, తనవ్యాపారంబులఁగని భయపడనక్కఱలేదు'' అని శ్రీవచ
నభూషణమునం దేల చెప్పియున్నారంటివేని, యిందులకుసమా
ధానమును ముందే చెప్పియున్నాము ఆచార్యాభిమాననిష్ఠుండు
భయపడ నక్కఱలేదనఁగా, ఈతండు చెడ్డదారిని పోకుండు
నట్లు ఆచార్యుండు త్యాజ్యోపాదేయంబులను రెంటిని బాగుగాఁ
దెలిపి, అందులకనుగుణముగ నడచుకొనునట్లు చేసి, కాపాడి, సర్వే
శ్వరుండీతనిని తనలీలలో వినియోగపరచుకొనుటకవకాశములే
కుండునట్లు పరిశుద్ధునిగాఁ జేసి, సర్వేశ్వరునితోఁ జేర్చివేయునని
చెప్పియున్నందున, నిశ్చయే దానికర్థమని యెఱుంగునది. ఇట్లు
అర్థముచేసికొనక, దుర్నడవడిక కలవాఁడయినను కొరతలేద

నుకొనినట్టియున, శ్రీవచనభూషణమునందే ఆచార్యాభిమాన నిష్ఠను ఉపపాదించు సందర్భమున, ఆచార్యుని సంతోషింపఁ జేయుటకై జ్ఞానానుష్ఠానంబు లుండవలయుననియు, ఈతనికి నిషిద్ధానుష్ఠానము కూడదనియును చెప్పుటకు కారణము లేకు కదా!

ఈ యాచార్యాభిమాన మనునది ప్రాతిమాల్యము తెలియుటలేనట్టివియగు తిర్యగ్జంతువుల విషయమునను, స్థావరపదార్థముల విషయమునను ఉపయోగపడగలదు. ఇంతియె కాని, చేతనునికి జ్ఞానానుష్ఠానంబులు లేకపోయినప్పటికిన్ని, అహంకార, మమకార, విషయప్రావణ్య, పరహింసా, పరస్తోత్ర, పరదార పరిగ్రహ, అభక్ష్యభక్షణ, అపేయపాన, దేవతాంతర, సాధనాంతర, ప్రయోజనాంతర, భగవదపచార, భాగవతాపచారాది విరోధులు లేకుండిననేతప్ప, ఈతనివిషయమున ఉపయోగపడదు.

స్వాతంత్ర్యుండగు సర్వేశ్వరుని ఉపాయముగాఁ గొనుటవలన భయప్రసక్తిగలుగకుండ, శ్రీ నమ్మాళ్వారుల నాశ్రయించి, వారి శ్రీపాదములనే మోక్షోపాయముగాఁ గొనినట్టి శ్రీమధురకవియాళ్వారులు తమకు నమ్మాళ్వారులతో సంబంధముకలదు గదా! యనుకొని, నిషిద్ధంబుల నాచరించుచు, మనకింక భయమేమనుకొని ప్రవర్తించినవారుకారు కదా! మరియు „శెయల్ నన్ఱాక తిరుత్తి పణికొళ్వాన్" (నాచేష్టితంబులను బాగుగా దిద్దుపాటుచేసి, నావలన కైంకర్యమును అంగీకరించినారు) అను తావున మను జ్ఞానానుష్ఠానపరులనుగా వారుదిద్దుపాటుచేసిన విధమును, „ అన్బనాయ్ అడియేన్ శదిత్తేనిన్ఱే" (శేషభూ

తుండై ఇట్లు శేషభూతుండైయున యీ దినమునసే సమ
స్థుండనయినాను) అనుతావున తామున్ను తమయాచార్యుని
విషయమున నెక్కువప్రతీతికలవారై వారినితప్ప తక్కినవాటి
నన్నింటిని పరిత్యజించినందున సమర్థులయిన విధమునున్ను
తెలిపియున్నారు కదా!

"సంసారావర్తవేగప్రశమనశుభదృగ్దేశికప్రేక్షితో
హంసంత్యక్తోన్యరుపాయై రనుచితచరితే ష్వద్యశాంతాభి
సంధిః నిశ్శంకస్తత్వదృష్ట్యానిరవధికదయం ప్రాప్యసంరక్షకం
త్వాం న్యస్యత్వత్పాదపద్మే వరదనిజభరం నిర్భరోనిర్భయో
స్మి" అనుతావున, తామున్ను సంసారులై తమనుఆశ్రయించి
నట్టి యీతనిన్ని సంసారినిగాఁజేసి, భయముచెడగొట్టి,
పోటివడపమీద నెక్కి ప్రయాణముచేయువారు ప్రవాహమున
మునిగిపోవునట్లు కాకుండ, వైరాగ్యవంతుండై తానుగట్టె
క్కి, యీతనినిన్ని వైరాగ్యవంతునిగాఁజేసి, గట్టెక్కింప సమ
ర్థుండగు సదాచార్యునివలన విశేషముగ కటాక్షింపఁబడి
"ఉపాయాపాయనిర్ముక్తో మధ్యమాం స్థితిమాస్థితః" అన్నట్లు
ప్రవృత్త్యాధర్మములను రెంటినిన్ని పరిత్యజించి, సర్వేశ్వరునే యు
పాయముగా నాశ్రయించి, భారమునంతయును వానిపైవదలిన
పిమ్మట కదా! యీతండు భయరహితుండు కాగలడు. కావున,
తాను బద్ధసంసారియై ప్రయోజనాంతరపరుండై, నిషిద్ధాను
ష్ఠానప్రియుండైయుండి, ఆచార్యకటాక్షము కలదనితలంచి నిర్భ
యుండగుట కవకాశము లేదు.

అయితే ఎంటికి చీదరగానున్నప్పుడు స్నానముచేసి ఆకలి
గొనినప్పుడు అన్నముతిని భట్టరువారి శ్రీపాదంబులేశరణమను

కొంటియుండేల చాలునని చెప్పినదాని యభిప్రాయ మేమంటి
దేని, తనను రక్షించుకొనుటకై తాను ప్రయత్నింపకూడదని
చెప్పినారే కాని, భగవద్భాగవత కైంకర్యము లక్కఱలేదు,
ప్రతికూలములయినవాటిని విడనాడవలెను, శిశ్నోదరపరాయ
ణులై తిరుగుడని యిట్టిహితమునుబోధించినారని చెప్పకూడదు
కదా! అట్లు అర్థముచేసికొనినట్లయిన, ఉభయుల స్వరూప
మును రూపుమాపి పోవునే?

అయితే శ్రీరామానుజులవారొకదినమున అభయ
ప్రదానమునుగురించి ఉపన్యసింపుచుండగా, పిళ్ళైవిరంగా
విల్లిదాసులు సంసారమును తలంచుకొని భయపడిరి. అప్పుడు
శ్రీరామానుజులవారు ''మీరుభయపడ నక్కఱలేదు. నాకు
మోక్షము కలిగినట్లయిన,మీకు కలుగుటకు సందియములేదని
సాయించియున్నారేలయని యడిగితిరేని, పిళ్ళై విరంగావిల్లి
దాసులు భయపడినది యెందులకనగా — పరిశుద్ధాత్ములగు
శ్రీయామునాచార్యులవారు శ్రీ కూరత్తాళ్వారులుమొదలయిన
వారు ''అమర్యాదః క్షుద్రః నృపశుః శుభస్యాస్పదమపి''
(మర్యాద లేనివాఁడను, నీచుండను, మనుష్యరూపియగు పశు
వును అమంగళుండను) అనియు, ''తతోనికృష్టమయి సన్నికృ
ష్టేకాంనిష్కృతింరంగపతేకరోషి'' (ఓ రంగనాథ అంతకంటెను
నీచుండనగు నేను ఆశ్రయించినందుల కేమిచేసెదవు) అనియు
''పాపానాం ప్రథమోస్మ్యహం'' (పాపాత్ములలో మొదటివా
డను) అనియు, ''వృత్త్యాపశుర్నరవపుస్త్వహమీదృశోపి''
(నడవడికనుబట్టి పశువువంటివాఁడను అయితే మనుష్యాకార
ముగలవాడను) అనియు, ''నిత్యంత్వహంపరిభవామి గురుంచ

మంత్రం" (నేను ఎల్లకాలము ఆచార్యునిన్ని వారు ఉపదేశించిన మంత్రమునున్ను పరిభవించువాఁడను) అనియు నిట్లు అనుసంధించుకొనునట్టి తమకు కనబడునట్టి సంసారులదోషంబులనన్నిఁటిని తమపైబెట్టుకొని యిట్లు చెప్పినారే కాని, వారు ఆచార్యునిన్ని వారు ఉపదేశించిన మంత్రమునున్ను పరిభవించినట్టివారు కారు కదా! అట్టి నీచులనుగా తమను భావించుకొని యనుసంధించుకొనినారు కంటియే. పెరియాచ్చియారువలెను, తమవలెను,కూరత్తాళ్వారులవలెను, వారిభార్యయగుఆండాళమ్మగారివలెనున్ను విరక్తులై సంసారగంధ మించుకైనను లేనివారై, శ్రీవైష్ణవుల కంతటికిన్ని హితమును బోధింపఁదగినట్టి వారుగా నుండినట్టి యధికారు లగుటంజేసి, యహంకార రాహిత్యమును దెలుపుటకై యిట్లు సాయించి యున్నారు.

కారాంజి సోమయాజి యనువారు బద్ధసంసారియయ్యును, తమను అర్చావిగ్రహమునువలెనే పూజించునదియని కోరగా శ్రీరామానుజులవారు వారిని దిద్దుపాటుచేసి వారిని తమ శిష్యులనుగాఁ జేసికొనినారు కదా!

శ్రీ యెంబారులు సంసారమున నించుకైనను రుచిలేని వారైయుండఁగా, శ్రీరామానుజులవారు నిర్బంధించి నియమించినను,విరక్తులయి యుండుటంజూచి "నిరాశ్రమీ న సంతిష్ఠేత్" అన్నట్లు వెద్దియైన నొక యాశ్రమము నవలంభించియుండవలయునని తలంచి, గృహస్థాశ్రమమును విడిపించి,సన్యాసాశ్రమము నవలంభింపఁ జేసినపిమ్మట సంతోషించినారు కదా!

మరియు శ్రీముదలియాండాను సన్యాసాశ్రమము నంగీ

కరించినతోడనే శ్రీరామానుజులవారు "ఇప్పుడు కదా నాకు త్రిదండ చేతికొచ్చినది" అనుకొనినారు కదా!

కావున కొందఱు సంసారులైనను గృహస్థాశ్రమము నందున్నను, పరమవిరక్తులై యుజ్జ్వలించి పోయినారు. ఇప్పటికైనను, అహంకార మమకారశూన్యులై, అర్థకామములయెడల స్పృహలేనివారై, శత్రు, మిత్ర, ప్రియ, అప్రియ, నిందా, స్తుతుల విషయమున సమానబుద్ధి గలవారునై ప్రవర్తించి నట్లయిన, ఒక్కకొరతయును లేదని అప్పాగారు సాధించిరి.

ఇవి యన్నియున్నను, "పాపానాం వా శుభానాం వా" అన్నట్లు పిరాట్టియొక్క పురుషకారమే కావలయునంటివేని, చెప్పెదను. ఆమెయొక్క పురుషకార కెంకలకంటె సర్వేశ్వరుని యాశ్రయింపవలయునని వచ్చినట్టి యీచేతనుని యపరాధములంజూచి "క్షిపామి" అన్నట్లు తనయొక్క స్వాతంత్ర్యమువలన సర్వేశ్వరుండు కోపించుకొనునప్పుడు "శాస్త్రము వ్యర్థము కాకూడదని యాశ్రయించిన చేతనుని దండింపవచ్చునా? ఈతనిని శిక్షించినట్లయిన, నీయొక్క కృపాదిగుణంబులు జీవించుట యెట్లు?" అనుచు నిట్లు అనువర్తించుటవలనను, ఉపదేశించుటవలనను, తనసౌందర్యమువలనను కృపాదిగుణంబులు ప్రకాశించునట్లు చేసి, రక్షింపఁజేయును. ఇంతియే కాని, పురుషకారమూలముగ ఈతని యనాదికాలార్జితంబులగు పాపంబులనన్నింటిని సహించి యీతని విషయమున నెక్కువ ప్రీతిగలవాఁడై "కింకార్యం సీతయా మమ" (ఇఁకసీతతో నాకేమిపని) అన్నట్లు ఈతనిని పిరాట్టికంటెనున్న యెక్కువ యిష్టునిగాఁ దలంచియుండఁగా, ఈతండు పూర్వము

వలెనే సంస్కారవశమున, రాజభార్య నీచునివరించునట్లు, విష
యాంతరములను ప్రేమించునట్టివాఁడై భగవంతుని కయిష్ట
ములగు అహంకార, మమకార, భాగవతాపచారములు గల
వాఁడయినట్లయిన, సర్వేశ్వరునికిన్ని ఈతని విషయమున అస
హ్యముగలిగి, యీతండు తుదకు వాని నిగ్రహమునకు పాత్రుం
డగును. కావున భగవదధీనములగు సత్త్వమొదలగునవికలవాఁ
డును, భగవంతునికి శేషభూతుండును, భగవదాజ్ఞా పరతం
త్రుండును, భగవత్పరతంత్రుండునునగు ఆచార్యునిచేఁ గాని;
భగవంతునికి శేషభూతురాలును, భగవంతునికే పరతంత్రురా
లును, భగవంతుని యిష్టప్రకారము ప్రవర్తించునట్టిదియగు
పిరాట్టిచే గాని, భగవదంగీకారానంతరము భ్రష్టుండై, అహం
కార మమకారవశ్యుండై, జడసంసారియై పోవువానిని రక్షిం
చుట యశక్యము కదా!

అయితే॥ భుంక్తేభోగా నవిదితనృపస్సేవకస్యార్భకాదిః"
అనఁగా రాజానువర్తనము నెఱుంగనివాఁడగు రాజసేవకుని
పుత్రుండును సకలభోగంబులననుభవించుట సిద్ధించునట్లు, శిష్యుని
కధికారము లేకున్నను, ఫలముసిద్ధించుటలో కొరత లేదనిచెప్పి
యున్నదే యంటివేని, వాస్తవమే ప్రతికూలంబులయినట్టి చెప్పి
యును లేకున్నట్లయిన, ఫలము సిద్ధించుటలో కొరతలేదు. అ
యితే యీతనియందు మంత్రార్థ విరుద్ధంబులును, స్వరూప
నాశకములునగు అహంకార, మమకార, విషయాంతర ప్రా
వణ్య, భాగవతాపచారాదు లున్నట్లయిన, ఫలము సిద్ధించునని
చెప్పకూడదు కదా! రాజసేవకుని బాలుండు రాజానువర్తనము
నెఱింగియుండకపోయినను, రాజు కయిష్టంబులయినట్టి వాటిఁ

చేయకుండయుండవలయును కదా! అట్లుండక, రాజు కయిష్టములయినవాటిఁ జేయుచుండినట్లయిన, వాఁడున్ను వాని తండ్రియును నష్టపడుదురు కదా?

అది యేల? పిరాట్టి కాకాసురునిన్ని, కూరత్తాళ్వారులు నాలూరు వానినిన్ని (క్రిమికంఠవిమంత్రిని) రక్షించియుండలేదా? యంటివేని, ఒక్కతడవయపరాధముఁ జేసి, గతిలేక శ్రీపాదంబులపై బడుటంజేసి, "త్రాహి త్రాహీతి భర్తారమువాచ దయయావిభుమ్" (రక్షింపుమా! రక్షింపుమా? అని భర్తను బ్రతిమాలుకొనెనదా యెను) అన్నట్లు, పిరాట్టి రక్షింపఁ జేసినదే కాని, తడవతడవకు అపరాధంబుల నొనర్చిన యెడల రక్షింపఁ జేయదు కదా? నాలూరువాఁడు ఉపద్రవము వచ్చునని యెఱుంగక, దర్శనమును నిర్వహించుటకుగాను పొరపాటున ఒక్కమాట చెప్పి, తరువాత పశ్చాత్తాపపడినందున దానిని శ్రీ కూరత్తాళ్వారు లొక యపరాధమునుగా నెంచక సహించియున్నప్పటికిన్ని, కూరత్తాళ్వారులవిషయమునఁగల ప్రీత్యతిశయమువలన పెరుమాళ్లు (నాలూరివాని విషయమున) కోపించుకొనఁగా, నేనుపొందునట్టి లోకమునునాలూరువాఁడును పొందవలయునని ప్రార్థించినారు. ఇంతియెకాని, బుద్ధిపూర్వకముగా నపరాధపడినట్టి వీరసుందరుని విషయమున భట్టరువారు అనుగ్రహించి యుండలేదు కదా?

అయినను, ఈతఁడు మనవాఁడుకాఁడా? యనెడి క్షమావాత్సల్యాదులు సర్వేశ్వరునికిఁగలవే? అవి యుపయోగపడవాయంటివేని, వాస్తవమే. అయితే సర్వేశ్వరునికిన్ని తనకున్నుగల సంబంధమునెఱింగి, సర్వేశ్వరుని విడనాడియుండుటను సహింప

జాలక, పరితపించునట్టి వానికిఁగదా యట్టి సంబంధ ముండ
గలదు. తాముండునట్టి స్థితిని యనుసంధించుకొని, "ఇత్యన్యస్మిన్ రాత్రి
యునియామునాయ్యై" (రుచివాసనలను భగవత్కటాక్షము
గలిగినపిమ్మట మేము పొందకుండునట్లు) అనియు, "ఇనోన్నాళు
నాళై యెత్తైనుత్తన్నై కాలముం పోయిక్కిరిపట్టేన్" (ఇవ్వాళి
రేపుఅని యెంతకాలము శ్రమపడుదును) అనియు, "ఏహిపశ్య
శరీ రాణి" (వచ్చి శరీరభూతులగు మమ్ములను కటాక్షిం
పుమా) అనియు, "ఇన్నమ్ కెడువప్పాయో" (ఇంకనున్న చెడిపో
దవా) అనియు, "నాట్టుమానిడత్తోడే సక్కుతితెన్నుమ్ నాట్ట
రోడ యల్వొళిత్తు" (లోకులతో మాకు సంబంధ ముండ
జాలదని వారి మధ్య నుండక) అనియు, "ఓయులకినతియల్వే"
(ఓ లోక స్వభావమా!) అనియును సాయించినట్లు భయపడి
యీ లోకమునందుంటను సహింపజాలని వానికి కదా భగ
వత్సంబంధము కలదని చెప్పవచ్చునని మాణిక్యమాలయను
గ్రంథమున తెలిపియున్నారు కదా!

అట్లుకాకున్న, "నారాయణ" అనుశబ్దముచేఁ దెలుపఁబడు
నట్టి సంబంధమందఱికిని సర్వసాధారణము గాఁగలదు గాన,
విశేషసిద్ధియును లేకపోవుటం జేసి మోక్షమనునది సర్వసాధా
రణము కావలసివచ్చును. కావున ఈచేతనుండు లోకవిలక్ష
ణుండైనట్టయిన, భగవంతుని విశేషకటాక్షమునకు పాత్రుండై
భగవంతుని భోగమునకుఁ దగినట్టివాఁడై ముక్తుండగును. ప్ర
యోజనాంతరపరుండునై సదాచార్యసంబంధ మున్నట్లయిన,
ప్రతికూలములైనవి నివర్తించువరకును సాక్షిత్వములు కల
రోగులనువలెనే రెండు మూఁడుజన్మములు జన్మింపఁజేసి, తుట్ట

తుది శరీరములో నుండఁగా ప్రకృతిప్రాకృతంబుల విషయమున విరక్తిని గలుగఁ జేసి, పరమార్తుని గావించి ముక్తునిగాఁ జేయును. అయితే కేవలసంసారులవలెనే చిరకాలము యీసంసారమునఁ బడవేసియుండడని మామూచార్యులవారు నాయింపుదురు.

"వింశత్యగ్నీంద్రసూర్యాణాం సప్తభిశ్శంకరస్యతు త్రిభిః ప్రజాపతేర్భక్తాః జన్మభిర్వైష్ణవోభవేత్। విష్ణుభక్తిపరస్తద్వత్ సప్తజన్మసుమానవః ఏకాంతీభగవత్యాజీ భుంక్త్వాముక్తో భవిష్యతి" (అగ్ని, ఇంద్ర, సూర్యుల నుపాసించునట్టివారు ఇరువది జన్మములకుపైనిన్ని, శంకరుని యుపాసించునట్టివారు యేడుజన్మములకుపైనిన్ని, ప్రజాపతి నుపాసించువారు మూడుజన్మములకుపైనిన్ని, వైష్ణవులగుదురు. విష్ణుభక్తికలవాడు అప్టైయేడుజన్మములలో నేకాగ్రచిత్తుండై భగవంతుని యారాధించిముక్తుండగును) అన్నట్లు ఆచార్యుని యాశ్రయించి వైష్ణవుండైన పిమ్మట భగవంతునియం దేకాగ్రచిత్తముకలవాఁడైనది మొదలుకొని ఇంతకుముం దుండియున్నట్టి భక్తియొక్క సంస్కారమును విడువకయుండి, క్రమముగ ముక్తుఁడగునని చెప్పియున్నది కదా! ఈ జన్మముననె అధికారికావలయునంటె ఆచార్యాభిమానముకుగాను కావలసినదేమనఁగా సదాచార్యుని యాశ్రయించి తన కుండుకున్నదంతయును వానికి శేషముగాఁ జేసి, ప్రతికూలంబులైనట్టివాటిని త్యజించి, అరుళాళప్పెరుమా ళెంబెరుమానారు, ఎంబారు, కూరత్తాళ్వారు, ముదలియాండాను, వడుగనంబి, నంజీయర్ మొదలైన వారివలెనే యాచార్యుని ఒక క్షణమైనను విడనాడియుండక, నీడవలెనే యనుసరించి యుండవలయును.

* అధికారము లేకున్నను, అహంకారాది రాహిత్యముచే ముక్తింగనుట. *

ఒకవేళ అట్టి యధికారము లేకపోయినను, “మాళువమోరి డత్తిలుం” అనుపాశురమున పాడించినట్లు, మరణకాలమునందైనను, అనాదికాలముగ తానొనర్చుకొనుచు వచ్చినట్టి ప్రతికూలంబులను తలంచుకొని, “నీచనేఁ నిఱైయొన్ఱుమిలేఁ నానే నానావిధనరకం పుకుం పాపంశెయ్ తేన్” (నీచుండను నిరాధారుండను నానావిధములగు నరకములలోఁ బ్రవేశపెట్టునట్టి పాపంబుల నొనర్చినవాఁడను) అనియు, “అమర్యాదః క్షుద్రః నృపశురశుభస్యాస్పదం” “పాపానాం ప్రథమోస్మ్యహం” అనియును చెప్పియున్నట్లు, తనయొక్క దోషంబుల ననుసంధించుకొనుచు, ఇతరుల దోషంబులఁ గనుపెట్టక, తనకు ఆచార్యకటాక్షమువలన లభించినట్టి జ్ఞానభక్తివైరాగ్యంబులను, తన ప్రయత్నమువలన లభించినట్టి వాటినిగాఁ దలంచుకొనుటచే నశించిపోక, తనను బద్ధసంసారులకంటెనున్ను తక్కువ వానినిగాఁ దలంచుకొని, భగవద్భాగవతులయందైనను, సంసారులయందైనను దోషంబులున్నట్లు తనకుఁ దోచినట్లయిన, వాటిని తన దోషంబులనుగాఁ దలంచుకొని, ఒక్కరితోను నోరు తెఱచి చెప్పక, భాగవతాపచారంబున కెక్కువ భయపడుచు, అహంకారమమకారంబులు బొత్తుగ నశించిపోవునట్లు నిర్హేతుకమగు భగవత్కటాక్షము ఫలింపఁగా, దేహావసానమున ముక్తుండగును. దేహావసానసమయమునందును, దారాపుత్రాదులయందాసక్తులవాఁడై, శబ్దాదివిషయములయెడల ప్రీతిని వదలక, అహంకారమమకారములతో ప్రవర్తించినట్లయిన, జడభరతుని వలెనే జన్మాంతరమును బొందును.

— * ఆచార్య, పురుషకార, ఉపాయకృత్యములు. * —

ఆచార్యసంబంధ మున్నంతమాత్రమునఁ ముక్తుండగుట కవ
కాశములేదు. జ్ఞానానుష్ఠానంబులు లేకుండుటవలనఁ గలిగిన
కొరతను తీర్చుటయే ఆచార్యుని కృత్యము. భగవంతుని యా
శ్రయించుటకు పూర్వము అనాదికాలముగా నొనర్చినట్టి పాప
ములను క్షమింపఁజేయుటయే పురుషకారముయొక్క కృత్యము.
భగవంతుని యాశ్రయించుటకు పూర్వ మొనర్చినట్టి పాపం
బులను క్షమించి రక్షించుటయే యుపాయకృత్యము. ఇదియె
సత్యమైనట్టి యర్థము. దీనికిపైగా చెప్పునది యంతయును
స్తుతించుటకుగాను చెప్పినదిగాన, అతివాదము కాఁగలదు.

ఆచార్యసంబంధమైనను, సిద్ధోపాయమైనను, ఈచేతనుని
మనస్సును బాహ్యవిషయములనుండి మరలునట్లుచేసి, "ఎన్నెం
జారు మంగెయెళ్లొండార్" (నాహృదయము అచ్చటికే పో
యినది) అన్నట్లు భగవద్విషయమున నెక్కువ ప్రీతిగల మ
నస్సుకలవాఁడై పరమార్థుండగునట్లు చేసియే కాని, ఫలము
నొసంగదు. కావుననే కదా శ్రీనమ్మాళ్వారులును "తొల్లై తెళ్ళిన్
మననే" (నామనస్సా దండము సమర్పింపుము) అని యారం
భించి, "ఊనిల్ వాళుయిరే నల్లై పో" (ఓ ప్రాణమా మంచి
దానవు) అనియు, "నెంజమేన లైన లై" (మనస్సా మంచిది
మంచిది) అనియు నిట్లు శ్లాఘించి, "నియుంనానుమినేన్నర్ ని
ర్కిల్ మేల్ మత్తోర్ నోయుమ్ శారక్కొడాన్" (మనస్సా! నీవు
న్ను నేనున్ను స్థిరముగానిలిచితిమేని, ఒక్క కష్టమున్ను రాజాల
దు) అనియు "కనమేశొల్లినేన్ యితుశోరేల్ కండాయ్"
(దృఢముగాఁజెప్పితిని దీనినివిడవకుమా) అనియును ప్రార్థించి,

„అరుళ్ పెరువారడియార్'' అను పాశురమున „సర్వేశ్వరుం డు కృపతోఁ జూచుటకు సిద్ధముగానున్నాఁడు. నేనున్ను యీ సంసారము విషయమున స్పృహాలేనివాడనై యున్నాడను. వాడు మోక్షము నిచ్చుటకు తలంచియున్నను, నేనున్ను పొం దవలయునని యున్నను. ఓ మనస్సా! నీవు ప్రతికూలమై యు న్నట్లయిన, ఉపయోగము లేదు కదా! మా వుభయులకును పరస్పరము ప్రీతి చెప్పుటకిన్ని యుండియున్నను, నీవు ప్రతికూల ముగానున్నందున కదా! అనాదికాలముగ దుఃఖపడవలసి వచ్చి నది. ఇట్లైనను, నీవు అజ్ఞానమునువిడిచి వాని శ్రీపాదములను నా శ్రయింపుమా'' అన్నందున మనోనైర్మల్యము లేనట్లయిన, భగ వంతుని లభించుటకు యోగ్యత లేకపోవునని తెలిపియున్నారు.

—•చేతనుని యొజ్ఞఁపఁజేయుట కై భగవంతుండు కృషిచేయు విధము.•—

సర్వేశ్వరుండే స్వయముగ ఈచేతనుని తనతోఁ జేర్చుకొన వలయునని తలంచినప్పుడు ఈయాత్మయొక్క మనస్సును దిద్దు పాటుచేసి, యుపయోగపరచుకొనువిధమును „పెరుమ్పుత్తిల్' ఇత్యాది వాక్యమున శ్రీ అళగియమణవాళప్పెరుమాళ్ నాయనా రులుఆచార్యహృదయమునందు తెలిపియున్నారు. అది యెట్లనిన.

„ప్రకృతియందుండు ఈజీవుని మనస్సును దికలియుగ మనెడి వంచకుండు ఈతనిని హింసింపుడని యాజ్ఞాపింపఁగా, మన స్సును వశపఱచుకొనునట్టి ఇంద్రియము లనెడి దుష్టులు ఈచేతనుని దేహములోఁ బ్రవేశించి, తమలోఁ బ్రధానమైన ట్టి మనస్సును తమవశమున నుండునట్లు చేసి. విషయముల వైపుకుఁ బోయి, యనుభవించునట్టి భోగములతో తృప్తినొందక సహింతరాని భోగమునకై చెరపెట్టి, నలిపి గానుగలో త్రిప్పి

శబ్దాదివిషయరూపమగు పాముగుండెలో పడద్రోసి, బాధించి, కష్టపెట్టి నవిలి తినునట్లును, కోసి తినునట్లును, అప్పులవానివలెనే బాధింపగా, (మనస్సు) పాముపడినతోడనే అట్లు పాడుపడినట్టి మనస్సును, బాగుచేయుటకుగాను, ఇంద్రియములు నశించిపోవునట్లు స్థిరముగానుండి, పదునుగల కత్తిఁదీసి పాపరూపమగు పొదను వ్రేళ్ళతోఁగూడ కోసివేసి, రూపుమాసిపోవునట్లు దహింపఁజేసి, లోకాపవాదమనెడి పెంటపోసి, జ్ఞానామృతమును ప్రవహింపఁజేసి, తడిసి పదును కలిగినదికాఁగానే, సంగరూపములగు తడివడ్లనుచల్లి, కర్తృత్వ భోక్తృత్వాది రూపమగు కలుపును వేళ్ళతోఁగూడ పెళ్ళగించివేసి, పశువులు రాకుండచేసి, ఇతరులు గొనిపోకుండ కాఁపాడగా, సముద్రమువలెనే యనంతముగా ఫలించి తలపంచినతోడనే ప్రతిదిన మనుభవించుచున్నను, కొంచము మిగిలియుండునట్లు ప్రక్కనుండు వారికిఁ దెలియకుండ, అభినివేశరూపమగు సాధనముఁగొని, పైపైని ప్రేమించి, కాలవిళంబమువలన నేలపడిపోకుండునట్లు కోసి, కొయ్యతోఁగొట్టి, తాలును విడతీసి, పైనుండు పొట్టునుతీసివేసి సూక్ష్మశరీరమనెడి తవుడును విరజాజలముతో కడిగివేసి, వేఱొక్క శరీరములోనుంచి, దివ్యస్త్రీలగు అప్సరసలంగొని షడ్గుణము లనెడు షడ్రసములతోఁ గూడియున్నట్టి అన్నముఁ జేయించి నిత్యులకును ముక్తులకును పరమగభోగ్యమైనది కాఁగానే యీయాత్మను సంపూర్ణముగా ననుభవించుటకుగాను ముందుగానే యపేక్షించి, కాపువానివలెనే యీకృషి సాధనముఁగొని, యీలోకోజ్జీవనమునకై కృషిచేయునట్టి స్వభావముగల

వాఁడును, భక్తివర్ధకుండు నగు సర్వేశ్వరుని కృషియొక్క ఫలము కదా?

కావున సంబంధముమాత్రమే చాలదు. సర్వేశ్వరుండు తాను కొని పోదలంచినవారు పరిశుద్ధాంతఃకరణు లగునట్లు, "ఇయిరుందాల్ కండుకొండేన దేళనెంజాళుమ్ తిరుందాదవోరైవరైతెయ్ందరమన్ని" అనఁగా శబ్దాదివిషయములయెడల చపలమైనట్టి నాదీనమైనమనస్సును వశపఱచుకొనునట్టి ఇంద్రియంబుల నెడిపురుషు లయిదుగురు నశించునట్లు నాహృదయమున స్థిరముగానుండి దరిద్రునికి ధనరాశి దొరికినట్లయిన విడిచిపెట్టి పోకుండ కాపాడుకొనుచుండునట్లు దుర్విషయములయెడలప్రీతిని పోగొట్టి కృపతోఁజూచినాడని నమ్మాళ్వారులు సాయించుటం జేసి, సర్వేశ్వరుండు తాను విశేషముగ కటాక్షించుటచే ఈచేతనుండు నిర్మలుండయిన పిమ్మట యాతనిని తన భోగములో నుపయోగపఱచుకొనునని విశదమగుచున్నది.

వాఁడుచేయునట్టివిధ మిట్లుండఁగా, "వెరితేయరుళ్ శెయ్వార్" (నిర్హేతుకముగ కటాక్షించును). అని శ్రీనమ్మాళ్వారులు సాయించిన దానియభిప్రాయ మేమంటివేని, నిర్హేతుకముగకటాక్షించుటయనఁగా—భగవంతుండు ఈ చేతనుని మొట్టమొదట కటాక్షించునప్పుడు, "నాసౌ పురుషకారేణ నచాప్యన్యేనహేతునా। కేవలంస్వేచ్ఛయైవాహం ప్రేక్షేకంచిత్కదాచన" (పురుషకారమువలనఁగాదు వేఱొక్కహేతువువలనఁగాదు నేను స్వయముగానే యొకానొకప్పు డెవ్వనినో యొక్కనిని కటాక్షించుచున్నాడను) అన్నట్లు సర్వేశ్వరుండు నిర్హేతుకముగకటాక్షించునని చెప్పియున్నది. ఇంతియె. ప్రాప్తి

దశయందునుబద్ధసంసారియై, దుర్విషయప్రవణుండై, అహంకార మమకారవశ్యుండై భాగవతాపచారపరుండై, తిరుగుచున్నను, నిర్హేతుకముగ భగవంతుండు కటాక్షించునని యంటివేని, అందులకై, వైష్ణవుండు కావలసినపనిలేదు కదా! ఈ చేతనుండు భగవంతుని భోగమున కర్హుండగుటకుగాను వైష్ణవత్వముమాత్రమే చాలదు ప్రపన్నుండు కావలయును. అదియునుచాలదుపరమైకాంతి కావలయును. అహంకార మమకారములు బొత్తుగ పోవలయును. శాస్త్రనిషిద్ధ విషయములయందుగాని, శాస్త్రనిషిద్ధ విషయములయందుగాని ప్రీతి బొత్తుగ పోవలయును. దీని నాచరించునప్పుడు విరుద్ధంబులని తలంచి వాటిని త్యజించుటమాత్రమే చాలదు. స్వరూపము చెడిపోకుండయుండి యుండవలయు నంటు, "క్షేత్రాణి మిత్రాణి" అనుశ్లోకమునందుఁ జెప్పియున్నట్టి యవస్థ గలుగవలయును. స్వరూపముసిద్ధించుటకై యివియన్ని యును తప్పక యుండవలయునని ఒకమాటికి పదిమాట్లు చెప్పి ఆళ్వారులును ఆచార్యులును ఈ చేతనులుజ్జీవించుటకై పడరాని పాట్లుపడి ఒక్కటి రెండుగ్రంథములయందుమాత్రమే కాకుండ అనేకగ్రంథములయందు ఒక్కరుచెప్పినట్టే వేఱొక్కరున్ను చెప్పి యుండటును ఏకకంఠముగ భగవద్వ్యతిరిక్తములగు సమస్త విషయములను పరిత్యజింపవలసినదని విధించుటకు నిమిత్తము లేదు కదా!

స్వయముగ సర్వేశ్వరుండును, ఆళ్వారులును, ఆచార్యులును చేతనుల నుజ్జీవింపఁజేయుటకై చేయునట్టి కృషి యిట్టిది గానుండఁగా,కొందఱు సర్వేశ్వరునికి తనయాశ్రితులు నిషిద్ధం

బుల నాచరించినట్లయిన, యెక్కువ యిష్టముగా నుండుననియు, అది తనయొక్క గుణంబులను బ్రకాశింపఁజేయునట్టిదియనియు, "దోషోయద్యపి తస్యస్యాత్" అనుతావున తానే యిట్లు చెప్పి యున్నాఁడనుచు తమ విద్యాబలమువలన కుతర్కంబులఁ జేయుచు, వేదశాస్త్ర పురాణేతిహాసంబులు తమ కలవి కానివియగుటంజేసి, వేదబాహ్యులగు కుదృష్టులు విపరీతార్థంబులఁజెప్పనట్లు,వాటిలోఁజెప్పినదొక్కటియైయుండ, తాము వేఱుగఁగొన్ని యర్థములఁ గల్పించిచెప్పుదు, తమకిష్టమువచ్చినట్లు ప్రవర్తించుదురు. వారుచెప్పునది యేమంటే—తిరుమంత్రమునందు ఈచేతనుండు తనను రక్షించుకొనుటకై తానుప్రయత్నింపఁ గూడదని చెప్పియున్నది కదా ! నిషిద్ధంబులు కూడనివి యని వాటిని త్యజించినట్లయిన, తనను రక్షించుకొనుటకై తానుప్రయత్నించిన వాఁడగును కాన, తనను రక్షించుకొను విషయమున తనకు సంబంధము లేదని తెలుపునట్టి మంత్రమున కిదియె (నిషిద్ధానుష్ఠానమే) యర్థమనియు, దానిని వివరించునట్టివియగు ద్వయ చరమశ్లోకంబులకున్ను ఇదియే తాత్పర్యమనియును, అట్లుగాకున్న, చరమోపాయము నుపదేశించి "ఇదంతేనాతపస్కాయ నాభక్తాయకదాచన" (దీనిని జితేంద్రియుండు కానివానికిగాని భక్తుండుకాని వానికిగాని యుపదేశింపకూడదు) అన్నట్లు చేఁజిక్కినవస్తువును చేయిజారి నీటిలో పోగొట్టుకొనిన వారివలెనే కష్టపడునా? దాని యభిప్రాయమేమి? అనియు, "చోదనాలక్షణోధర్మః" అనఁగా ధర్మము శాస్త్రవిధిచే నిర్బంధించునట్టిదిగా నుండుననియు, "సూక్ష్మః పరమదుర్జ్ఞేయః సతాంధర్మః ప్లవంగమ" అన్నట్లు సత్పురుషులాచరించునట్టిది యితరుల

కొంతమాత్రము తెలియరానట్టి ధర్మసూక్ష్మమై యుండును. అహంకారమమకార రాహిత్యమునకు హేతువగుటంజేసి నిషిద్ధానుష్ఠానమే ధర్మసూక్ష్మమని తలంచి, వేదశాస్త్రములందు "బ్రాహ్మణాస్సర్వాన్వేదాః" అని చెప్పియున్నను, మహాత్ములు ధర్మసూక్ష్మమునెఱింగి అహంకారరహితులుగను జన్మంబులని తలంచి, "స్త్రియః సాధుః శూద్రః సాధుః" స్త్రీలు సాధువులు శూద్రుండు సాధువు) అనియు "శ్వపచోపిమహీపాలవిష్ణుభక్తో ద్విజాధికః" (విష్ణుభక్తుండయినట్టి వాఁడు చండాలుండైనను, బ్రాహ్మణునికంటెను ఎక్కువవాఁడు) అనియును చెప్పినట్లు, శ్రద్ధయును అహంకారరాహిత్యమునకు హేతువగుటంజేసి యదియే యవశ్యముగ కావలసినదియనుచు నిట్లు పలువిధములుగ వినువారికి కర్ణకఠోరముగ నుండునట్లు విపరీతార్థములఁ జెప్పుచు, దారాపుత్రాదులనున్ను, విషయప్రావణ్యమునున్ను, అహంకారమమకారంబులనున్ను విడనాడక, వాటిని విడిచినట్లయిన, మనలను రక్షించుకొనుటకై మనమే ప్రయత్నించిన వారలమగుదుమనియు నిట్లు చెప్పుచు "ఏషామిల్ ముక్తపుమ్" అనియు, "నీనుమ తెన్నినైవేల్ముతల్ మాయ్ త్తు" అనియు "పత్తిలై యాయవన్ పిలడంగే" అనియు, "కర్తమిల్ తోంద్రేల్ కళ్ కర్మొత్తొ గ్రీమిల్" అనియు, "క్షేత్రాణిఃపుత్రాణి" అనియు, "ఇతరం మాతరం దారాన్" అనియు, "సర్వధర్మాన్ పరిత్యజ్య సర్వకామాంశ్చసాక్షరాన్ లోకవిక్రాంతచరణౌ శరణంతే వ్రజంప్రభో" అనియుసీతావుల భగవద్విషయవ్యతిరిక్తములగు వాటినన్నింటిని వదలుకొని భగవంతుని యుపాయమునుగా స్వీకరించుటను విధ్యనుష్ఠానముల కూలముగఁ జూపింను

వారలగు ఆళ్వారులయొక్కయును పూర్వాచార్యులయొక్క-
యును ప్రాచీనములగు శిష్టాచారములను మంటిలోఁగలిపి
తిరుగుచుందురు

అట్లు వారు చేయునట్టిది యంతయును భగవంతుని మాయ
యేయని గ్రహింపునది. అట్లుకాకున్న సర్వేశ్వరుండును, ప్ర
మాదములేనట్టి జ్ఞానసంపదను లభించినవారలగు ఆళ్వారు
లును, పూర్వాచార్యులును చేతనోజ్జీవనార్థము బోధించుచుప్ర
యత్నించుటకు హేతువేదియును లేదు కదా? ఇందులకు ప్రమా
ణము కావలయునా? ఒక్కని భార్య వేఱొక్కనిని ప్రేమించి
నట్లయిన, వానికి ఆమెయందు ప్రీతియుండకలదా? ప్రపత్తి
చేయువానికి విషయాంతరసంబంధము కూడదు ముముక్షువుకి
కూడదని సర్వేశ్వరుండే చెప్పియుండగా, విషయాంతరసంబం
ధమాతని కిష్టమనినచో, నది విపరీతజ్ఞానమని తోఁచదా?
కావున "విషయేష్వపి సంరాగో మానసో మల ఉచ్యతే । తే
ష్వేవ వీతరాగోయ స్సనిర్మల ఉదాహృతః" అన్నట్లు విష
యాంతరప్రావణ్యమునరించినదేకాని, నిర్మలమైనమనస్సుకలవా
డుకాడు. నిర్మలమైన మనస్సు కలవాఁడయినదేకాని, సర్వేశ్వరుని
ప్రాపింపున కర్హుఁడుకాఁడు. ఇట్టి మనోనైర్మల్యము కలుగు
టకు గాను తిరుమంత్ర ద్వయ చరమశ్లోకార్థాను సంధానము
తోను, ఆళ్వారులు పాడియుంచిన పాశురముల యర్థానుసం
ధానముతోను కాలక్షేపముచేయుచు, తానుండు తావు సం
సారులకు తెలియరాకుండునట్లు, ఏకాంతముగానుండువాఁడై,
అట్టి యర్థానుసంధానమునకు యోగ్యతలేనట్లయిన, తమకుఁ
దోఁచినదే పరమార్థమని బోధించునట్టి యప్రామాణికులతోఁ

చేరక, అహంకారాద్యములచే పీడితులు కానివారును, పరమ సాత్త్వికులును, జ్ఞానానుష్ఠానసంపన్నులునగు వారితోఁ జేరి యుండవలయును.

ఈతని సంచితపాపంబులను సర్వేశ్వరుండు తన క్షమా గుణమువలన క్షమింపవలయునని యొకప్పుడు వానిని శరణు చొచ్చినపిమ్మట, బుద్ధిపూర్వకముగ నిషిద్ధంబులయినవాటి నాచరింపకయుండవలయును. అట్లుకాకున్న, "ధిక్ క్షమామీదృశే జనే" (ఛీ ఛీ ఇట్టివానిని క్షమింపకూడదు) అనుకొని సర్వేశ్వరుండు ఈతనిని విడనాడును.

చిరకాలముగ వేఱొకనిని తగులుకొనియున్న భార్య లజ్జాభయంబులులేనిదై భర్తయొద్దకువచ్చి తనను అంగీకరింపవలయునని మొఱపెట్టుకొనునట్లు ఈచేతనుం డొనర్చునట్టి శరణాగతి యపరాధకోటిలోఁ జేరునట్టిదియేయైనను, సర్వేశ్వరుండు దయాళువగుటంజేసి యనాదికాలముగ బుద్ధిపూర్వకముగా నొనర్చినట్టి ప్రతికూలంబులగు కర్మంబులనన్నింటిని క్షమించినట్టియున, ఇఁకమీఁదైనను, అట్టి కర్మంబుల నాచరింపకూడదను కొని భయపడియుండక, నిర్భయుండై వాటినే మఱలమఱల ఆచరించుచు "పాపతరమ్" అన్నట్లు పదేపదే యపరాధపడుచు "క్షేత్రాణిమిత్రాణి" అని యారంభించి "భవంతి సర్వే ప్రతికూలరూపాః" అనువరకును చెప్పియున్నట్లు దారాపుత్రాదులు ప్రతికూలులని యెఱింగియుండియు, "పితరంమాతరందారాన్" అను శ్లోకమునను సంధించుకొనుచును, అనఁగా ప్రతికూలంబులైన వాటినన్నింటిని విడనాడి నీ శ్రీపాదంబులను శరణు చొచ్చినాడ నని అసత్యము పలికి, తరువాతనైనను, దుర్వాసనామూలముగ

వాటిని విడనాడక, ప్రతిదినము భగవంతునికి దండము సమర్పించుటకు వచ్చినప్పుడెల్ల శుష్కప్రియంబులగు మాటలను చెప్పి, "దుఃఖావహోహమనిశం తవ" అను తావున చెప్పియున్నట్లు అకృత్యముల నాచరించునట్టివాఁడై, దుర్విషయములయందాసక్తికలవాఁడై, శరణాగతుండనని ఆశ్రయించుటకుగాని, విడనాడుటకుగాని యోగ్యతలేకుండునట్లు సర్వేశ్వరునికి కష్టములఁ గలుగఁ జేయునట్టి వాఁడయినట్లయిన, సర్వేశ్వరుఁ డీతనిని క్షమింపఁజాలఁడు కదా!

ఇఁక వాత్సల్యమనఁగా—తన దూడయెడల తల్లియగు ఆవుకుఁ గల ప్రేమ, ఆవు ఈనిన వెంటనే దూడవంటిమీఁదనుండు మాలిన్యమునంతయును నాకివేసి, దానియం దెక్కువ ప్రీతిగలిగియుండునప్పుడు మాత్రము దూడ విషయమున నెక్కువయాదరణకలదై యుండునే కాని, ఆ దూడ పాలువిడిచి మేతమేయుచు నీళ్లుత్రాగుచు తిరుగునప్పుడు వంటినిండ పేడబురద పూసుకొని వచ్చినట్లయిన, దానినిన్ని భోగ్యముగాఁ దలంచి నాకివేయదు కదా!

అట్లే సర్వేశ్వరుండును, ఈచేతనుండు తనను ఆశ్రయించినప్పుడు వానియందుండు దోషంబులను భోగ్యముగా నంగీకరించి, యీతండు భగవదనుభవైక పరాయణుండైయుండునప్పుడు "యోగక్షేమం వహామ్యహం" అన్నట్లు ఈతని భారమునంతయును తనపై బెట్టుకొనుచేతప్ప, తనను ఆశ్రయించిన పిమ్మటనున్ను ఈతఁడు బుద్ధిపూర్వకముగా నొనర్చినట్టి పాపంబులను భోగ్యముగా గ్రహించునని కాని, ఈతండు విషయాం

తరప్రపన్నుండయి యున్నప్పుడును యీతనిభారమును తనపై పెట్టుకొనునని కాని తెలియరాదు కదా!

కావున అన్నింటిని విడనాడి పరమార్థుండయినచే తప్ప, యీతనివిషయమున వానికి ప్రీతిగలుగదు వానిని రక్షించుటకుగాను ఈతనికి ఆర్తి యుండవలయును. ఈ కొరత లేనిచో, ఉభయులస్వరూపమున్ను కొరతలేనిదియగునని ఆచార్యహృదయ మాయించినారు కదా?

కావున ప్రతికూలంబులు నివర్తించుటయును, ఆర్తియును లేనివానికి సదాచార్యాభిమానమును, పురుషకారమును, సంబంధమును ఉపయోగపడవు. అట్టివాని విషయమున భగవంతునికిఁగల క్షమావాత్సల్యములును ఉపయోగపడవనియేర్పడుచున్నది కావున అకృత్యకరము మొదలుగాఁగల నాలువిధములగు నిషిద్ధంబులనాచరించుటయు, ఉపాయాంతరప్రతిపత్తియును, ప్రయోజనాంతరములగు దారాపుత్రాద్యైహికభోగంబులును, స్వర్గాదిపరలోకసుఖములును, స్వాత్మానుభవసుఖమును (కైవల్యమును) వీటినన్నింటిని ప్రపన్నుండు పరిత్యజించి, "శేలేయ్ కణ్ణియరుమ్ పెరుంశెల్వముమ్ నన్మక్కళుమ్ మేలాత్తాయ్ తందైయుమవరే యిని యార్" (స్త్రీలును, సంపత్తున్ను, సుకృతంబులును, తల్లితండ్రులును సర్వేశ్వరుండే) అను తావునఁ జెప్పియున్నట్లుండ వలయును. ప్రపన్నునికి ఉపాయప్రవృత్తియును, అపాయనివృత్తియును ఈరెండును త్యాజ్యంబులని "తీర్ప్పారై యామిని" (తి. వా. ౪-౬. ౭ తి) అను తిరువాయ్ మొళియందు స్వాపదేశాన్యాపదేశముల మూలముగ

శ్రీనమ్మాళ్వారులే తెలిపి యున్నారు కదా! అదియెట్లన, సిద్ధోపాయము (సర్వేశ్వరుండు) శీఘ్రముగ ఫలము నొసంగనందున, సాధనాంతరానుష్ఠానము మూలముగ దేవతాంతరముల ను పూజించి, "సోమపా పూతపాపాః" (సోమపానము జేయునట్టివారు పాపరహితు లగుదురు) అన్నట్లు సోమపానాదుల మూలముగ పాపరహితులము కావలయుననుకొన్న, అట్టి యనుష్ఠానప్రవర్తకులగు సాధనాంతరనిష్ఠుల నొకతావునఁ జేర్చి, ఉపాయానుష్ఠానము నుపక్రమింపఁబోవునప్పుడు, సంబంధిజ్ఞానము మనస్సునకువచ్చి అధ్యవసాయము దృఢపడునట్లు చేయుటకై "నీవు ఇట్లు స్వరక్షణము విషయమున ప్రయత్నింపవచ్చునా? అనన్యార్హ శేషత్వాద్యాకార షట్కముచే పిరాట్టులతో సమాననగు పరిశుద్ధాత్మస్వరూపముకు దేవతాంతరసాధనాంతరములును, వాటి నవలంభించియుండువారితో సహవాసమున్ను స్వరూపమును నశింపఁజేయునట్టివి యగునే కాని, భగవత్ప్రాప్తికి తోడ్పడునవి యగునా?" అనియిట్లు స్వరక్షణ విషయమగు ప్రయత్నమును నివర్తింపఁజేసి, ప్రపన్నునికి సాధనాంతరానుష్ఠానము కూడదని స్వోపదేశముచేఁ దెలిపినవారయిరి.

నాయకుఁడు రానందున నాయకి మూర్ఛిల్లి పడియుండఁగా, తల్లియయినది భయపడి, తనకూతురి మూర్ఛను క్షుద్రదేవతల నారాధించుటవలనను. క్షుద్రదేవతలకు ప్రియంబులగు మద్యమాంసాదుల మూలముననున్ను పోఁగొట్టవలయునని సోదిచెప్పు వారలది చెప్పినట్లు నిషిద్ధానుష్ఠానమునకై ప్రయత్నింపఁబోగా, చెలికత్తె శీఘ్రముగా వచ్చి అయ్యో! అయ్యో! ఈమెయొక్క స్వభావము నెఱింగియుండినమీరు స్వరూప నాశకము

లగు నిషిద్ధానుష్ఠానములతో సన్వయింపకూడునా? ఈ బిడ్డకు క్షుద్రదేవతాసంబంధ మెన్నఁడైన కలదా? ,,ద్రవ్యంనింద్యసురాదిరైక్యతమతిక్షుద్రంచ బాహ్యగమో దృష్టిఃదేవలకాశ్చ దేశికజనాధిక్ ధిక్ ధిగేషాంక్రమ" అన్నట్లు వాటిని స్పృశించినంతమాత్రమున, వాటితో సమానముగాఁ జేయునట్టి యత్యంత నిషిద్ధద్రవ్యములగు మద్యమాంసాదుల స్పర్శమున్ను, ఎరుకలవాండ్లు మొదలగు విపరీతార్థములను బోధించునట్టివారిని స్పృశించుటనైనను సహించునా? భగవన్నామ సంకీర్తనమున్ను పరమవైదికులై ప్రమాణపరతంత్రులగు భాగవతోత్తముల శ్రీపాదరేణుస్పర్శమే తప్ప, వేఱొకటి తగునా? మనయొక్క వైష్ణవ కులమర్యాదకు నిషిద్ధానుష్ఠానము తగునా?" అని యిట్లు ,,తీర్త్వా రైయాసుని" అని యారంభించి, ,,ఈమెయొక్క బాధను పరిశీలించి చూచితిమేని, ఈమె పార్థసారథియయిన వానియొక్క యాశ్రితపారతంత్ర్యమువలన మూర్ఛపోయినది, ఇది క్షుద్రదేవతలవలనఁ గలిగినట్టిది కాదు. వానియొక్క చిహ్నముల (శంఖచక్రాదుల) పేర్లను చెప్పితిమేని ఈమె తెలివికి వచ్చును. మీరాపులట్లు చేయకుండ, అసంగతప్రలాపినియగు ఎరుకలదాని మాటలనువిని, చేయరానివియును, వైష్ణవత్వమును చెడుపునట్టివియునగు నిషిద్ధకార్యములతో సంబంధించి, మద్యమాంసములను ప్రోక్షించి, ఈమె జీవించుట కిదియే దివ్యౌషధమగునని, రాజసతామసదేవతలకు ప్రియంబులగు నిషిద్ధాహారములను,దృష్టితీసి,ఆవేశముచే ఈయెరుకలదియాడునట్టి యాటలవలన ఈమెను జీవింపఁజేయశక్యమా? ఈమెయొక్క శరీకాంతియున్ను నశించుచున్నది. ఈ నీచపదార్థములతో సం

సంబంధము గలిగినందులకు ప్రాయశ్చిత్తముగాను, భాగవత శ్రీపాదరేణువులను ఈమె పైచల్లఁడి. పిరాట్టితో సమానురాలగు ఈ బిడ్డయొక్క కష్టంబులు తొలగిపోవుటకై, అపరూపస్నానీయ యీపథమని తలంచి, తలవిరగపోసుకొని భుజము లెగురునట్లు మీఁకు పడునట్టి పాట్లు ఇవి? అయ్యో! తల్లులారా! నోటిముండకేయన్నము వలెనే యీమె నశించిపోవునట్లు, ఈ గాడిదయొక్క చేష్టలను చూచుటచే ప్రయోజనమేమి ? అప్రామాణికులరాలగు ఈమెయొక్క యసంగత ప్రలాపములను లక్ష్యపెట్టక, వేదవిదగ్రేసరులును, ప్రమాణపరతంత్రులు నగు జ్ఞానాధికులను పురుషకారముగాఁగొని, నిత్యసూరి నిర్వాహకుండగు సర్వేశ్వరుని యాశ్రయించి, ఈమె కష్టంబులను తొలగింపక, కల్లుత్రాగి, వళ్లుమరచి, పాటలు పాడునట్లు యీమెతోఁగూడ మీరున్ను చేరి నీచుఁడు తాళము వేసినట్లు ఆమెటయును ఈకపటనాట్యమును నేను చూచుటలను శ్రీకృష్ణుని శ్రీపాదంబులకు మంగళాశాసనము చేసినదో, ఈమెబాధ తొలగిపోవును స్వరూపానుకూలముగ నేను చెప్పినట్లు చేసితి నేని ఈమె జీవించి భగవంతునికి దండము సమర్పించి నాట్యమాడును'' అనియిట్లు నిషిద్ధానుష్ఠానమును, అట్టియనుష్ఠానము గలవారితో సహవాసమునున్ను నివర్తింపఁజేయుటచే భసన్ననికి అకృత్యకరణాది నిషిద్ధానుష్ఠానమున్ను అట్టియనుష్ఠానము గలవారితో సహవాసమున్ను త్యాజ్యంబులని అన్యాపదేశముచేఁ దెలిపిన వారయిరి.

-* అవయవావయవిభావసంబంధైక్యము నగుటించిన ఆక్షేపసమాధానములు. *-

అయితే ఈచేతనునికిన్ని సర్వేశ్వరునికిన్ని గల శరీరాత్మభావమున్ను అవయవావయవిరూపమగు నైక్యమున్ను యెఱింగి

యున్నట్టివారు చేయునట్టిపను లన్నియును,సర్వేశ్వరునివియే యై
వాటిమూలకములగు పుణ్యపాపంబులతో నీచేతనునికి సంబం
ధములేదని ప్రమాణములు తెలుపుచున్నవేయని యడిగెదవా?
ఇందులకు సమాధానము నింతకుముందు చెప్పియున్నాము.
సర్వదా భగవద్గుణానుభవపరుండై, మనోబుద్ధులను రెంటిని
భగవద్ధ్యానముననుంచి, వొళ్ళుమరచి, బుద్ధిపూర్వకముగా నొ
క్కడానిన్నిచేయక, "యస్యనాహంకృతోభావః" (ఎవనికి నే
ను నాది అనెడి తలంపు లేదో) అని చెప్పియున్నట్లు నడ
చుకొనువాఁ డయినట్లయిన, అవి వానితో సంబంధింపవు. ఇట్టి
జ్ఞానముమాత్రము వేదాంతజ్ఞానవాసన కలవారి కందరికిన్ని
కలదు. అయితే ఇందులకనుగుణమగు అనుష్ఠానమున్నట్లయిన,
అది ఫలించును. అదియెట్లనిన, ఇట్టిజ్ఞానము రావణుని కున్న
ప్పటికిన్ని, పరహింస, పరదారాపరిగ్రహము, పరద్రవ్యాపహా
రము, అపేయపానము, అభక్ష్యభక్షణము మొదలగునవి యె
ల్లప్పు డుండియున్నట్లు ఇతిహాసపురాణాదులవలనఁ దెలిసికొను
చున్నాము కదా? "ఆధేయత్వ, విధేయత్వ, శేషత్వ రసతాశ్ర
యాః శ్రియఃపతేర్ముఖ్యతనవః పరమైకాంతినస్స్మృతాః"
అనఁగా భగవదేకశేషభూతమును, భగవదేకపరతంత్రమును,
భగవదేకధారకముగా నుండుటయనెడి శరీరలక్షణములుగలపర
మైకాంతులను గదా! సర్వేశ్వరునికి శరీరభూతులని చెప్పుదురు.
"రాగాదిదూషితే చిత్తేనాస్పదీమధుసూదనః నబధ్నాతి రతిం
హంసః కదాచిత్కర్దమాంభసి" (రాగాది దోషయుక్తమగు
మనస్సుకలవారియందు భగవంతుండు వసింపడు. అదెటువలె
ననిన, బురదగుంటలయందు హంస విహరింపదు కదా!) అన్న

ట్లు, రాగాదులచే దుష్టమైనట్టి మనస్సుకలవాఁడు శరీరభూతుం
డు కాఁజాలఁడు కదా! శరీరభూతుండగు పరమైకాంతి «భోగాః
పురందరాదీనాం తే సర్వే నిరయోపమాః» అనఁగా ఈలోక
మునందుండునట్టి వాటికంటెనున్ను విలక్షణములగు స్వర్గాది
భోగములనున్ను స్వాత్మానుభవ సుఖమునున్ను (కైవల్యమును
న్ను) నరకముతో సమానమైన వాటినిగాను తలంచునే తప్ప,
«అమేధ్యపూర్ణం క్రిమిజాలసంకులం స్వభావదుర్గంధమశౌచమ
ధ్రువం కళేబరం మూత్ర పురీషభాజనం రమంతి మూఢాః నర
మంతి పండితాః» (అపరిశుద్ధములయినవాటితోఁ గూడియున్న
దియు, క్రిమిజంతువులతో నిండియుండునదియు, స్వతస్సిద్ధముగ
దుర్గంధముగలదియు, అపరిశుభ్రమయినదియు, అనిత్యమైనది
యు, మూత్రపురీషాదులకాధారమైనట్టి శరీరమును మూఢులు
ప్రేమించుదురే కాని జ్ఞానులు ప్రేమింపరు) అన్నట్లు మూఢుల
వలెనే హేయంబులగు దుర్విషయములయెడల ప్రీతిగలవాఁడై
సంసారులును త్యాజ్యమైనట్టిదానినిగాఁ దలంచియుండునట్టి ని
షిద్ధకృత్యము నాచరింపఁడుగదా! «అకృత్యం నైవ వాపాబుద్ధ్యా
శాస్త్ర విరోధతః ఏకాంతీ పరమైకాంతీ రుచ్యభావాచ్చ సంత్య
జేత్» అనఁగా నైషవుండు నిషిద్ధానుష్ఠానమును ప్రాప్యప్రతి
బంధకమనెడి భయమువలనను, ఏకాంతి శాస్త్రవిరుద్ధమగుటం
జేసి భగవంతునియాజ్ఞ నతిక్రమించినవారలము కాఁగలమను
భయమువలనను, పరమైకాంతి హేయమైనట్టిదిగాఁదోఁచి దాని
యందు రుచిలేనందునను త్యజించుదురని చెప్పియున్నది కదా!
మొదటవాఁడు నిషిద్ధమును దానియందు రుచియున్నప్పటికిన్ని
విరుద్ధమయినదను భయమువలన త్యజించుదురు, తుదివాఁడు

నిన్నట్టి యధికారియన్ననో, ప్రాప్యరుచియందు లోపము గలుగునని భయమువలన త్యజించుటమాత్రమే కాకుండ, దానియందు రుచిలేనందుననున్ను త్యజించును! ఇట్టి యధికారియొనర్చునట్టి వాటిని గదా సర్వేశ్వరుండు తనవాటినిగా నభిమానించును. ఇవ్విధమున నర్థముచేసికొనకపోయినట్లయిన, సమస్తములగు చేతనాచేతన పదార్థములును వానికి శరీరభూతములేయైనందున వాటి వాటి కృత్యంబులన్నియును వానివే కావలసివచ్చును.

అట్లుకాకుండ, వీరికి జ్ఞానము కలదు కదా'యనియెదవా? అట్లయినచో, వేదాంతజ్ఞానము గలవారలగు రావణాదుల రాక్షసకృత్యంబులున్ను సర్వేశ్వరునివే కావలసివచ్చును. కావున భగవత్సంబంధ మున్నంతమాత్రము చాలదు. తద్విషయమగు జ్ఞానమున్నంతమాత్రమున్ను చాలదు. అదుల కనుగుణమగు అనుష్ఠానమున్ను ఉండవలయును.

—* చరమశ్లోకార్థముయొక్క పూర్వాపరసందర్భములు. *—

సర్వధర్మంబులను పరిత్యజించి భగవంతుండే యుపాయంబని నిశ్చితబుద్ధితో నుండుటయే యీ యధికారియొక్క కృత్యమనియు, విరుద్ధంబులయినవాటిని తొలగించుటయన్ననో, సర్వేశ్వరుని కృత్యమనియును చరమశ్లోకమునఁ జెప్పియుండఁగా, అట్టి నిశ్చితబుద్ధియున్నను, ఆర్తిలేకపోయినట్లయిన, భగవంతుని బొందుటకు యోగ్యుండుకాడని యేల చెప్పఁదగునంటివేని, ఉపాయాధికారమునకు అట్టి నిశ్చితబుద్ధియే చాలును. ఉపేయాధికారంబునకన్ననో, ఐహికాముష్మికాది సమస్తభోగములయెడల వైరాగ్యమున్ను ఉండియుండవలయును. అదియెటువలె

ననిన, ॥ఉపాయాంతరములను విడనాడి చరమోపాయమును (సర్వేశ్వరుని) యాశ్రయించినట్లు, ఉపేయాంతరములగు ఐశ్వర్య కైవల్యంబులను విడనాడి చరమావధియగు ప్రాప్యమును (కైంకర్యమును) ప్రార్థించుట” అనునది ఉపేయంబును ప్రతిపాదించునట్టిదియగు (ద్వయముయొక్క) ఉత్తరవాక్యముయొక్క-యర్థమని చెప్పియున్నది కదా! ద్వయముయొక్క పూర్వోత్తరవాక్యముల యందుఁ జెప్పఁబడినట్టి ఉపాయోపేయాధికారంబులను రెంటినికలవాఁడైనచోఁగదా ఈతండుసర్వేశ్వరునిచే కటాక్షింపఁబడును. ఈ యుపాయము ప్రాప్యాంతరములకును (ప్రయోజనాంతరములను లభించుటకును) సమానమైనందుననిట్టి యధ్యవసాయము ప్రయోజనాంతరపరులకున్ను కలదు. కావున అధ్యవసాయ మున్నంతమాత్రమున, భగవద్భోగంబున కర్హుండు కాఁజాలఁడు. కావున శ్రీనమ్మాళ్వారులే ॥కళైయరప్పాశంకళ్ విట్టపిన్నైయన్ని యువనక్కాణక్కోడావే” అనుతావున బాహ్యవిషయములనన్నింటిని విడనాడినపిమ్మట నేతప్ప,ముక్తిభూమిని కంద్రరిచూచుటకున్ను ప్రాప్తియుండదని తెలిపియున్నారు కదా! కావున నచట యుపాయాధికారము మాత్రమే చెప్పఁబడినది.

చరమ శ్లోకమున నిది (భగవత్ప్రాప్తి) ఏల చెప్పియుండలేదంటివేని, చెప్పెదను. ఈ శ్లోకమునందు ఉపాయస్వీకారమునకుఁ గావలసినట్టి త్యాగస్వీకారంబులను పూర్వార్థమున (సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ) అనుతావున తెలిపి, ఉత్తరార్థమున (అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామిమాశుచః) అనుతావున అందులకు ఫలముగాను, భగవత్ప్రాప్తి ప్రతిబంధకములగు సమస్తపాపంబులయొక్కయును

నివృత్తిని మాత్రముచెప్పి భగవత్ప్రాప్తిని చెప్పకపోయినను, దీనికిముందు శ్లోకమున «మామేవైష్యసి" అనుతావునఁజెప్పఁబడి నట్టి భగవత్ప్రాప్తిని దీనితో నేకార్థముగాఁ గొనుచుండుఁబున, అచ్చట పూర్వార్థముచేఁదెలుపఁబడినట్టి యుపాయాధికారము నున్న ఫలమును తెలుపునట్టి యీశ్లోకముతో నేకార్థముగాఁగొనునది. అదియెట్లనిన, «మన్మనాభవమద్భక్తో మద్యాజీ మాంనమ స్కురు।మామేవైష్యసిసత్యంతే ప్రతిజానే ప్రియోసిమే" అనఁగా, «నాయందేమనస్సుకలవాఁడవై నాయందేకాని, వేఱొక్కడాని యందు ప్రీతిలేనివాఁడవై, నాకైంకర్యమున నాసక్తికలవాఁడవై, నన్నే శరణుజొచ్చినట్టివాఁడవై యుంటివేని, నీపాపంబులను పోగొట్టుకొనుటకై నీవు ప్రయత్నింప నక్కఱలేదు. సత్యముగా నన్నుపొందగలవు" అనియీయర్థముఁదెలుపునట్టి యీశ్లోకము నఁజెప్పియున్నట్టి తదేకశరణాత్వ రూపమగు ఉపాయాధికారంబు నకుఁ గావలసినదై, ఈతావునఁ జెప్పియుండని యుపాయాం తర త్యాగమును, « సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకంశరణం వ్రజ" అనుతావున విధించి, దాని యుత్తరార్థమున «మామే వైష్యసి" అనుతావునఁ జెప్పఁబడినట్టి ఫలమునకుఁ గావలసిన దియై, యిచట చెప్పియుండని భగవత్ప్రాప్తి ప్రతిబంధక నివృ త్తిని, «అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అను తావునఁ జెప్పియున్నందున, ఈరెండు శ్లోకంబులును ఒక్కటిని వేఱొక్కటి యపేక్షించి యుండునవియై ఒక్కటే యర్థముఁ దెలుపునట్టివి కాఁగలవు. మఱియు « యథేచ్ఛసితథాకురు " (నీకు యెట్లు యిష్టమో, అట్లు చేయుము) అని శ్రీకృష్ణుండు చెప్పినపిమ్మట, కాయక్లేశములై, స్వరూపవిరుద్ధములగు కర్మ

యోగాద్యుపాయంబుల ననుష్ఠించుటకు నేను సమర్థుండను కానని యర్జునుండు దుఃఖపడగా, „ సర్వగుహ్యతమంభూయః శృణుమే పరమంవచః” (మిక్కిలి రహస్యమైనట్టి నాయొక్క హితమైనట్టి వాక్యమును వినుము) అని యుపదేశించినవి యగుంజేసి, యీరెండు శ్లోకంబులును ఒక్కదాని యర్థమును వేఱొక్కటి వివరించునవియై, ఒక్కయర్థమునే తెలుపునట్టివిగా నుండగలవు. కావున దీనికి ముందుశ్లోకమునఁ జెప్పియున్నట్టి ఫలమే యీశ్లోకమునఁ జెప్పియున్నట్టి ఫలమున్ను. కావున, ఆశ్లోకమునఁ జెప్పియున్నట్టి యుపేయాధికారమును ఈ శ్లోకమునందును చెప్పియున్నట్టి దానినిగానే యెఱుంగునది. పైశ్లోకమున „మద్భక్తః” అనుతావునఁ జేర్కొనఁబడినట్టి భక్తియనునది సాధనభక్తి కాదు. అది కైంకర్యమునకు సహకారియగు సాధ్యభక్తి.

—* ఉపాయాధికారమునకుఁ గావలసిన వాటిఁ దెలుపుట. *—

ఇంకను, ఉపాయాధికారమునకు శుష్కాధ్యవసాయము మాత్రమే చాలదు. ప్రాతికూల్య త్యాగమున్ను ముఖ్యముగానుండవలయును. ప్రపత్తియొక్క స్వరూపముఁ దెలుపునట్టితావుల „ఉపాయాపాయనిర్ముక్తా మధ్యమాంస్థితిమాస్థితా” (ఉపాయాపాయంబులు రెండును లేనట్టి మధ్యమస్థితి) అనియు „ఉపాయాపాయసంయోగే నిష్ఠయాహీయతేనయా” (ఉపాయాపాయంబులు రెండును చేరియున్నట్లైన, ప్రపత్తిరూపమగు నిష్ఠను పోగొట్టుకొనును) అనియు నితావుల పుణ్యాపాపరూపోభయకర్మంబులును త్యజింపవలసినవిగాను చెప్పఁబడినవి కదా! వీటిని త్యజించి సర్వేశ్వరుని ఉపాయమునుగా స్వీకరించినపిమ్మట, భగ

వత్ప్రాప్తి గలుగువరకును, ఉపాయాధికారము చెడిపోకుండు నట్లు నడచుకొనినట్లయిన, అంత్యకాలమున అధికారానుగుణ ముగ ప్రతిబంధకములను తొలగించి, ముక్తునిగాఁ జేయును. “తెళివుత్తు వీవిఱ్ఱి నిన్ఱవర్క్కిన్బక్కది శెయ్యుమ్” (జ్ఞానముకల్గి, విడవకుండ ధ్యానించువారికి ఆనందమునుగలుగఁజేయును) అని శ్రీనమ్మాళ్వారులును సాయించియున్నారు కదా! అధికారానుగు ణముగ ప్రతిబంధకములను తొలగించుట యనఁగా భగవంతుఁడు తనకృపవలన ఈచేతనునికి శరీరము విషయమునను, దానినిబట్టి యుండునట్టివాటి విషయముననున్ను వైరాగ్యమును గలుగఁ జేయుటకు గాను, ఈచేతనునిచే అభ్యుపగత ప్రారబ్ధాంశమును అనుభవింపఁజేసి, తక్కినసంచితపాపంబులన్నియును నశించున ట్లుచేసి, ప్రామాదికముగ ఇఁకమీఁదు చేయబోవునట్టి పాపంబు లను కృపతో సహించి, అవి యీతనిపై పడకుండునట్లు చేసి, బుద్ధి పూర్వకముగా నొనర్చినట్టి వాటి విషయమున ననుతాపమును, రాజు తనపుత్రుని యపరాధమునువలెనే, సులువుగా ననుభవిం పఁజేసి, అట్లు వాఁడు అనుతాపపడకుండినచో, యథోచిత ముగా దండించును.

—* భగవత్కటాక్షమున్నను, ప్రకృతివశ్యుండైనట్లయిన, లీలలోనుపయోగ పరచుకొనుట. *—

ఈతండు ఉజ్జీవింపవలయునని సర్వేశ్వరుండు కటాక్షించి యుండగా, ఈతండు సర్వేశ్వరుని యుపాయముగాఁగొనియును, ప్రకృతివాసనవలన నీతనియందుకొన్ని పొరపాట్లుయుండి యున్న ట్లయిన, సర్వేశ్వరుం డీతనిని తనలీలకు విషయముగాఁ జేసికొనునా? యంటివేని, పూర్తిగా అట్లుచేయకపోయినను,

ఈతనియందు దురాచారరూపముగు అపరాధముల కవకాశ మున్నట్లయిన, గొంతకాలము లీలలో నుపయోగపరచుకొనుటకు సందియము లేదు. అపరాధంబుల కవకాశము గలుగకుండ బ్రవర్తించునట్టి యధికారులను సయితము లీలలో నుపయోగపఱచుకొనునట్టి స్వతంత్రుండగు ఈతండు అట్టియవకాశ మున్నట్టివా రున్నట్లయిన, విడువడు కదా। దీనిని శ్రీ తొండరడిప్పొడి యాళ్వారుల విషయమునఁ జూచియున్నాము కదా! మఱియు శ్రీనమ్మాళ్వారులును ''పాశంగళ్ నీక్కి యెన్నై యునక్కేయరకొండిట్టు నీమాయంగళ్ శెయ్ తువైత్తియువై యేన్నమయక్కుక్కే'' (సంసారబంధమునుపోగొట్టి నన్ను నీకేదాసునిగాఁజేసికొనినట్టి నీయొక్క మాయలు చేసిన వని యేమి యాశ్చర్యము! ) అని సాయుంచియున్నారు కదా! అది యెట్లనిన, ఒకరాజు నృత్యగీతాది నిపుణురాలగు ఒకవేశ్యను బ్రేమించియున్నను, భోగకాలము వచ్చువరకును నృత్యగీతాదుల మూలముగ నుపయోగపఱచుకొనునప్పుడు. అది మిక్కిలి సుకుమారి యైనట్లయిన, శీఘ్రముగాఁ దనతోఁ జేర్చుకొనగలడు. అది దృఢమైన శరీరముగలదియైనట్లయిన, దాని యిష్టమువచ్చినంత కాలము లీలలో నుపయోగపఱచుకొని, యటుపిమ్మటయనుగ్రహించును. అటువలెనే సర్వేశ్వరుండును, లోకయాత్ర కశక్తులై యార్తులయినట్లయిన, శీఘ్రముగా ననుగ్రహించును. దీనిని సహించి యుండునంత దృఢులయినట్లయిన, కొంతకాలము లీలలో నుపయోగపఱచుకొని, యెప్పుడార్తులగుదురో, అప్పుడే యంగీకరించును.

—దృప్తప్రపన్నులును ఆర్తప్రపన్నులును మోక్షమును బొందువిధము.—

అయితే "దృప్తానామపిజన్తూనాం దేహాన్తరనివారిణీ" (దృప్తులకున్ను పునర్జన్మలేకుండచేయునది) అని చెప్పియున్నదే యంటివేని, దృప్తులు ప్రస్తుతము చిరకాలపరిచయమువలన ప్రారబ్ధ శరీరమును సహించియున్నను, అంత్యకాలమున నార్తులనుగాఁజేసి, సర్వేశ్వరుండు అంగీకరించునని యీపైశ్లోకము తెలుపుచున్నది. దృప్తుండయినట్టివాఁడును శుద్ధమూర్ఖుఁడు కాడు కదా! దేహావసానము వరకును ఈ దేహమును సహించియుండుట యనునది యొక్కటియే కదా! యీయధికారికిఁగల దోషము. తక్కిన త్యాగస్వీకారంబులన్నియును ఉభయులకును సమానములే కదా! "ఇరుందిరుందెత్తకాలం పులంబువనే కూవిక్కొళ్ళుంకాల మిన్నంకురుకాతో. యెన్నైయే శెయ్ కిన్రాయ్ ఎణామరైక్కణ్ణా? నెరికాట్టినీక్కుతియో పలనీకాట్టిప్పడుప్పాయో తీయోశుడర్ శేర్ మెయ్యుకాయులకిల్ తిరువేనో" (ఈలోకముననుండి యెంతకాలము సహించుదును. నన్నుగొనిపోయి కైంకర్యముఁగొనునట్టి కాలమింకను రాలేదా' నన్ను యేమి చేయఁదలఁచినావు. నా పుండరీకాక్షుఁడా? ఉపాయాంతరములను జూపించి నన్ను చెడిపెదవా? విషయాంతరములనుజూపించి చెడిపెదవా? నిప్పుతో మైనము చేరియుండునట్లుండు ఈలోకమునుండునా?) అని యివ్విధమున ప్రార్థించుచు, "కంగులుం పగలుం కండుయిలరియాళ్ ఇట్టకాలిట్టకైయళా యిరుక్కుమ్ శిందిక్కుమ్ తిసైక్కుం తేరుమ్ కైకూప్పుమ్ అయ్యువర్ తొయ్యువ నాడిక్కాణ్ పర్ పాడియలత్తువర్"అనఁగా నిద్రాహారంబుల యెడల ఆశవదలి, కన్నీరుకార్చుచు, వేసినకాలువేసినట్లు వేసిన

చెయ్యివేసినట్లు మూర్ఛిల్లి పడియుండి, తిరిగి జ్ఞానమువచ్చి ఏడ్చుచు దండము సమర్పించుచు, పాటలుపాడుచు, "ఎంగుం నాడినాడి నరసింగా" (అన్నివైపులను వెతకివెతకి నరసింహా!) అని ప్రలాపించుట యొక్కటియే యాప్తునికిఁగల విశేషము. అహంకార మమకార కామక్రోధలోభ మోహాదులనువదలు కొనుటయును, పుత్రదార గృహక్షేత్ర ధనధాన్యాదులవిషయమున విరక్తియును, ధారక,పోషక భోగ్యంబులగు పదార్థంబులన్నియును భగవంతుండేయనెడి నిశ్చయముతో నుండుటయును ఇవియన్నియును ఉభయులకును సమానము.

—* కొందఱు దృప్తప్రపన్నులను ఆర్తప్రపన్నులనుగాఁ జేయుట. *—

కావున, కొంతకాలము చిరకాల పరిచయమువలన సహించియున్నను, దేహావసానకాలమున నన్నింటి విషయమునను వైరాగ్యమును గలుగఁజేసి, ఆర్తుండగునట్లుచేసి సర్వేశ్వరుండతనిని అంగీకరించును. అట్టి యార్తిని గని యిఁక యిదిచరమ శరీరమని తనకున్ను నమ్మకము గలుగునట్లును, ఇతరులున్ను సమ్మతించునట్లు నుండి యుజ్జీవించును. దేహావసానకాలమునన్నున్ను, దారాపుత్రాదుల విషయముననే యాసక్తికలవాఁడై యున్నట్లయిన, సర్వేశ్వరుండు ఈ యాత్మను శీఘ్రముగ అంగీకరింపఁడని తత్త్వజ్ఞుండగు తనకున్ను, ఇతరులకున్ను తోచునట్లుండిన వాఁడగును. అట్టివానికి వేఱొక్కజన్మము తప్పకవచ్చునని మాయాచార్యులు నాయించుదురు. ఇదియే పరమార్థము.

—* ఆర్తప్రపన్నుల వైశిష్ట్యమునుగుఱించిన విచారము. *—

ఇట్లు ఆనతీయఁగా, శ్రీసేనాపతియాళ్వార్ అనువారు మిక్కిలి దుఃఖపడినవారై "ఇట్టి యార్తికి అధికారులెవ్వరు ?

త్యజింపవలసిన వాటిని త్యజించినవారెవ్వరు" ,, ఎంగినిత్త
తెప్పెయ్ వత్" అని సాయించినట్లు నశించియే పోవలయును
ఇంతియే. అని యిట్లు చెప్పుచు శ్రీ ఎఱుంబి అప్పాగారి శ్రీపాద
ములపైబడి మిక్కిలి దుఃఖపడిరి. అప్పాగారును వారిని లేవ
తీసి కౌగలించుకొని, కన్నీరు తుడిచివేసి, దుఃఖపడవద్దు స్వరూప
విరుద్ధములగు విషయములయెడల ఇట్టి భయానుతాపంబులు
న్నట్లయిన, సర్వశక్తియగు సర్వేశ్వరుండు తానే స్వయముగ
కావలసిన వాటి నన్నింటిని కలుగఁజేసి, తానే యంగీకరిం
చును. నీవు దేనినిన్ని చేయనక్కఱ లేదు. పరిత్యజింపవలసినవాటిని
పరిత్యజింపక పోయినను, అవి హేయంబులని తలంచి, విడ
వాడవలసినవియును అహంకార మమకార కామ క్రోధ రూ
పములును, భగవద్భాగవతాపచార రూపములునునగు నిషి
ద్ధంబులను పరిత్యజించి, ఎంతలో లోకసంగ్రహమున్ను శిష్య
పుత్రో జీవనమున్ను సిద్ధించునో, అంతమట్టుకు లోకహితము
నకై వర్ణాశ్రమ ధర్మంబుల ననుష్ఠించుకొనుచు, అహంకారార్థ
కామ పరవశులు కాకుండ, జ్ఞానభక్తి వైరాగ్యసంపన్నులయి
నట్టి పరమవిలక్షణులతో సహవాసముచేసి, వారిని విడిచి యుం
డక, గుణానుభవకైంకర్యములతో ప్రొద్దుపుచ్చుకొనుచు, బద్ధ సం
సారులయిన వారితోఁ జేరక, సదాచార్యాభిమానమే యుత్తా
రకమని నిశ్చయించుకొని, ఇట్టి యాత్మగుణము లన్నియును
"ఎన్నై త్తీమనమ్ కెడుత్తాయ్ — మరువిత్తోఱుం మనమే
తన్దాయ్" (నాయొక్క దుష్టమనస్సును పోగొట్టినావు. శ్రద్ధతో
నమస్కరించునట్టి మనస్సునిచ్చినావు) అనిసాయించినట్లు సర్వే
శ్వరునికృపవలన లభించినవి యనుకొని, అహంకార పడకుండ

యున్నట్లయిన, సర్వశక్తియగు సర్వేశ్వరుండు అంత్యకాలమున పరమార్తినిగలుగఁజేసి రక్షించును. ఇది దుర్లభమని తలంప వద్దు. ఒక్కగుణమునైనను, ప్రకృతి వశ్యుండగు ఈ తండు కలుగఁజేసికొనజాలఁడు కదా! సర్వేశ్వరుండే యీతనిని ఉజ్జీవింపఁజేయవలయునని తలంచిననే కదా! యీతండు ముక్తుండు కాఁగలఁడు. ముక్తుండగుటకుఁగావలసిన యాత్మ గుణంబులను గలుగఁజేయుటయనునది వాని భారమే కదా! అయోధ్యయందుండు స్థావరజంగమంబులనన్నింటిని భగవత్సంబంధమున్నప్పుడు సుఖపడునట్టి వాటిని గాను, అది లేనప్పుడు దుఃఖపడునట్టి వాటిని గాను చేసి ఆత్మగుణంబులను గలుగఁజేసినట్టి సర్వశక్తుండగు సర్వేశ్వరుండు భారమునంతయును తనపై వదలినట్టి యీ చేతనునికి వాటిఁగలుగఁజేయుటయనునది యసాధ్యము కాదు కదా!

— * సర్వేశ్వరుండు భక్తులను రక్షించు విధము * —

ఈ తండు ప్రకృతి వశ్యుండై దేహాత్మాభిమానియై, దధిక్షీర, ఘృతంబుల మూలముగ శరీరమును బలపఱచి 'ఉణ్మల్ కుమోడుపగుప్పారు శ్రమఱ్ కట్టుక్ శెయ్ వార్" (మాంసమునువృద్ధిపఱచిస్థూలశరీరులయినవారుశిష్టులకేమిచేయుదురు?) అని సాయించినట్లు సాత్త్విక గోష్ఠిలో నుండఁదగినట్టి వారు కాకుండ బద్ధసంసారులై, శబ్దాది విషయప్రవణులై, అహంకారాది వశ్యులై గర్వముతోఁ బ్రవర్తించినట్లయిన, వాళ్ల తిప్పలు వాళ్లు పడుదురుగాక యనుకొని కర్మానుగుణముగ నిర్వహించుకొని పోవునే తప్ప, శాస్త్రమునఁ జెప్పియున్న ప్రకారము నడుచుకొనువారై, త్యాజ్యోపాదేయంబుల నెఱింగియుండి,

త్యాజ్యంబులను విడనాడి, ఉపాదేయంబులను స్వీకరించుటయ
నునది తనకవశ్యము ఉండవలసినదనుకొని, ॥విణ్ణుళార్ పెరు
మార్కడిమై శెయ్వారైయుం శెరుప్పుంబులనైన్దు మణ్ణాళ్వెన్నై
పెత్తాలె శెయ్యుమత్తునీయుం విట్టాల్" (నిత్యసూరి నిర్వా
హకుండవగు నీయొక్క కైంకర్యము నొనర్చువారినిన్ని చెడుపు
నట్టివియగు పంచేంద్రియములున్న ఈలోకమున నుండు నాపై
బడినప్పుడు నీవున్ను విడనాడితివేని నేను ఏమిచేయగలను? ॥ఇడ
కిత్తేనొట్టకిల్లేన్ ఐంపులన్ వెల్లకిల్లేన్ కడవనాకి కాలంతోరుం
పూప్పరిత్తేత్తకిల్లేన్" (బిచ్చము వేయనివాడను, దాహమీ
యనివాడను, ఇంద్రియజయము లేనివాడను, శాస్త్రవశ్యుండనై
యెల్లకాలము పుష్పములనుసమర్పించి స్తుతింపనివాడను) అని
పరితాపపడి నీవే రక్షింపవలయునని శరణాజొచ్చినట్లయిన,
॥యదినారాయణస్స్వయం" అన్నట్లు శత్రువునున్న దయతోం
జూచునట్టి వాడు ఈచేతనుని విడనాడడుకదా!॥అడియరైవల్
నివైత్తుప్పాంపులనైందుం తుంజక్కొడానవన్" అనుతావునతన
నాశ్రయించినట్టి వారిని ప్రబలంబులగు కర్మంబులలో బడత్రో
యడనియు, పంచేంద్రియములమూలముగ శబ్దాది విషంబులను
అనుభవించునట్లు విడనాడడనియును శ్రీనమ్మాళ్వారులు సా
యించియున్నందున, వాని యనుగ్రహమునకు పాత్రులయినట్టి
వానివానులు సత్కర్మంబులనాచరించి ముక్తులగుదురే తప్ప,
విషయప్రవణులై నశింపరు. సర్వేశ్వరుండే యీతనిని దిద్దు
పాటు చేయునప్పుడు, ఈతనికి దుర్లభమైనదెద్దియును లేదు అయితే
క్రమక్రమముగ పూర్వపు శిష్టాచారము ననుసంధించు కొనుట
చేతను ఆళ్వారులప్రబంధముల యర్థంబులననుసంధించుకొనుట

చేతనున్న మంచి తెలివితేటలు గలుగునట్లు యీతనిహృదయమునందున్నవాఁడై "తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజంతమః నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేనభాస్వతా" అని సాయించి యున్నట్లు విజ్ఞానరూపమగు దీపముచే అజ్ఞానాంధకారమును బోగొట్టి సదనుష్ఠానమునఁ బ్రవర్తింపఁజేసి రక్షించు విషయమున సంశయము లేదు.

ఈశ్వరుండు చేతనుండగుటంజేసి, ప్రతికూలంబు లయిన వాటిఁద్యజించి అనుకూలంబు లయినవాటి విషయమున సంకల్పము మాత్రమున్నట్లయిన, సర్వేశ్వరుండు తానే స్వయముగ వీటినన్నింటిని గలుగఁజేసి, నిర్వహించుకొని పోవును. కావున "నబిభేతికుతశ్చన" అనియు "మిత్రభావేన సంప్రాప్తం నత్యజేయంకథంచన" అనియు "దోషోయద్యపి తస్యస్యాత్ సతామేతదగర్హితం" అనియు "యే పాపినోపిశిశుపాల సుయోధనాద్యాః ముక్తింగతాః" అనియునిట్లు శరణ్యుండగుసర్వేశ్వరుని ప్రభావముఁదెలుపునట్టి వాక్యంబులఁ జదువుచు, వాటియర్థము నెఱుంగక, తామున్న బద్ధసంసారులై శబ్దాది విషయంబుల యందుఁ బ్రీతికలవారై, అహంకారాది పరవశులై "ఆచార్యరుగళనవరుం మున్నాశరిత్త వాచారంతన్నై యరియాతార్ పేశుకిన్ఱ వార్కళై క్కేట్టు మరుళాతే పూరువర్గళ్ శీర్తనిలై తన్నై నెంజే శేర్" అనియు "పలసీకాట్టి ప్పదుప్పాయో! ఇన్నమ్ కెడుప్పాయో" అనియును సాయించియున్నట్లు విషయాంతరములకు మిక్కిలి భయపడి, అవితొలఁగిపోవలయునని ప్రార్థించుకొనుచు, ప్రామాదికముగానైనను అవిపైబడకుండ, పరాంకుశ పరకాలాదులు ముందాచరించి పోయిన శిష్టాచారం

బుల నెఱుంగక, నాకు భగవత్సంబంధ మున్నదనియును, నాకు సదాచార్యసంబంధమున్నది కదా యనియును తలంచి, ప్రతికూలంబులయిన వాటిని విడనాడక. తామున్ను భయము లేని వారై, ఇతరులకున్ను దానినే యుపదేశించి, వారినిన్ని భయములేనట్టి వారినిగాఁ జేసి, తిరుగుచున్నట్టి స్వపరవినాశకులతోఁ జేరి, వారి యుపదేశంబులఁ గొని నశించి పోకుండ, నాథయామున, యతివరాదుల శ్రీసూక్తులనున్ను వారి యనుష్ఠానంబులనున్ను అవలంబించి, అందుల కనుగుణముగ మంచి యనుష్ఠానముగలవారై ప్రాప్యప్రతిబంధక నిషిద్ధానుష్ఠాన పరిత్యాగపూర్వకమగు ననుష్ఠానమునే యితరులకున్ను ఉపదేశించి, కడతేర్చువారుగా నుండునది. శ్రీనమ్మాళ్వారులు త్రికాలజ్ఞానులగుటంజేసి, "శ్రుతిర్నష్టా స్మృతిర్లుప్తా ప్రాయేణ పతితా ద్విజాః" అన్నట్లు, కలికాలము ప్రబల మగుచుండునప్పుడు విపరీతార్థంబులను బోధించునట్టివారును, విపరీతానుష్ఠానంబులును ప్రబలంబులగునని ముందుగాఁ దెలిసికొని, శ్రీవైష్ణవ సిద్ధాంతమున నవి యెంతమాత్రము చేరకూడదని తలంపు గలిగి, శ్రీరామానుజుల వారవతరింపఁ బోదురని దివ్యదృష్టితోఁ జూచి, "పొలిక పొలిక పొలిక" అని తామున్ను మంగళాశాసనముఁ జేసి, "శెన్నుతొళ్ళుతుయ్ మిఁ తొండీర్" అనుతావున వారే ముముక్షువు లందఱిచేతను ఆశ్రయింప వలసిన వారని తెలిపి, అట్టి అవతారము త్రిదండ కాషాయంబులతోఁ గూడ సేవసాయించునట్లు శ్రీమధురకవులనున్ను శ్రీమన్నాథమునులనున్ను విశేషముగ కటాక్షించి, మనకాధారమై మనకార్యమును నెరవేర్చునదియై యుండుననియు ఈ యవతా

రమే యందఱిని యుజ్జీవింపఁ జేయునట్టిదియనియు, వీరే మన సిద్ధాంతము కంతయును ఆచార్య శ్రేష్ఠులనియును తెలిపియున్నందున శ్రీమన్నాథమునులు మొదలుకొని మనయాచార్యుల వరకున్ను శ్రీరామానుజులవారే యుజ్జీవనాచార్యులనియు, వారియొక్క శ్రీసూక్తులును అనుష్ఠానంబులునే ప్రమాణంబులనియునంగీకరించి వారే యుత్తారకులని తెలువునట్టివాడై విశేషమగుసదనుష్ఠాన సంపన్నుండగు సదాచార్యుండే మహోపకారకుండగు ఆచార్యుండని తలంచి,యితరులకున్ను అట్లా బోధించునది. «రామానుజార్యోగురురితిచ పదంభాతి నాన్యత్ర” (గురువను మాట శ్రీరామానుజులవారి విషయముననే తగును గాని యితరత్ర తగదు) అనఁగా వేఱొక్కరి విషయమున నిట్టి యాచార్యత్వమున్నట్లు చెప్పినట్లయిన, రుచిభేదములవలన ననేకవిపరీతార్థముల కవకాశముఁగలుగునని రాబోవు అనర్థమును నిరీక్షించి ఇతరులాచార్యులు కారని యిట్లు నిషేధించి యున్నందున వారు తమ గ్రంథమున (శ్రీభాష్యమున) తెలిపిన శ్రీసూక్తులును అనుష్ఠానంబులును ఉపాదేయంబు లగును.

—* ప్రపన్నుండు ప్రవర్తింపవలసిన విధము *—

కావున శ్రీరామానుజులవారి శ్రీపాదంబులే శరణంబని చూపించునట్టి సదాచార్యుండే ,,మాతా పితాయువతయః” అనియు ,,ఐహికాముష్మికంగురుః” అనియు ,,ఇరుప్పిడమ్ వైకుంఠం వేంగడం” అని చెప్పియున్నట్టివి యన్నియునని తలంచుకొని సర్వోత్తారకులగు శ్రీరామానుజులవారే యుత్తారకాచార్యులని నిశ్చయించుకొని, ,,క్షేమస్సఏవహి యతీంద్రభవచ్ఛ్రితానాం”అన్నట్లు వారొనర్చిన చరమకాలప్రవృత్తియే రక్షక

మనితలంచి, ,,జగదాచార్యరచితే శ్రీమద్వచనభూషణే తత్త్వజ్ఞా
నంచ తన్నిష్ఠాం దేహి నాథ యతీంద్ర మే'' (ఓ రామానుజ పిళ్లెలోకా
చార్యులవారు సాయించిన శ్రీవచనభూషణవిషయమగు జ్ఞానము
ను అందు జెప్పంబడినట్టి యనుష్ఠానమును నాకుం గలుగం జే
యుమా! ) అని ప్రార్థించి క్రమముగ దానియందుం జెప్పియున్న
ట్టి సదనుష్ఠానంబుల ననుసంధించుకొనుచు, అవి లభించునట్లు
సదాచారసంపన్నులగు పరమార్థులతోం గూడియుండి, ,,అహం
కారము అగ్నిస్పర్శమువలెనె దహింపంజేయుననియు, శబ్దాది
విషయసంబంధము విషసంబంధమువంటిదనియు, భాగవతాప
చారము త్రిశంకునివలె కర్మచండాలునిగాం జేసి కాలాంతరమున
కాలినవస్త్రమువలెనే రూపుమాపిపోవునట్లు చేయుననియును
భయపడి, పరుల దోషంబులం గన్పెట్టుటకై యత్నింపక, సర్వ
భూతదయాళువై ఆనృశంస్యమువలన శాస్త్రమున విధింపంబ
డినట్టి కర్మంబులను లోకసంగ్రహార్థము యథోచితముగా నను
ష్ఠించుచు, ఆహారనియతి, అనువర్తననియతి, సహవాసనియ
తులు కలవాండై, దేహము విషయమునను, దారాపుత్రాదుల
విషయముననున్న అనురాగమును వదలి, ప్రకృతివికారము (విష
యానుభవేచ్ఛ) గలిగినట్లయిన ధర్మభోగబుద్ధులను విడిచి శాస్త్ర
సిద్ధమగు స్వభార్యయందు కదాచిత్తుగ మూత్రోత్సర్జనమువలె
నే దానిని నివర్తిపం జేసికొని, కుమ్మరపురుగువలెనే యీలోక
మునం బ్రవర్తించునట్టివాండు భగవంతునికి మిక్కిలి ప్రియుం
డై వాని యనుగ్రహమువలన శరీరావసానకాలమున మిక్కిలి
యార్తి గలవాండై అంతులేని యానందముగల లోకంబున
(పరమపదమున) ఆనందభరితుండై యుండును.

“కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి” అన్నట్లు, నేను చెప్పినది సత్యము. నేను చెప్పినట్లు దృష్టాధికారమునందే యెల్లకాలముండి నిర్భయులై సుఖముగా నుండవలసినది యని అప్పగారు సాయించిరి. అంతట స్వాములును సంతోషించి దండము సమర్పించి నిలువబడగా, నేను మీకొకను చెప్పవలసినట్టి పరమార్థమొక్కటి కలదు. అది యేమనఁగా— ఈ యాత్మగుణంబు లన్నియును లభించినను, మన కివి కలవనెడి యహంకారము లేశమాత్రమైనను ఉన్నట్లయిన, నహుష, బలి, యయాతి మహారాజుల యజ్ఞ, దాన, తపస్సులు వ్యర్థంబులైనట్లు భగవన్నిగ్రహముకు పాత్రులగుదురు. కావున తనను నిత్యసంసారులకంటెనున్న తక్కువ వానినిగాఁ దలంచి, అహంకార రహితుండై ప్రవర్తించునది. ఈ యభిప్రాయము నుంచుకొనియే “నీచనేన్ నిఱైయొన్ఱుమిలేన్” అనియు “అమర్యాదః క్షుద్రః” అనియు, “తతోనికృష్టేమయి సన్నికృష్టే” అనియు “పాపానాంప్రథమోస్మ్యహం” అనియు “వృత్త్యాపశుః” అనియు నివ్విధమున మన యాచార్యులందఱును అనుసంధించుకొని పోయిరి. ఇట్లు సంసారులకంటెనున్న తనను తక్కువ వానినిగాఁదలంచుకొనవలసి యుండఁగా, భాగవతుల విషయమున నహంకారపడి, తాను వారితో సమానుండననియు, తాను వారికంటెనున్న అధికుండననియును తలంచుకొనినట్లయిన, ఆత్మ నశించిపోవునని వేఱు చెప్పవలసినది లేదు కదా!

—*భాగవతులు మూడు విధములనుట*—

అయితే స్వామీ! భాగవతానువర్తనక్రమమును గుఱించి మాకు తెలుపుండని యడిగిరి. అంతట వారిట్లు సాయించిరి.

ఇది మూఁడువిధములుగానుండునని నంబిళ్లగారు సాయించుదురు. అదియెట్లనిన, సత్కార యోగ్యులనియు, సహవాస యోగ్యులనియు, సదానుభవ యోగ్యులనియును భాగవతులు మూఁడు విధములుగా నుందురు.

—*సత్కార యోగ్యుల లక్షణము. వారినను వర్తించు విధము *—

సత్కారయోగ్యులనఁగా నామరూప ప్రధానులు. "యే కంఠలగ్న తులసీనళినాక్షమాలాః । యే బాహుమూలపరిచిహ్నిత శంఖచక్రాః యేవా లలాటఫలకే లసదూర్ధ్వపుండ్రాః తేవైష్ణవా భువనమాశు పవిత్రయంతి" అన్నట్లు సర్వేశ్వరుని నామమును చిహ్నంబులనున్ను ధరించియుండువారు "చోరో ప్యవధ్యః శ్వపచో ప్యదూష్యః ఋణ్యాప్యపీడ్యో పశురప్యబాధ్యః । యోహ్యంకితో వైష్ణవలాంఛనేన పూజ్యశ్చవిష్ణోః ప్రతిమాసమానః" (విష్ణుచిహ్నంబులను ధరించిన చోరుఁడైనను వధింపఁగూడదు, చండాలుండైనను దూషింపకూడదు. ఋణిగ్రైనను పీడింపకూడదు. పశువయినను బాధింపకూడదు. అతఁడు సర్వేశ్వరుని విగ్రహముతో సమానుండు) అని చెప్పియున్నందున వారి కులగోత్రములున్ను, నడవడికలును యెట్లున్నను, వారిని నిందింపక, యథాశక్తి సమర్పించి, భగవంతుని విగ్రహముయెడల యపచారపడుటను గుఱించి భయపడునట్లు, వారివిషయముననున్ను భయపడి, అర్ఘ్యపాద్యాదుల వలన వారి మనస్సుకు సంతోషము గలుగునట్లు వారిని సత్కరించి ప్రవర్తించునది. అట్టి వారిని నిందించినట్లయిన, "మద్భక్తం శ్వపచంవాపి నిందాంకుర్వంతియేనరాః పద్మకోటి శతేనాపి నక్షమామి వసుంధరే" అన్నట్ల భగవద్విగ్రహముకు పా

త్రుటిర్వై, ॥అనాచారాన్ దురాచారాన్ అజ్ఞానాన్ హీనజన్మనః మద్భక్తాన్ శ్రోత్రియోనిందన్ సద్యశ్చండాలతాంవ్రజేత్” అన్నట్లు కర్మచండాలుం డగును. కావున కులవడవడికలనుబట్టి యెంతహీనులైనను, బ్రహ్మహత్యవచ్చుటకు శిఖాయజ్ఞోపవీతములను ధరించినంతమాత్రమే చాలియుండునట్లు, అపచారము వచ్చుట కంతమాత్రమే చాలును. కావున నట్టివారిని యవమానింపక, కించిత్కారమువలనను, నైచ్యోక్తులవలనను సంతోషపెట్టుచు జాగరూకతో ప్రవర్తించునది, అయితే వారితో సహవాసము గాని, సదానుభవము గాని చేయకూడదు.

—* సహవాసయోగ్యుల లక్షణము. వారి ననువర్తించువిధము. *—

సహవాసయోగ్యులనఁగా—జ్ఞానప్రధానులు. ॥అపగతమదమానైరంతిమోపాయనిష్ఠైః అధిగతపరమార్థైరర్థకామానపేక్షైః నిఖిలజనసుహృద్భిః నిర్జితక్రోధలోభైః వరవరమునిభృత్యైరస్తుమేనిత్యయోగః” అనఁగా త్యాజ్యోపాదేయజ్ఞానపరిపూర్ణులై త్యాజ్యంబులను పరిత్యజించి, ఉపాదేయంబులను గ్రహించి, చరమోపాయ (సదాచార్యాభిమాన) నిష్ఠులగు దృష్టాధికారులు సహవాసముఁ జేయుటకును ॥బోధయంతః పరస్పరం” అన్నట్లు ప్రకృతిసంబంధము మూలముగ మనస్సునకు వికారము గలుగకుండునట్లు ఒక్కరికొక్కరు సద్విషయంబులను బోధించుటకున్ను యోగ్యులు.

—* సదానుభవయోగ్యులలక్షణము. వారి ననువర్తించు విధము. *—

సదానుభవయోగ్యులనఁగా—అనుష్ఠానప్రధానులు. వారెవ్వరంటెవేని, త్యాజ్యభూమియగు ఈ లీలావిభూతిమొదల విర

క్తికలిగి, భగవదనుభవము లభింపనందున పరమార్తులై బాలులవలెను, పిచ్చివాండ్రవలెను, పిశాచముపట్టిన వారివలెనున్న తమ శరీరమును మరచి ఉన్నచోటనుండక, సంసారులవైపునఁ జూడక, "అత్యర్థమెన్నవృలకియర్కొ కొడువృలకంకాట్టేతే" (ఇవియును లోకము లోనుండువారికే క్రూరమైనట్టి యీలోకమును జూపింపకుమా) అన్నట్లు వీరితోఁగూడ కలిసిమెలసి యీలోకమునం దుండుటయునుడి, "వరంహుతవహజ్వాలా పంజరాంతర్వ్యవస్థితిః" (ఈలోకమునం దుండుటకంటెను అగ్నిజ్వాలల పంజరములో వసించుట మేలు) అన్నట్లు యెంతమాత్రము సహింపరానిదై "కంగులుంపగలుంకండు యిలరియాళ్ కణ్ణనీర్ కైగళాలిరైక్క—పట్కలలిరైయుంమణివణ్ణా వెన్నుమ్ అమ్బువన్ తామ్రువనాడిక్కాణ్బన్ అయర్కుం శుత్తుం పత్తినోక్కు వెవ్వుయిర్ కొళ్ళుమ్ మెయ్ శోరుంపులోకర్ శిరిక్కనిన్నాడ" అనఁగా రేయుంబగళ్లు నిద్రాహారములులేక కన్నీరుకార్చుచు సిగ్గువిడిచి తిరునామంబుల ననుసంధించుకొనుచు, యేడ్చుచు, దండము సమర్పించుచు, శ్రమపడుచు, పాడుచు,మూర్ఛిల్లుచు, దీర్ఘముగ ఊపిరి విడుచుచు, పిచ్చివాడని లోకులు తలంచునట్లు సంచరించుచు, సుఖ,దుఃఖ, మానావమాన నిందాస్తుతి శత్రుమిత్ర లోష్ఠకాంచనముల నొక్కవిధమునఁ జూచువారై, జగత్తంతయును భగవదాత్మకమని భావించుకొని, ఒక్కవస్తువునైనను ప్రతికూలమైనట్టిదానినిగాఁ దలంపక, "సకృత్త్వదాలోకవిలోకనాశయా తృణీకృతానుత్తమభుక్తిముక్తిభిః మహాత్మభిర్మామవలోక్యతాం నయ క్షణేపితే యద్విరహోసుదుస్సహః" అనఁగా సర్వేశ్వరుని సాక్షాత్కరింపవల

యనునెడి యోగ్యతవలన, ఉత్తమములుకాని భుక్తిముక్తులను తృణీకరించి, అందువలన సర్వేశ్వరుండు తమను తనకాల మైనను విడనాడి యుండజాలనంత వానికి ప్రియులయినట్టి మహాత్ములు.

ఇట్టి వారలగు అధికారులే ఆచార్యులుగా నీచేతనులచే వరింపఁదగినట్టివారనియు, తీర్థప్రసాదస్వీకారంబులకు యోగ్యులనియు, ఈ చేతనులను కడతేర్చుటకు సమర్థులనియును నమ్మవలసినది.

— * ఈ ముగ్గురికిని మోక్షప్రాప్తివిషయమునఁగల తారతమ్యము. * —

ఈస్త్వని పేర్కొనిన ముగ్గురిలో మొదట పేర్కొనఁబడినవారు (సత్కారయోగ్యులు) జన్మాంతరముననే తప్ప ఈ జన్మమున కడతేరఁజాలరు. వారియెడల అపచారపడినవారిని సహింపఁజేయుటకు సమర్థులుగానుండుటయే వారికిఁగల యధికారము.

రెండవ యధికారి సహవాసయోగ్యుండై జ్ఞానప్రదానమువలన నితరులకు సహాయమొనర్చుచు తనయొక్క యాచార్యానుగ్రహమువలన తాను కడతేర సమర్థుండై యుజ్జీవింపఁగలఁడు. ఇదియే యీతనికిఁగల విశేషము.

మూఁడవయధికారియన్ననో, సర్వేశ్వరునికి పిరాట్టివలెనే మిక్కిలి ప్రియుండై సర్వేశ్వరుని భ్రుకుటీభటునివలెనే వశపఱచుకొని "ఏష్మేలేమ తేనే ప్పిరప్పు సుమ్మైయే తిరిధుపెత్తు సమ్మున్నె వాఁళ్ వువాయక్కినవా'' (క్రిందను పైనను ఏడేడుపురుషాంతరములవఱకు మనాతోఁ జేరినవారు శ్రియఃపతికి భక్తులైరి. ఇట్టియతిశయమును పొందినమనయొక్క శ్రీవైష్ణవసంపత్తువృద్ధి,

పొందినది)అనియు, "యెమన్ క్కుమ్ మేలెత్తు పిఱప్పాస్ వెపియా వెన్నరక త్తెన్నుమ్ శేర్ తల్ మూరినరే" (నాదాయలు క్రిందపైని యేకు పురుషాంతరములవారును క్రూరమైనట్టినరకమును పొందరు)అనియును చెప్పియున్నట్లు, తమయొక్క సంబంధముగలవారి నిన్ని ఉజ్జీవింపఁజేయుటకు సమర్థుండగును ఆచార్యుని యాశ్రయించుటయును, తీర్థ ప్రసాదంబులను స్వీకరించుటయును వాటి సంబంధమువలన తనయొక్క యవిద్యా కర్మ వాసనా రుచులు నశించి తాను ఉజ్జీవింపఁబడునని తలంపువలనను కదా!. అహంకారమును, శబ్దాదివిషయంబులనున్ను ప్రేమించి తామే నశించిపోవునట్టివారును తాటిచెట్టునీడవలెనే తాము తాము పరాధీనులై యుజ్జీవించిపోవునట్టివారున్ను ఈతని గట్టెక్కించి యుజ్జీవింపఁజేయజాలరుకదా! కావుననే "భిన్ననావాశ్రయస్త్వబ్ధో యథాపారంనగచ్ఛతి" అనఁగా అనధికారియగు ఆచార్యునితోఁ గల సంబంధము వోటిపడవమీద ప్రయాణము చేయుటవలెనే వినాశహేతువగునని చెప్పియున్నది

### —* అనధికారుల తీర్థప్రసాదాంగీకారమువలనఁ గలుగునట్టి దోషములు *—

అభిమానదూషితు లయినట్టివారి తీర్థప్రసాదాదుల నంగీకరించుట జ్ఞానమాంద్యహేతువు. ఉపాయాంతరపరుల తీర్థప్రసాదాదుల నంగీకరించుట జ్ఞానమాంద్యహేతువు. ప్రయోజనాంతరపరుల తీర్థప్రసాదాదుల నంగీకరించుట జ్ఞానమాంద్యహేతువు. ఇట్లు చెప్పియున్నందున, ప్రణవమునందుఁ జెప్పియున్నట్టి భాగవతశేషత్వ పర్యంతమగు భగవచ్ఛేషత్వము విషయమగు జ్ఞానములేక, అహంకారపరవశు లయినట్టి వారియొ

క్కయు, మధ్యమపదమందుఁ జెప్పియున్నట్టి సిద్ధోపాయాధ్య వసాయములేనట్టి యుపాయాంతరపరులయొక్కయును, చరమపదమునఁ జెప్పఁబడినట్టి యనన్యభోగ్యత్వ స్వరూపమును గుఱించిన జ్ఞానము లేనివారై, శబ్దాదివిషయప్రవణులై, పుత్రదారాద్యాసక్తులై సంసారబద్ధులగు ప్రయోజనాంతర పరులయొక్కయును, తీర్థప్రసాదములను స్వీకరించుటయు, అదిశబ్దము వలన వారితో సహవాసముఁ జేయుటయును, జ్ఞానమాంద్యమును గలుగఁజేయునవి యగుటంజేసి, యవి త్యాజ్యములని ప్రమేయరత్నమను గ్రంథమునఁ జెప్పియుండుటంజేసి, మంత్రార్థజ్ఞానానుష్ఠానహీనులై అహంకారార్థ కామపరవశులయినవారితో సహవాసమున్ను సరానుభవమున్ను దూరముగ పరిహరింప వలసినవి.

— సత్కారయోగ్యుల తీర్థప్రసాదముల నంగీకరింపనందువ అపచారము రాదినట —

అయితే సత్కారయోగ్యుల తీర్థప్రసాదంబుల నంగీకరింపక, పరిహరించినట్లయిన, తాను అధికారియను అహంకారమున్ను, అట్లు పరిహరించుటవలన వారి మనస్సుకు కష్టము కలిగెనందున దోషమున్ను సంభవింపవా యంటివేని, చెప్పెదను. వారివద్ద దోషములున్ను తనవద్ద గుణములున్ను ఉన్నవని తలంచుకొనినట్లయిన గదా! దోషము వచ్చును. అట్లు తలంపక, "వారేమిచేయుదురు అవిద్యాప్రభావంబిది" అనుకొని తనకున్నంతవఱకు సత్కరించి, ఆదోషమును వారిపై యారోపించి వారిని నిందింపక దండము సమర్పించుచు వినయముతో నడుచుకొనినట్లయిన, ఒక్కదోషమున్ను రాదా

లను. మరియు తనను సంసారులకంటెను హీనునిగాఁ దలం
చుకొని, తనకుఁగల గుణంబులకు చింతించు "అఱువుమవనతిన్న
రుశై" అన్నట్లు. సర్వేశ్వరుని నిర్హేతుక కటాక్షంబని య
నుకొనినట్లయిన, అహంకారమున్ను రాఁజాలదు. వారి మన
స్సుకు కష్టము గలుగుననుకొని వారియిష్టప్రకారమునడచుకొని
నేని, వారొక నిషిద్ధానుష్ఠానము నాచరింపుమని నియమించి
నట్లయిన. దానినిన్ని చేయవలసి వచ్చును. కావున వారు మ
నస్సు చిన్నబుచ్చుకొందు రని దానినిన్ని చేయకూడదు కదా?
కావున తనవలన వారికొక చెడుపు రాకుండ, నడచుకొనుట
యే వారికి హితంపు చేయవలసినది.

—*సహవాసయోగ్యుల తీర్థప్రసాదములవలన గుణదోషములు లేవనుట*—

సహవాసయోగ్యుల తీర్థప్రసాదములను స్వీకరించినం
దున గుణమున్ను లేదు! దోషమున్ను లేదు.

—* సదానుభవ యోగ్యుల, తీర్థప్రసాదస్వీకారము కర్తవ్యమనుట. *—

తుదని [?] పేర్కొనిన సదానుభవయోగ్యుల తీర్థప్రసాద
ములను స్వీకరించుటయే యాత్మని కుద్ధారకము [?]. ఇందులను
గురించి వర్ణాశ్రమనియమము గాని, అందులకనుగుణములగు
నడవడిక లుండవలయుననెడి నియమము కాని లేదు. అధికారి
నియమమే కావలసినది. ఈయర్థమును "పయిలుమ్ తిరువుడై
యారెవరేలుమ్" అనియు, "వానుళారరియులాగా వానవా
ర్కె పరాగిల్ పోనకమ్ శెయ్త శేడమ్ తరువరేల్ ప్పునిదమే" [?]
అనియు నీతావుల "యెటువంటి నీచవృత్తిగల వారయినను,
భగవదనుభవ సంపత్తికలవారై, ఉపాయోపేయాధికారు ల
యినట్లయిన, వారు మనకు స్వాములనియు, తీర్థప్రసాదంబుల

నంగీకరించుటకు యోగ్యులనియు, శ్రీనమ్మాళ్వారులు సాయించి యున్నారు కదా!

—* భాగవతుల మానావమానములవిషయములగు ఆక్షేపములకు సమాధానములఁ జెప్పుట *—

అయితే స్వామీ! కేవల నామరూపములను ధరించి యుండునట్టి వారి విషయమునను అవమానముఁ జేయక అనువర్తింపవలసినదియని దేవరవారానతిచ్చియుంటిరి. అయితే “ సమరకళిక్ తలనరాయ శాతి యందర్ గళేలుమ్ ” అనఁగా భాగవతాగ్రగణ్యులై బ్రాహ్మణోత్తములైనను, భాగవతాపచారపరులైనచో, వారు ఛండాలులు” అనియిట్లు శ్రీతొండరడిప్పొడియాళ్వారును, నామరూపములుగలవారైనను భాగవతాపచారమునొనర్చినచో త్రిశంకువవలెనే కర్మఛండాలులగుదురు” అని యిట్లు శ్రీపిళ్ళైలోకాచార్యులవారును, “ పూర్వాచార్యులు సాయించినట్టి యర్థములకు పూర్వాపరవిరోధములు రాకుండునట్లు విచారించి హితోపదేశముఁ జేయక, తమ మనస్సుకుఁ దోచినట్లు ఉపదేశించునట్టివారు మూర్ఖులు” అనుటచే విపరీతార్థములను బోధించునట్టి యాచార్యులనైన్ని “ వోస్త్రనెంజే మున్నవరుం పిన్నవరుం మార్కణ్డేయనవిట్టు” అనుతావున నామరూపములఁ జూచి వారు చెప్పునదంతయును నిజమనుకొని పూర్వులాచరించినట్టి యాచారము నెఱుంగనివారు చెప్పునట్టి మాటలను విని విశ్వసింపక, వారి స్వరూపస్వభావంబులను బాగుగాఁ బరిశీలించి; అజ్ఞులగు కేవలనాస్తికులను, జ్ఞానవంతులయినను అనుష్ఠానములేనట్టి యాస్తికనాస్తికులను మూర్ఖులనుగాని పరిత్యజించి, ఆస్తికులనే యాశ్రయింపవలసినదియని

యిట్లు శ్రీమణవాళ మహామునులును భాగవతనామరూపంబులు కలవారినిన్ని అవమానింపవలసినదియని తెలిపియుండుట యెట్లంటివేని, చెప్పెదను విపరీతార్థములను బోధించునట్టి దురాచార్యులనున్ను, నిషిద్ధానుష్ఠానపరులై తిరుగుచుండు భాగవతుల నున్ను అవమానింప వలసినదని చెప్పక, బహుమానింప వలసినదని చెప్పినట్లయిన, వారుబోధించునట్టి యర్థములును, వారి యనుష్ఠానములున్ను ఉపాదేయంబులని తలంచి, అజ్ఞులు వాటిని యాచరించిరేని, వినాశము సంభవించుననుకొని, చేతనుల హితమునకై, యట్టివారు సహవాసాదులకుం దగినట్టివారు కారని చెప్పినట్లు గ్రహించునది. ఇట్లు గ్రహింపక, నిషిద్ధానుష్ఠానపరులు అవమానార్హు లనుకొనినట్లయిన, "అనాచారాన్ దురాచారాన్" అనియు "మద్భక్తం శ్వపచం వాపి" అని యారంభించి "నక్షమామి కదాచన" అని యిట్లు సర్వేశ్వరుండు చెప్పినట్టి వచనంబులతో విరోధించును. రాజకుమారుని రాజు శిక్షింపవలయునే తప్ప, ఇతరు లవమానింపకూడదు కదా! వాస్తవము ఇట్లున్నను, పూర్వాచార్యులు హితోపదేశముం జేయునట్టి తమ తమ గ్రంధములయందు లోకహితముకు గాను, అందఱును అట్లు ప్రవర్తింపకుండుటకై, దుష్ప్రవర్తన గలవారినిగుఱించి ఇట్లు చెప్పియున్నారు. కావున నిది చేతను లుజ్జీవించుటకు హేతువైనదై వాని మనస్సును కష్టపెట్టుడు సరియేకదా మీఁదు మిక్కిలి సంతోషమును గలుగఁ జేయును. అయితే వారు సాయించినారని మనమున్ను అట్లే చెప్పినట్లయిన, అనేకులు మాయాబలమువలన బద్ధసంసారు

లై, అర్థకామపరవశులై, దుర్విషయప్రవణులై, విపరీతాచారము గలవారైయున్నందున, అపచారమువచ్చును. కేవలసంసారులకు వారియందుదోషము కానవచ్చినను, వారిని నిందింపకూడదు. అయితే యది తనదోషమేయని తలంపవలయునని చెప్పియుండఁగా, సదాచార్యసంబంధమును, నామరూపములును, ఆళ్వారులప్రబంధజ్ఞానమున్ను ఉన్నట్టివారియందు దోషంబులున్నను, మూర్ఖులని తలంచి వారిని యవమానింపకూడదు. కావుననే «విష్ణుళార్ పెరుమాళ్కడిమై శెయ్‌వార్గళుక్కు శెరుమైంపులనిత్తై నప్పాళ్ళిక్కు పెత్తాలెన్ శెయ్యా" అనియు «అన్నము తెసట్టి యోగైవర్ యావర్రైయుం మయక్కి నీవైత్త యున్నమాయం" అనియు, «తుయక్కరుమతియిల్ నఘానస్థ శమరైత్తు యక్కుమయక్కుమై మాస్మోగళ్" అనియును సాయించినట్లు అప్రతిజ్ఞానులను నిత్యసూరులనున్ను మోహింపజేయునట్టి మాయయొక్క ప్రభావమని తలంచి, వినగోరినట్లయిన, హితముఁ జెప్పునది. లేనట్లయిన «అయ్యో!" అనుకొని, దుఃఖపడి విడిచిపెట్టి స్వశక్త్యనుసారము సత్కరించి వినయముతో నొక దండము సమర్పించి, వారితో సహవాసము గాని వారి తిరస్కారమును గాని చేయక. స్వైచ్ఛ్యమును తెలుపునట్టి సంభాషణములవలన వారిని సంతోషింపఁజేసి దూరముగా నుండవలసినది.

*గృహస్థాధికారి లౌకికసంగ్రహార్థము కర్మంబుల నాచరింపవలయును*

స్వామీ! ఉపాయాంతరముల నన్నింటిని వాసనతో గూడ, పాతకంబులను విడనాడినట్లు, వాటివాటి యంగోపాంగములలోని సంగతిని నిశ్శేషముగ విడనాడవలసినది యని

చెప్పియుండఁగా, లోకహితమునకై కొన్నింటి నాచరింప వలయునని చెప్పినారే! అంటివేని, చెప్పెదను. పరమైకాంతులై పరిపూర్ణముగ ప్రపత్త్యధికారులై తిరుక్కణ్ణమంగై యాం డానువలెనే స్వవ్యాపారంబుల నన్నింటిని బొత్తుగ విడనాడి నట్టియున, అట్టివాని విషయమున లోకాపవాదమున్ను రాదు శాస్త్రవిరోధమున్ను రాదు భగవన్నిగ్రహమున్ను కలుగదు

అయితే యాతండు దృప్తుండై దేహమును సహించి యుండి, స్త్రీలను, అన్నపానాదులను ప్రేమించియుండువాఁడగు టంజేసి, లోకాపవాదము మొదలుగాఁగలమూఁడు అనర్థము లున్ను సంభవింప గలవు.

అయితే వేఱొక్కదానిని సహింపనిదియగు సిద్ధోపా యము ఫలము నిచ్చుటలో నివి ప్రతిబంధకములు కావా? అని యడిగితివేని, చెప్పెదను. సిద్ధోపాయము ఉపాయదశయందు వేఱొక్కదానితో సంబంధమును సహింపనిదై, ఉపేయదశ యందు వేఱొక్కదానితో సంబంధమును సహించునట్టిదా! ప్రాపకదశయందు ప్రాపకాంతరమును పరిత్యజించునట్లు, ప్రా ప్యదశయందును ప్రాప్యాంతరమును పరిత్యజింపవలసియుండ, శ్రీ మన్నాధమునులు, శ్రీ యామునాచార్యులవారు, శ్రీరామాను జాచార్యులవారు, కూరత్తాళ్వారులు భట్టరు మొదలయినవా రివలెనే ప్రాప్యాంతరైకదేశములగు దారాపుత్రాదిసంబంధ ములను, (మీరు) పరిత్యజించియుండలేదే! శక్యమైన ప్రాతికూల్యం బులనన్నింటిని నిశ్శేషముగ విడనాడిన వారలగు పూర్వాచా ర్యులందఱును ఉచితకర్మంబు లన్నింటివిషయమునను మోక్షో పాయమనెడితలంపును బొత్తుగ వదలి, ఇవియును అవశ్యముగ ఆ

చరింపవలసినవియనుకొని, "కుర్యాద్విద్వాం స్తథాసక్తః చికీర్షుర్లోక సంగ్రహం" అన్నట్లు భగవంతుని కిష్టమైనందున, విరుద్ధంబులని నిశ్శేషముగ విడిచినట్లయిన, పిరికివారి అజ్ఞులును కొందఱు వాటిని పరిత్యజించియు, మరికొందఱు పరిహసించియును నశించుదురని పరులహితమునకై లోకసంగ్రహార్థము తగినట్లు ఆచరించినారు కదా! తమ కవి హితంబులనియు, రక్షకములనియు నిట్టితలంపులేక, లోకహితముకై యాచరించినట్లయిన, "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అన్నట్లు సర్వేశ్వరుడు విడిపింపబోవునట్టి పాపంబులలో చేరిపోవును గాని, అవి యీతనికి ప్రతికూలంబులు కాజాలవు. ఈ యర్థమును "నోఱ్ఱ నోన్బిలేన్" అను తిరువాయ్మొழி యందు "తేఱుఞానత్తర్ వేదవేళ్వియరాచ్చిరీవరమంగలనగర్" అను తావున శ్రీనమ్మాళ్వారులు సాయించియున్నారు. ఈ తావున "తేఱుఞానత్తర్" అనగా నిర్మలమైన జ్ఞానముకలవారు. అనగా అనుష్ఠాన అననుష్ఠానంబులగు విహిత నిషిద్ధంబులను సమముగా వికల్పింపదగినట్టి తెలివితేటలు కలవారు. అనగా అనుష్ఠానము సాధనముకానిదై నిషిద్ధాచరణము మనకు రక్షకముకాదని తలంచియుండునట్లు, విహితాచరణమున్ను మనకు రక్షకముకాదని తెలిసికొనియుండువారనుట.

* లోకసంగ్రహార్థ మనుష్ఠించినకర్మలు చిత్తశుద్ధియందుపయోగపడుట. *

అయితే వాటినేల యనుష్ఠింపవలయునంటివేని, చెప్పెదను. అనుష్ఠింపవలయుననెడి యపేక్షలేనట్టి యధికారులును లోకసంగ్రహార్థము అనుష్ఠింపవలసినదియనెడి భగవదాజ్ఞ నను

వర్తించుచున్నారు. అయితే నిషిద్ధానుష్ఠానము రజస్తమో గుణంబులను వృద్ధిపఱచునట్లు, ఈ విహితానుష్ఠానమున్ను సత్త్వగుణమును వృద్ధిపొందింపగలదు. "తాను చేయునుపాయమందున, ఒకదానినిన్ని చేయక యుండజాలరు కదా! "సత్త్వాత్సంజాయతే జ్ఞానం" అన్నట్లు సత్త్వగుణము జ్ఞానముం గలుగం జేయునుగాన, విహితకర్మము ననుష్ఠింపవలసినదని శ్రీ నంబిళ్ళై గారు సాయించినారని వడక్కుత్తిరువీథిపిళ్ళైగారు ఈయుముప్పత్తారాయిరప్పడి వ్యాఖ్యానమున సాయించియున్నారు కదా!

— * ఫలాపేక్షలేక, యనుష్ఠింపఁబడినట్టికర్మములు భగవంతునికిన్ని తుష్టంబులనుట. * —

"చిత్తశ్లోకసంగ్రహం" అనుతావున చెప్పఁబడినట్టి యీశ్వరాజ్ఞయనునది ఫలాపేక్ష యెంతమాత్రములేని యనన్య ప్రయోజనుండయినట్టి యుపాయాంతరనిష్ఠునికిగాను చెప్పఁబడినదే కాని, వేదోక్తసాధనము నెంతమాత్ర మవలంబింపనట్టి సిద్ధోపాయనిష్ఠుడు అనుష్ఠించినచో, భగవంతుని కిష్టమగునా? యంటివేని, చెప్పెదను ఈయర్థమును ఈ తిరువాయ్మొழிయందు "శెంతొழிలవర్ వేదవేళ్విః" అనుతావున శ్రీనమ్మాళ్వారులు సాయించియున్నారు. "శెంతొழிలవర్" అనఁగా "నాకదివ్యనికేతియున్నాను" అని చెప్పినవారు. అనఁగా—తాము చేయునట్టికర్మమునకు వేదోక్తఫలము నపేక్షింపక, సర్వేశ్వరుని సంతోషింపఁజేయుటనే ఫలమునుగాఁ దలంచి, కైంకర్యబుద్ధితో జేసెడునట్టి వారనుట. వానికి లక్షణమెట్టిదో, వీరికి కైంకర్యమున్ను అట్టిది. అనఁగా వారుచేయునట్టి జగద్రక్షణము స్వలాభమునకై కాకుండ, రక్షకత్వస్వరూ

పము కనుగుణమైనట్లు, ఈచేతనుండు భగవదాజ్ఞా ప్రకారము అనుష్ఠించునట్టి వైదికకర్మంబులు శేషత్వస్వరూపము కనుగుణంబులై స్వలాభమునకు కానివియై యుండకలవు. ఇట్లు అర్థము చేసికొనకపోయినచో, వ్యర్థమగును. కావున, శెంతొ శీలవర్=మంచివ్యాపారముగలవారు" అనఁగా అనన్యప్రయోజనులనికాని, జ్ఞానముగల వృత్తివిశేషములు కలవారనికాని యర్థము. ఇట్టివారి వేదాధ్యయనరూపములగు వేదఘోషంబులును, వైదికక్రియా కోలాహలంబులును ఎడతెగకుండ జరుగుగాక! వీటియందు ప్రాప్యవిరోధిగాని, ప్రాపకవిరోధిగాని, నందున పిరాట్టులతో నాలింగనమువలె నివి సర్వేశ్వరుని కెక్కువయిష్టములయినవిగా నుండును. ప్రాప్యవిరోధి యనఁగా — ఐహిక పారలౌకిక ఐశ్వర్యములను ఫలములనుగాఁగాని, ఆత్మఫలమునకు సాధనములనుగాఁదలంచి యనుష్ఠించుట. ప్రాపకవిరోధి యనఁగా—భగవత్ప్రాప్తికి ఇవి సాధనంబులనెడి తలంపుతో ననుష్ఠించుట. ఈ రెండు విధములయినట్టి తలంపులున్నూ లేకుండ వానిని సంతోషింపఁజేయుటకైయే యొనర్పఁబడినపైనందున "అకలకిల్లేన్ ఇఱైయుమ్" క్షణకాలమైనను నిన్నువిడిచియుండఁగాలను) అని సాయించినట్లు, పిరాట్టుల యాలింగనమువలెనే వానికి భోగ్యముగా నుండుననుట.

వీటిని దృప్తాధికారి ఉపాయంబులనెడి తలంపుతోననుష్ఠింప కూడదనియు, లోకహితముకై యనుష్ఠింప వలయునని యును శాస్త్రశాసనముగ గ్రంథములయందుఁ జెప్పియున్నారు కదా! నిశ్శేషముగ త్యజింపవలసినదియని "వేఱుముతల్మాయ్ త్తు" అనుతావునఁ జెప్పియున్నట్టి అహంకార, మమకార

కామ, క్రోధ, లోభ, మోహాదులను విడువకుండ తిరుగుచున్నామనుకొని భయపడనివారు అధికారిభేదమునుబట్టి యభిప్రాయభేదమువలన ఉచితంబులయినట్టి కృత్యంబులకు భయపడవలయునా?

—*ఆర్తాధికారులు సర్వధర్మపరిత్యాగము జేయవచ్చుననుట.*—

"కాలాళుమ్ నెంజళియుమ్" అన్నట్లు భక్తిపారవశ్యమువలన ఇంద్రియములు శిథిలములయినవారై ఒక్కదానిని క్రమముగ ననుష్ఠింపజాలనివారై "ఎన్నానే శెయ్ కేనే" (నేను ఏమి చేయగలను) అనుచు పరవశులయినట్టి యధికారులుమాత్రము సర్వకర్మములనుత్యజింపవలయుననియే సిద్ధాంతము. దృప్తుండును, మందుండునైన యధికారి ఆర్తునివలె నన్నింటిని విడనాడినట్లయిన, అనర్థము సంభవించుననుట పూర్వాచార్యులందరియొక్కయును అభిప్రాయము. ఈ విషయము రహస్యగ్రంథములయందన్నింటియందును చెప్పబడినది. అధికారులకుభయులకును వారి వారి యధికారానుగుణముగ ప్రారబ్ధకర్మానుభవమున భేదమున్నట్లు, అనుష్ఠానమునందును భేదము కలదు. అదియెట్లనిన, "ఆర్తస్య సద్యో ముక్తిస్స్యాత్ ఏతద్దేహవిమోచనాత్" అనుతావున, ఆర్తునికి అన్ని కర్మంబులును వెంటనే విడిచిపోయి, ఈదేహావసానముననే మోక్షము కలుగుననియు, "దృప్తానామపి జంతూనాం దేహాంతరనివారిణీ" అనుతావున దృప్తునికి అభ్యుపగప్రారబ్ధకర్మము ననుభవించిన పిమ్మట దేహాంతరమున ఫలముగలుగుననియును చెప్పియున్నది కదా! అట్లే అధికారానుగుణముగ అనుష్ఠానభేదమున్ను కలదని యంగీకరింప వలయును.

వర్తించినట్లైనయున, స్వాచార్యుని దివ్యమంగళ విగ్రహమును ధ్యానించుకొనుచు, గురుపరంపరానుసంధాన పూర్వకముగ ద్వయముననుసంధించుకొనుచు, వినయముతో ప్రసాదించుట స్వరూపానుగుణమైనది. తక్కువవారికి స్వాచార్యతీర్థము నొసంగుటయే యుచితము

—* శ్రీపాదతీర్థమును సాయించుట గ్రాహ్యము. *—

ఈ తీర్థమును జాత్యభిమానములేనివారై విలక్షణవంశమున జన్మించినట్టి శ్రీవైష్ణవుల సన్నిధిలో నంగీకరించుటయే యుచితము "తస్మైదేయం తతోగ్రాహ్యం" అనియు, "తెలవరేల్ పునితమన్నే" అనియును చెప్పియున్నట్లు. అట్టివారి సన్నిధిలో స్వీకరించినట్టి తీర్థమే గ్రాహ్యమును. పవిత్రమును, ఈతని జాత్యద్యపకర్షతను పోగొట్టునదియునునై యుజ్జీవింపజేయగలదు తక్కువవారి శ్రీపాదతీర్థము జాత్యుచితంబులగు కర్మముల వలెనే సామాన్యమైనదిగా నుండును.

*తక్కువజాతివారైనను, జ్ఞానాధికులయినట్లయిన, ఆదరణీయులగుట.*

అయితే గొప్పకులమునఁ బుట్టినవారు జ్ఞానాధికులయినప్పటికిన్ని, భ్రమహేతువున్ను, భ్రంశసంభావనయున్ను ఉండుటంజేసి, తక్కువజాతి వైష్ణవులనియు, "శ్వపచోపిమహీపాల విష్ణుభక్తోద్విజాధికః" అనియు "భక్తిరష్టవిధా హ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేపివర్తతే సవిప్రేంద్రో మునిః శ్రీమాన్ సయతిస్సచపండితః" అనియు నీతావుల చండాలురైనను, భగవద్భక్తులయినట్లయిన, బ్రాహ్మణులకంటెను ఎక్కువవారనియు, శ్రీమంతులనియు, యతులనియు, పండితులనియును చెప్పి, వర్ణాశ్రమాచారంబుల నాచరించుచు, అహంకార రహితములగు జన్మవృత్తాం

బులు గలవారై భగవద్భక్తులయిన విలక్షణులే పూజ్యులనియు, ఉపదేశాదులనున్ను శ్రీపాద తీర్థాదులనున్ను, కోరినట్లయిన, వారికే ఇయ్యవలసినదనియు, కృపతో వారే ప్రసాదించి నట్లయిన స్వీకరింపవలయుననియు, నీ భగవంతుని యభిప్రాయంబని వ్యాసాదిమహర్షులును "పయిలుం తిరువుడైయార్ మెవరేలు మవర్ కండీర్" అనియు, "తలవరేల్ పునిదం" అనియు సాత్త్వుల ఆళ్వారులును అట్టివారి తీర్థప్రసాదంబులే పవిత్రంబులని చెప్పియున్నారు కదా!

తక్కువజాతివారు ఉద్దేశ్యులయినట్లయిన, వారి నడవడికలున్ను ఉద్దేశ్యంబులు కావా? అట్లయిన, శాస్త్రవిరోధమును, స్వరూపవిరోధమును, ఉపాయోపేయాధికార భ్రంశమున్ను ప్రసక్తించునే? దీని యభిప్రాయముం దెలుపుడనియడిగిరి. అంతట అప్పగారిట్లు సాయించిరి:—అనువర్తింపవలసినవారుగాను చెప్పఁబడినట్టి యధికారులు. "భక్తిరష్టవిధాహ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేపి వర్తతే" అనియు, "పయిలుమ్ తిరువుడయారెవరేలుమ్" అనియు సాత్త్వులు, తక్కువకులమునందు జన్మించినవారయినను, "మద్భక్తజనవాత్సల్యం" అని యారంభించి చెప్పఁబడినట్టి యెనిమిదివిధములగు భక్తులను, భగవదనుభవసంపత్తినిన్ని లభించియున్నట్టివారగు తిరుప్పాణాళ్వారులు, మారనేర్నంబి, తిరుక్కచ్చినంబి, విళాంజోలైప్పిళ్ళై మొదలగువారిని నమస్కరించుకొనునట్లు, లోకయాత్రనున్ను సంసారసంబంధమునున్ను బంధుసంగమమునున్ను పరిత్యజించి, స్వరూపవిరుద్ధంబులును, సత్త్వగుణవినాశకములును, రజస్తమోగుణోపోద్బలకములునగు నిషిద్ధాచారములను బొత్తిగ వదలి, ఇంతకుముం

డు పేర్కొనినవారివలెనే స్వామురచి భక్తిపారవశ్యమువలన
సంచరించునట్టి యధికారులు " ఏకాంతీ వ్యపదేష్టవ్యో నైవ
గ్రామకులాదిభిః విష్ణునా వ్యపదేష్టవ్యః తస్య సర్వం స ఏవహి "
అన్నట్లు గ్రామకులాదులనుబట్టి వ్యవహరింపఁబడక, వర్ణాశ్ర
మంబుల నన్నింటిని అతిక్రమించినవారై పరమవిలక్షణులై
తిరుగుచుందురే కాని, తమకుగా నొక నికృష్టవర్ణమునున్న
తదనుగుణమగు నిషిద్ధవ్యాపారమునున్న పెట్టుకొని తిరు
గుచుందురా? అట్లు తిరుగుచుండువారయినట్లయిన, వారు
ఉద్దేశ్యులగుదురా? దాస్యానుగుణముగ అహంకారరహితము
గు జన్మమును, దాస్యకృత్యంబులగు నిరహంకార కృత్యంబుల
నున్న కలిగియుండువారగు పరమవిలక్షణులు గదా ఉద్దేశ్యులని
చెప్పియున్నది? ఇట్టి యధికారులు లెచ్చటనైన నొకరున్నట్లు
యిన, ఉద్దేశ్యులని చెప్పుదురే కాని, అహంకారార్థకామప
రవశులగు మూర్ఖులందఱును, ఖ్యాతిగాను, స్వలాభమునకుగా
ను, గౌరవమునకుగాను, అనువర్తనమునకుగాను తలగొరిగించు
కొని, వైష్ణవుల కుండవలసిన నామరూపములను ధరించుకొని,
మామూలుప్రకారము నిషిద్ధానుష్ఠానపరులై, ఒడ్డసంసారులై
తిరుగుచు, అహంకారరహితులై యుండక, మేమే కదా విలక్ష
ణులైన వైష్ణవులమని యహంకారపడి ప్రవర్తించుచు, సామా
న్యవిశేషశాస్త్రములను రెంటినిన్ని యతిక్రమించి ప్రవర్తించు
నట్టి ఉభయభ్రష్టులయినవారిని ఆశ్రయింపవలసినదని యెవ్వ
రైన చెప్పినారా? వంచనకుగానైనను నామరూపములను ధరిం
చియుందురు గాన, అందుల కనుగుణముగ సత్కరించి వారి
ని నిందింపక, సత్వగుణసంపన్నులై, పరమవిలక్షణులై, నైచ్యా

నుసంధానపరులై, అహంకారరహితులై, పరమాత్మైకలై "యః పశ్యతి శుభాచారం వైష్ణవం వీతకల్మషం యస్మిన్ కస్మిన్ కులే జాతం ప్రణమేద్దండవద్భువి" అన్నట్లు సదనుష్ఠానసంపన్నులై కల్మషరహితులగు వైష్ణవులు, కుంపటిలో తామరపువ్వు పూసినట్లు, అజ్ఞానభూయిష్ఠమగు ఈ విభూతియందు యెవ్వరయిన నొక్కరున్నట్లయిన, "ఆహ్లాదశీతనేత్రాంబుః పులకీకృతగాత్రవాన్ సదాపరగుణావిష్టో ద్రష్టవ్యస్సర్వదేహిభిః" (భగవదనుభవానందమువలన ఆనందబాష్పంబులను విడుచుచు, పులకాంకురములు గలవారై గుణానుభవనిరతులగు శ్రీవైష్ణవులు అందరి చేతను సేవింపదగినవారు) అన్నట్లు అట్టివారికి, వారి కులముయొక్క హేయత్వమును గమనింపక, సాష్టాంగముగ దండము సమర్పించి, "విప్రాద్ద్విషడ్గుణయుతాదరవిందనాభపాదారవిందవిముఖాచ్ఛ్వపచం వరిష్ఠం మన్యేతదర్పితమనోవచనేహితార్థప్రాణః పునాతి సకులం న తు భూరిమానః" అష్టగుణగరిష్ఠుండై భగవద్విముఖుండైన బ్రాహ్మణునికంటెను శ్వపచుని శ్రేష్ఠునిగాఁ దలంచెదను మనోవాక్కాయములను అర్థప్రాణములనున్ను భగవంతునికై వినియోగపరచునట్టివాడు సర్వమును పవిత్రముచేయునే కాని, యెక్కువ అహంకారము కలవాఁడు అట్లు చేయజాలడు) అన్నట్లు వారు తమ స్పర్శమువలన నందఱిని పవిత్రులనుగాఁ జేయునట్టివారని తలంచి వారిని ఆశ్రయించినట్లయిన, ఒక్క విరోధమున్ను సంభవింపదు. భగవంతుండును సంతోషించును. ఈ చేతనుండును ఉజ్జీవించును.

* ఈవిషయమును మతాంతరులును వొప్పుకొనియున్నారనుట. *

జ్ఞానాధికులు హీనకులమున జన్మించినవారైనను ఆదరింపవలసినవారను విషయమును శ్రీశంకరాచార్యులవారు, భాస్కరాచార్యులవారు, యాదవప్రకాశులు మొదలగు మతాంతరులును అంగీకరించియున్నారు కదా!

అది యెట్లనిన. "జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటతరా యాసంవిదుజ్జృంభతే యాబ్రహ్మాదిపిపీలికాంతతనుషు ప్రోతాజగత్సాక్షిణీ సైవాహం నచదృశ్యవస్త్వితి దృఢప్రజ్ఞాపి యస్యాస్తిచేత్ చండాలోస్తు సతుద్విజోస్తు గురురిత్యేషా మనీషా మమ" అను తావున తను మతవిషయమగు జ్ఞానముకలవారగు చండాలురైనను బ్రాహ్మణులైనను గౌరవింపవలసినవారని చెప్పియున్నారు కదా?

కావున భగవంతుని విషయమున జ్ఞానభక్తులు సంపూర్ణముగాఁ గలవారు "పరమాత్మని యోరక్తః విరక్తో౽పరమాత్మని" అన్నట్లు భగవదితరములగు వస్తువులయందు వైరాగ్యముకల యధికారులనే యనువర్తించినట్లయిన, సర్వసమ్మతమై యుండును. "సచపూజ్యోయథాహ్యహమ్" (నావలెనే అతండు పూజనీయుడు) అనియు, "శేయమాయడుమైత్తలైనిన్నాక్కోతిలడియారై సిక్కమిల్లా వడియార్ తమ్మడియార్ అడియారెంకోక్కళిదాస్ కుడికళ్ వన్దవర్ వల్లకోటూన్డే వాయ్క్కతమైయేర్కే" (దాస్యములో శ్రేష్ఠులు. నిర్దోషులయినదాసులు. ఎడబాయని దాసులు. వారిదాసులు. వారిదాసులు మాకు స్వాములు. అట్టివారివంశముననే యవతరించి మంచికట్టుబట్టుముకలవారు మాకు మెక్కువయిష్టులు) అనియు "తిడంకొళ్ జ్ఞాన

చరమపర్వ విషయములగు జ్ఞానభ్రష్టులు మొదటికే లేకుండ పోవుదుగాన అట్లు చెప్పఁదగదు.

అయితే జన్మము అనఁగా పూర్వజన్మమున నని యర్థము చేసికొనవలయునంటివేని, వాస్తవమే, "అసన్నేవ" అనియు "అత్తునాన్ పిఱన్దిలేన్" అనియు "పం[illegible]లం" అనియు సీతావుల సర్వేశ్వరుని యాశ్రయించిన తరువాతి కాలమును వేఱొక్క జన్మమునుగాను కదా ఆళ్వారులు తెలిపియున్నారు

— * కపటవేషధారులగు వైష్ణవులు ఉద్దేశ్యులు కారనుట. * —

ఇవ్విధమున ఈ యర్థమును గ్రహింపక "మేనియత్ వాకనిన్ఱోర్" (పనడవడికగలవారుగానుండిరో) అనుటచే ఆచార్యుని యాశ్రయించిన పిమ్మటనున్న గుర్వ్రాదిగలవారు ఉద్దేశ్యులనిన ట్లయిన, సర్వప్రమాణములును విరోధించును. సర్వానిష్టములును సమకూడును. శిష్టులందఱును నిందింతురు. శిష్టాచారముతో విరోధించును. స్వరూపము నశించిపోవును. అట్లయిన, అర్థకామములకై భగవన్నామసూత్రములను ధరించిన వారై "ఎంబెరుమానార్ తిరువడిగళే శరణం" అని పైకిమాత్రము చెప్పుచు, అహంకారాదులమూలముగ భాగవతాపచారపరులై రూపుమాసి పోవుటకు సిద్ధముగానున్నట్టి కర్మఛండాలులను ఉద్దేశ్యులనుగాఁ గొనవలసివచ్చును.

— * శ్రీరామానుజభక్తులయందు నిషిద్ధానుష్ఠానముండదనుట. * —

"మేతియల్" (పనడవడిక) అన్నప్పుడు ఒక్కనిషిద్ధవ్యాపారమున్ను కూడదని చెప్పరాదే! యంటివేని, జితేంద్రియాగ్రేసరులై, శుద్ధసత్వసంపన్నులై, సాంసారికదుష్కర్మగంధరహితులై, పరమవిలక్షణులగు శ్రీరామానుజులవారిని ఆశ్రే

యుంచి వారి యభిప్రాయము నెఱింగి, వారి యభిమానము
లోనుండి యున్నట్టి చరమపర్వనిష్ఠులు విషయాసక్తచిత్తులు
గానుందురా? రజస్తమోగుణ ప్రధానులుగానుందురా? అహం
కారవంతులుగా నుందురా? దారాపుత్రాదులను విడనాడ
కుండ బద్ధసంసారులుగా నుందురా? అర్థార్జనాదితత్పరులై సే
వింపకూడనివారి సేవసేయుచుందురా? అవిలక్షణకృత్యముల
గు నిషిద్ధానుష్ఠానంబుల నాచరించుచుందురా? ఈ నిషిద్ధకృత్య
ములలో, చరమపర్వనిష్ఠులకు ఆచార్యుని యాశ్రయించిన పి
మ్మట "పతియల్ వాకసప్పర్" (ఎవ్విధమైన నడవడికగలవారు)
అనుటకుఁ దగినట్టి నిషిద్ధానుష్ఠానమెద్దియో నాకు తెలి
యను మీరే చెప్పుఁడీ యనియడిగిరి.

అంతట వారేమిన్ని జవాబుచెప్పజాలక, స్వామీ!
దేవరవారెంత చెప్పినను, ఇంకను అకేమనస్సుకు వచ్చుచున్నది.
కొందఱు జ్ఞానాధికులై, వైరాగ్యవంతులైయున్నను, జన్మాభి
మాన నివృత్తికి సహకారియని చరమశ్లోకమునఁ జెప్పఁబడిన
సర్వధర్మపరిత్యాగమునకు "అహంసహస్ర ధ్యాముపాసీత" అను
తావునఁ జెప్పఁబడినట్టి యంగములతోఁగూడ శాస్త్రవిహితం
బులగు ధర్మములతోఁబాటు, "నకింజంభతమేత్" ఇత్యా
ది నివృత్తిరూప ధర్మములును త్యాజ్యంబులగటంజేసి, వా
టిని త్యజించుటకుగాను నిషిద్ధానుష్ఠాన మావశ్యకమని చెప్ప
చు, "చరేదవిధినోదరః" అన్నట్లు భగవంతునికి ప్రపత్తిచేసి
నవారు శాస్త్రవశ్యులుకానివారై ప్రవర్తింపవలసినది యని
నిషిద్ధానుష్ఠానము నాచరించుటను పెద్దగాఁ దెలుపుచున్నారు.
అందులకు హేతువేదియో తెలుపఁగోరెదమనిరి.

—* జాత్యభిమానము అవిద్యామూలకమగుట *—

అంతట అప్పాగారిట్లు ప్రత్యుత్తర మిచ్చిరి. ఇందుల కుఁ గారణము నిరంకుశ స్వతంత్రుండగు సర్వేశ్వరునియొక్క లీలారసమగు అవిద్య యని చెప్పఁగునది. అది యెట్లనిన, జాత్యభిమానమునున్ను, దాని పరిహారమునున్ను శ్రీ తొండరడిప్పొడియాళ్వారులు “ప్పుతిలావొడికలాత్తు’’ అను పాశురమునఁ దెలిపియున్నారు. జాత్యభిమానమనఁగా—వంశపరంపరనుబట్టిచూచితే మేము ఉత్కృష్టులముగానున్నాము, వేద శాస్త్రములఁ జదివియున్నాము, వాటి యర్థముఁ జెప్పఁగలము అని యివ్విధములగు అభిజన, విద్యా, వృత్తములనబట్టి గర్వపడుట. పరిహారమేమనఁగా— “ఇళ్ళకులత్తవర్కళేలుమెమ్మడియార్కళాకిల్ తొழுమినీర్ కొడిమినాకొళ్మిన్’’ ఎంత తక్కువ జాతివారయినను, భగవద్భక్తులయినట్లయిన, వారికి దండము పెట్టవలసినది. వారికి యర్థములను తెలుపునది. వారి వద్దనుండి తెలిసికొనుచుండు అనుతావున జాత్యభిమానశూన్యులును, విలక్షణజన్మములగల వైష్ణవుల నాశ్రయించునది యని స్పష్టముగాఁ దెలిపినపిమ్మటనున్ను, అనుపముక్కకుగాను మణిని కృత్రిమము మేడను తగలబెట్టువారివలెనే అహంకారనివృత్తికి గాను స్వరూపవిరుద్ధములగు కృత్యంబుల నాచరించుట. భగవదనుగ్రహమువలన గలుగవలసినట్టి జాత్యభిమాన నివృత్తి యనునది పరదారాపరిగ్రహ, అభక్ష్యభక్షణాది నిషిద్ధానుష్ఠానమువలన సిద్ధించునని భ్రమించి, కైంకర్యముకై ప్రయత్నించుటనుతప్ప, వేఱొక్క స్వప్రయత్నమును దేనినిన్ని సహింపని భగవదత్యంత పారతంత్ర్యస్వరూపముతో నను

కూలింపనివియై ఉపాయోపేయ విరోధులునగు పరహింస,
పరదారాపరిగ్రహ, అపేయపాన, అభక్ష్యభక్షణాదుల నొనర్చు
టయునువి రాక్షసకృత్యమగుటం జేసి, భగవంతుని లీలకుగా
నేర్పడినదియగు అవిద్యయొక్క కృత్యమని యెఱుంగునది.

—* "స్వధర్మాన్ పరిత్యజ్య" అను దానియర్థమును విశదపరచుట. *—

ఇఁక, నివృత్తిరూప ధర్మత్యాగంబునకుఁ గావలసినది
యని చెప్పినదానికి పరిహారమును ఇంతకుముందు చెప్పియే
యున్నాము. ఐనను మరల చెప్పెదము. యెక్కడనైన నొ
క్కతావునన్నైనను, యెవ్వరైన నొక్కరైనను, ధర్మత్యాగము
నకుగాను నిషిద్ధధర్మానుష్ఠాన మావశ్యకమని చెప్పియుండ
లేదే! ప్రసత్త్యనుష్ఠానమును వివరించి చెప్పినట్టి తావుల "ఉ
పాయాపాయనిర్ముక్తా మధ్యమాం స్థితిమాస్థితా" అనఁగా ఉ
పాయాపాయ రహితమై మధ్యస్థముగా నుండునదియనియు,
"ఉపాయాపాయసంయోగే నిష్ఠయాహీయతేనయా" అనఁగా
ఉపాయాపాయంబులు రెండును చేరినట్లయిన, ఇట్టి నిష్ఠ చెడి
పోవుననియును, అందులకై ప్రాయశ్చిత్తము చేసికొనవలయు
ననియును చెప్పియున్నారే కాని, అపాయమగు నిషిద్ధానుష్ఠా
నము భగవంతుని కిష్టమనియు, అది ప్రపత్తికి కావలసినది
యనియు, ప్రపన్నునిచే నవశ్యముగా నాచరింప వలసినదని
యును చెప్పియుండలేదు. కావున వారు చెప్పినది సామాన్య
విశేష శాస్త్రములకన్నింటికి విరుద్ధమైనది. శిష్టులచే నిందింపఁ
బడినది భగవంతుని కయిష్టమైనది. "ఆశాపాశశతైర్బద్ధాః కా
మక్రోధపరాయణాః ఈహన్తే కామభోగార్థమ్ అన్యాయేనార్థ
సంచయాన్" అనియు, "అనేకచిత్తవిభ్రాన్తాః మోహజాల

సమావృతాః। ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ"
అనియును చెప్పియున్నట్లు, కామక్రోధ పరాయణులై, యదియే
పరమార్థమని మాయామోహితులై యాచరించునట్టి వారయిన
ట్లయిన, భగవన్నిగ్రహపాత్రులై పోవుదురు. కావున శబ్దశక్తి
వాటిఁజూపించినను, వాటికంటెనున్న వేఱయినవియగు ప్ర
వృత్తిరూప ధర్మములే త్యాజ్యంబులని యంగీకరింప వలసినది.
ఒకవేళ శబ్దశక్తి నివృత్తిరూప ధర్మములను చూపించినను, పరి
హరింప వలసినదేమున్నది! బాధకమైనది యెద్దియైన నున్న
చో కదా పరిహరింపవలసియుండును! తిరుమంత్రమునందుండు
"నార" పదము "బ్రాహ్మ్యమండంతదంతస్థాః లోకాశ్చస
చరాచరాః। ఏవమండాన్యనంతాని తత్సర్వం నారముచ్యతే"
(బ్రహ్మాండమును దానిలోకములును వాటిలోనుండు చరాచర
పదార్థములును ఇఁకను అనంతములగు అండములును ఇవియ
న్నియును నార మనఁబడుచున్నవి) అన్నట్లు భగవద్వ్యతిరిక్త
ములగు సమస్త పదార్థములను తెలుపుచున్నను, తత్పురుష
సమాసమున ఉపాయోపేయభావములను చెప్పునప్పుడు, అవి
యచేతనములకు కావలసినవి కానందున, వాటిని తప్పించి చేత
నులను తెలుపునట్టిదానినిగాఁ గొనినట్లును, బహువ్రీహిసమాస
మున ఆత్మాశ్రయదోషమును అనవస్థయును సంభవించునని గు
ణంబులనువిడిచి వాటిలోతప్ప తక్కినవాటిలోనే యంతర్యామి
త్వమును చెప్పుటకై గుణములనుతప్ప తక్కినవాటిఁ దెలుపు
నట్టిదానినిగాఁ గొనినట్లును, స్వరూపోపాయవిరోధులగు అనేక
దోషంబులు సంభవించుటంజేసి, నివృత్తిరూపధర్మములకంటె

ఇఁక, "చరేదవిధి గోచరః" (విష్ణుభక్తుండు విధి నిషే
ధములకు వశ్యుండు కాకుండ ప్రవర్తించునది) అను దాని
యభిప్రాయ మేమంటివేని, తెలిపెదను "జ్ఞానవైరాగ్య సంప
న్నో విష్ణుభక్తో విశేషతః సలింగో నాశ్రమాంస్త్యక్త్వా చరేదవిధి
గోచరః" అనఁగా జ్ఞానవైరాగ్యసంపన్నుఁడై విశేషముగ పర
భక్తి మొదలు పరమభక్తివరకును పరిపూర్ణమైనట్టి భక్తి
గల యధికారి భక్తిపారవశ్యమువలన ప్రాప్తాప్రాప్త వివేకశూ
న్యుండై వర్ణాశ్రమములను గమనించి క్రమముగ అనుష్ఠించు
టకు సమర్థుండు కాక, కన్నీరు కార్చుచు నేమి చేయుదునా!
అని భగవదేకపరతంత్రుండై భగవంతునిపై భారము వేసి,
ఇతర విషయములయెడల స్పృహలేనివాఁడై "క్వచిద్వదన్త్యలౌ
కిక" అన్నట్లు భగవంతుని తిరునామంబులను జపిం
చుచు, పిచ్చివాఁడని లోకులు చెప్పఁదగినట్లు, ఊరు అర
ణ్యమని లేక అంతటను సంచరించుచు, సంసారులు పరిహ
సించునట్లు వారివారి స్వరూపమునకుఁ దగినట్లు విధింపఁబడి
నట్టి వర్ణాశ్రమధర్మంబులనాచరింపక, సంచరించుచుండునని చెప్పి
యున్నది. ఇంతియెకాని, సామాన్య విశేష శాస్త్రములను రెం
ట్టినిన్ని విడనాడినట్టి యుభయభ్రష్టులను పటిమంచిని చేర్చు
కొని "తీర్త్వాపైయామిని" అనుతిరువాయ్మొళియందుఁ
జెప్పఁబడినట్టి సోదిచెప్పు మెరుకలవి వలెనే ఇదితే అదితే
యని ఏదైనచేసి మందనిచెప్పుచు ఆవేశముచే నాడుటనుచూడ
జాలమనుచు శిష్టులు దూషించునట్లు, నిషిద్ధంబుల నాచరిం
చుచు శాస్త్రముకులోబడక తిరుగుచుందురని ఈప్రమాణ
మునఁ జెప్పియుండలేదు కదా!

మొట్టమొదట "జ్ఞానవైరాగ్య సంపన్నః" అనియు "విషయభోగ్యో విశేషతః" అనియు సీతాఖ్యల అధికారిని గుఱించి చెప్పి "అవిధిగోచరః" అనుటచే వర్ణాశ్రమానుగుణములగు ప్రవృత్తిధర్మములను త్యజింపవలయునని చెప్పియున్నది. ఇంతియేకాని, సామాన్య జనులున్ను ముఖ్యముగాఁ త్యజించునట్టి శ్రుతిస్మృతి విరుద్ధమైన నిషిద్ధాచరణముఁ జేయువాఁడని చెప్పియుండలేదు కదా!

"శ్రుతిఃస్మృతిర్మమైవాజ్ఞా" అన్నట్టు శ్రుతిస్మృత్యాదులు భగవదాజ్ఞారూపంబులని యాచరించునప్పుడు. వర్ణాశ్రమోచితంబులగువిధులనన్నింటిని గ్రహించి నిషిద్ధంబులను త్యజింపవలయునుకదా! ప్రవృత్తిధర్మంబులను విడనాడినట్లయినదోషము రాదా? నిషిద్ధంబులను పరిత్యజించి సంతమాత్రమున శాస్త్రమంతయును జీవించునా? యంటివేని తెలిపెదను. శాస్త్రములయందు ప్రవృత్తిధర్మంబు లనునవి తీగను చుట్టచాదు పందిరికెక్కించునట్లు చేతనుల రుచినిబట్టి శత్రునాశముఁ గోరువారికిని "శ్యేనేనాభిచరన్" అని మారణ హోమాదులనువిధించుటచే, వానికి శాస్త్రమునందు నమ్మకమును గలుగఁజేసి, అది కలిగిన పిమ్మట రజోగుణవంతులను గుఱించి "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అని ఈలోకమునందలి భోగంబులకంటెను న్న విలక్షణంబగు స్వర్గానుభవమునకుగాను జ్యోతిష్టోమాదులను విధించి, అందుమూలముగ అస్థిరత్వమైనదని తెలిపి, స్థిరఫలమగు మోక్షముఁ గోరునట్టి గుణవంతునికి "బ్రహ్మవిదాప్నోతి పరం" "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి-ఆత్మా వారే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యా

సితవ్యః" అనుతావున భగవంతుని గుఱించిన యుపాసనము
ను విధించి, అందుమూలముగ ఈ యాత్మ భగవంతునికి
శేషభూతుండని యొప్పించి, అటుపిమ్మట పరమసత్వ నిష్ఠుం
డై భగవదితరంబులగు వాటిలో నొక్కదాని విషయమున
నున్న ఆశలేనట్టివాడగు పరైకాంతిని గుఱించి "ముముక్షు
ర్వై శరణమహంప్రపద్యే" అనియు, "తస్మాన్న్యాస మే
షాంతపసామతిరిక్తమాహుః" అనుతావుల సకలేతర పరిత్యా
గ పూర్వకముగ భగవంతునిపై భారముంచుటను (శర
ణాగతిని) విధించి, అందుమూలముగ ఆత్మయొక్క పారతం
త్ర్యమును బయలుపఱచి, పైపైగా పేర్కొనఁబడిన యధి
కారులు ముందుముందు పేర్కొనిన వారికై విధింపఁబడి
నట్టి వాటిని త్యజింప వలయునని చెప్పియున్నది. ఇట్లు అధి
కారి భేదముఁబట్టి బ్రహ్మచర్యాద్యాశ్రమముల యందును
అగ్నిష్టోమాది క్రతు దీక్షలయందును శాస్త్రవిధులు పరస్ప
రము భిన్నములై ఒకప్పుడు నిషేధింపఁడునట్లై ఆయాస్థితి
గతుల కనుగుణములుగా నుండును. ఇందులో "ఏకాంతీవ్య
పదేష్టవ్యో నైవ గ్రామ కులాదిభిః విష్ణునా వ్యపదేష్టవ్యః
తస్యసర్వం సఏవహి" అన్నట్లు అందఱికంటెను విలక్షణుం
డై ఈ గ్రామమువాఁడు ఈ కులమువాఁడు అని యిట్లు గ్రామ
కులాదులచేఁ బేర్కొనఁబడక భగవద్భక్తుండని యిట్లు భగ
వంతునితోఁ జేర్చి పేర్కొనఁబడునట్టి ప్రపన్నునికి "సకించిదపి
కుర్వాణో విష్ణోరాయతనే వసేత్" (దేనినిన్ని చేయక భగవ
త్సన్నిధిని వసించునది) అన్నట్లు భగవద్గుణానుభవ కైంక
ర్యంబులకంటె వేఱయిన ప్రవృత్తులన్నియును త్యాజ్యంబు

లని చరమశ్లోకమునందును, దానియర్థమునే వివరించునట్టి తక్కిన తావులనున్న విధించియుండుటంజేసి, ప్రవృత్తి ధర్మంబులను పరిత్యజించుటకు ప్రతిబంధక మొద్దియునులేదు. విధించునట్టి శాస్త్రమే అధికారి భేదమునుబట్టి నిషేధించి నట్టయిన, త్యజించుటచే దోషమేమి ? అస్మద్విశిష్టస్వరూపము లనుబట్టి విధించినట్టి సర్వధర్మములన్నియును "నాహం విప్రో నచ నరపతిర్నాపి వైశ్యో నశూద్రో నోవావర్ణీ నచ గృహపతిర్నో వనస్థో యతిర్వా కింతు శ్రీమద్భవన భవనస్థిత్యపాయైక హేతోః లక్ష్మీభర్తుర్నరహరినరో దాసదాసస్యదాసః" అన్నట్లు వర్ణాశ్రమంబులతో సంబంధములేకుండ "అద్యప్రభృతి హేలోకాః యూయం యూయం వయం వయం- అర్థకామపరాయూయం నారాయణపరా వయం-విష్ణుదాసా వయం యూయం - బ్రాహ్మణా వర్ధనిర్మిణః- అస్మాకం దాసవృత్తీనాం-యుష్మాకం నాస్తి సంగతిః - నాస్తి సంగతిరస్మాకం- యుష్మాకం తు పరిస్ఫురం - వయం తోషకరా విష్ణోః-యూయమింద్రియకింకరా." అన్నట్లు అర్థకామపరవశులై శిశ్నోదరపరాయణులగు సంసారులను, ఉపాయాంతరనిష్ఠులైన వర్ణాశ్రమాచారపరులను, ఇంద్రియకింకరులగు శబ్దాదివిషయానుభవపరులనున్ను అందరిని పరిత్యజించి, ప్రత్యేకముగా వేఱొక్క దేవలోకమును చేయువారికి శ్రీవిష్ణుపాదులగు భగవరువంటి భగవత్సేవ్యులగు సమన్వాదికులచే త్యజింపవలసినవి యగుటకు సందియము లేదు. "అత్యంతభక్తియుక్తానాం నశాస్త్రం నైవ చక్రమః" అనియు "తాంత్రికం వైదికం త్యక్త్వా పరమం వైదికం బుధః అనలం బ్యానుసంధత్యాత్ విష్ణుశేషత్వమాత్మ

నః" అనియు, "విముక్తాన్యసమారంభో నారాయణపరో భవ" అనియు, "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అనియు, "ఇవ్వాళవు శిరందపన్గైతై విట్ట్యాల్ కుత్తంవారాదు" (ఇంతవరకు వచ్చినవాను వీటిని విడిచినట్లాయిన, తప్పులేదు) అనియును చెప్పియున్నట్లు, ఈ యధికారికి శాస్త్రవిహితములయినవాటిని పరిత్యజించుట సకలశాస్త్రసమ్మతియును, భగవదభిమతమునునై సకల శిష్టపరిగృహీతంబైన దగును. కావున ప్రవృత్తిధర్మములను విడనాడుటలో బాధకము లేదు. అంతేయును సరియే.

శాస్త్రములయందు కూడనివని నిషేధింపఁబడినట్టి పరహింసా, పరదారాపరిగ్రహ, అపేయపాన, అభక్ష్యభక్షణాదులను నిశ్శేషముగాఁ బరిత్యజించి, శాస్త్రములచేఁ నంగీకరింపఁబడినట్టి స్వవర్ణానుకూలంబులగు సత్కర్మంబులను సాత్త్వికాహారంబులనున్ను అవలంబించి, శాస్త్రవశ్యులై ప్రవర్తించుచున్నందున భగవదాజ్ఞాపరిపాలనమున్ను సిద్ధించి, "ఆజ్ఞా ద్రోహీ మమద్రోహీ" అన్నట్లు భగవతునివిషయమున ద్రోహమున్ను తప్పిపోయి, నిరాటంకముగ మార్గము కలుగును.

"న శాస్త్రం నైవచక్రమః" అన్నట్లు శాస్త్రాతిక్రమణమునకు రెండును సరిపోవుననుకొని, విధించినవాటిని త్యజించువిధమున, నిషేధించినవాటిని యనుష్ఠించుచుమంటివేని, చెప్పెదను. విధించినవాటిని పరిత్యజించుటకు విశేషశాస్త్రాంగీకారము కలదు. భగవదభిమతము కలదు. శిష్టుల యంగీకారము కలదు, కావున విరోధము లేదు. నిషిద్ధంబుల నాచరించుటకన్ననో, సామాన్యశాస్త్రము కాని, విశేషశాస్త్రము

కాని, దర్శనగ్రంథములు కాని అంగీకరించినవనుట కెద్దియును అవకాశము లేదు. ఇంచుకైనను అజ్ఞానము లేని జ్ఞానానందమును లభించినట్టివారికి ఆళ్వారులు "పురివతువుమ్ పుకై పూవే" అనియు, "యెన్నేలుంవసం" (భగవంతుండున్నాడని యనుకొనినను లభించును) అనియు, "తొళుతుమా మలర్ నీర్ శుడర్ తూపం కొండెళుతుమెళ్ళుమినుమినై" (దండముపెట్టి పుష్పదీపధూపములతో నారాధించిన చాలును) అనియు "శిత్తైవేండాశిందిప్పేయమైయుం" (భయపడనలదు. తలంచినచో చాలును) అనియు నితాళ్వుల భగవంతుని యాశ్రయించుట సులభమని చెప్పి. భగవంతుని యారాధింపుమని చెప్పినారే కాని, ప్రపన్నునికి ప్రతికూలంబులను విడనాడమని చెప్పినట్టి తాళ్వుల సకలోపనిషత్సారమగు తిరువాయ్ మొళియందు "వీడుమిన్ ముఱ్ఱవుమ్" (విడిచినవస్తువులను అన్నింటిని విడనాడునది) అనియు "నీరునుమదెన్ఱివై వేర్ ముదల్ మాయ్త్తు" (మీరు మీదియను అహంకార మమకారములను వేళ్ళతోఁగూడ నశింపఁజేయునది) అనియు, "సత్తిరైయాయవర్ ముత్తిలడంగునే" (ప్రీతితో సర్వేశ్వరుని సర్వకైంకర్యములలోను ప్రవేశింపుమా" అనియు, "ఉళ్ళికెడుత్తిఱైయుళ్ళిలొడుంగే" (ఆలోచించి విషయాంతరములను త్యజించి స్వామిని చేరుము) అనియు, "పోమిన్ తొండీర్ నీళ్ కళ్ళియుట్ తొళుమిన్ని (భాగవతులారా! విషయాంతరములను విడిచి భగవంతునాశ్రయింపుడు) అనియు, "శతిరిళమడవార్ తాళ్చ్చియై మతియాతే తిరుమాలిరుంజోలై మలైయే" (యౌవనస్త్రీలు మీయందు చేయునట్టి ప్రీతిని విశ్వసింపక తిరుమాలిరుంజోలై మల

యందు వేంచేసియుండు స్వామిని స్మరించి యుజ్జీవింపుడు) అనియు ,,పయనల్ల శెయ్ తుపయనిల్లై'' (ప్రయోజనము లేని వ్యాపారములను చేయుటచే ప్రయోజనము లేదు) అనియు ,,విరముడైనలక్కార్ తీవినై ప్పెరుక్కాతు'' (బలముచేత పాపమును పెంపొందింపవలదు) అనియు, ,,కిరియెననినమిఱ్ కీఴ్మైశెయ్యాతు'' (విషయాంతరములకై యాశపడక మంచి యుపాయమగు భగవంతుని తలంచుడీ) అనియు, ,,నలమెననినైమిఱ్ నరగ్ఘుంతాతే'' (సంసారమనెడి నరకమున పడకుండ, సర్వేశ్వరుని ధ్యానించుడీ) అనియు, ,,వఞ్జకన్ననినమిఱ్ వల్వినై మూఴ్గాదే'' (ఇతరుల న్యాయమును తలంచి పాపములలో ప్రవేశింపకుము) అనియు, ,,పొరుళై నిక్కవృ(?) శూఴుం తెయ్యాతే'' (ధనార్జనమునకు సాధనమునుకొని దొంగిలింపవద్దు జూదమాడవద్దు) అనియు, ,,మన్నామనిశై ప్పావిప్పాడి ప్పరైక్కుమ్ పెరుంపాణరెన్నావు'' (భూమియందు అనిత్యులగు మనుష్యులను స్తోత్రముచేసి పొందునట్టి ఫల మేమి యుపయోగము) అనియు, ,,ఒరునాయకమాం యోడవులకుడనాండవర్ యిస్సెయిటై పిచ్చైతాంకొళ్వర్'' (ఏకాధిపత్యము చేసిన మహారాజులును ఒకకాలమున బిచ్చమెత్తుదురు) ,,అవప్పిరకావిర్కమత్తైచ్చు వంనాడుదిరే'' (కారణభూతుడగు సర్వేశ్వరుండుండగా మరి యేదైనమును వెతకుచున్నారు) ,,కొండపెండిర్మక్కళుత్తార్ తుమైయుం శార్వుంవాకవార్ప్పోల్ ఇరణంకొండతెప్పారోవర్'' (సహాయభూతులును రక్షకులునయినవారివలె నుండునట్టి బంధువులనుకొని భార్యయును, బిడ్డలును, జ్ఞాతులును తక్కిన బంధువులును అప్పుయిచ్చి తీసి

కొనువారివలెనే తుచ్ఛులగుదురు) అనియు, ‘‘ఇఱైకండీరింబ
మందో శిత్త వేండా శిందిప్పియప్పియుమ్’’ (ఇచ్చట సౌఖము
లేదు. దుఃఖపడవద్దు ధ్యానించినట్లయిన చాలును) అనియు
‘‘కండీర్ కళ్ందో వాళ్ తల్‌కండీర్ గుణమిశంవో’’ (చూడండి ఈ
సుఖము నిత్యము కాదు) అనియు ‘‘కణ్ణనల్లాలిల్లై కండేశరణ్’’
(భగవంతుం తప్ప వేఱొక్క రక్షకుండు లేడు) అనియు
‘‘శార్ంద్విరువల్ విన్నైకళ్ళుం శరుత్తుమాయప్పత్తరుత్తు తీరందు
తన్పాల్ మనంవైక్కత్తిరుత్తి వీడు తిరుత్తువాన్’’ (ఈతనితో
జేరియుండు క్రూరములయిన పాపములను పోగొట్టి అజ్ఞాన
మును మూలచ్ఛేదము చేసి తనను ధ్యానించునట్లు దిద్దుపాటు
చేసి యాత్మ యునికిపట్టును పరిశుద్ధముగాఁ జేయును) అని
యిట్లు ఆదియగునను మధ్యాసు తొట్టుకొదనున్న ఒక్కమాఱు
చెప్పినట్లు పశమారులు చెప్పాచు, తగలపడిపోవునట్టి యిం
టిలోఁ జిక్కుకొనిన వారిని (బయటికిరమ్మని) పిలుచునట్టివా
రివలెనే, యితరులు కష్టపడుచుండఁగాఁ జూడజాలనివారై దేవ
తాంతర, సాధనాంతర, విషయాంతరములును, అహంకార
మమకార కామక్రోధాదులును, దారాపుత్రాది బంధుసంగ
మమును, పరద్రవ్యపరదారా పరిగ్రహాద్యకృత్యకరణములును,
ఇంక తక్కిన దుశ్చర్యాదులును, ఇవ్విధముగ విరోధులని
ప్రసిద్ధములైన వాటినన్నింటిని నిశ్శేషముగ విడనాడి, సర్వే
శ్వరుండే పరదేవతయనియు, ఉపాయోపేయంబులనియు
ననుకొని యాశ్రయించినట్లయిన, తిలలలో తైలమున్నట్లు ఈ
చేతనునితోఁ జేరియున్నట్టి పుణ్యపాపంబులను నశింపఁజేసి,
అవిద్యాసంబంధమును పోగొట్టి, యనన్యప్రయోజనుండై

గనపై మనస్సుగలవాఁ డగునట్లుచేసి, ఇఁక యీతండు మన
కు చేఁజిక్కినాడని సంతోషించి, తన శరీరము నలంక
రింపఁజేయునని యెల్లరకును తెలియునట్లు ఉద్ఘోషించుచున్న
ను, వీటి నన్నింటిని క్రోతిచేతిలోఁ జిక్కిన పుష్పమాలిక గ
తికిఁ గొనివచ్చి, వీటికి విపరీతార్థములఁ జెప్పను, అకృత్య
కరణము ఉపాదూష్యకారి కవశ్యముగా నుండవలయుననియు,
భగవంతుని కది యిష్టమనియు, ఇది ధర్మసూక్ష్మమనియు,
శాస్త్రమునఁ జెప్పియుండకపోయినను, అహంకారరాహిత్య
మునకు హేతువగుటంజేసి, ఇదియే శాస్త్రతాత్పర్యమనియు,
ఇది ఆర్యసిద్ధాంతమనియు నిట్లు దీనిని ప్రవర్తింపఁజేయుదు, ఎవ
్వరయినను మీరీలాగున చేయవచ్చునా? యని యడిగితే, నే
నా యిట్లు చేయుదును? అనువారిని రొట్టి తిట్టి భయపెట్టుటచే
వండించెదరు. ఇట్లు ప్రమాణపరతంత్రుండయినవాఁడు ప్రవ
ర్తింపకూడదు కదా!

*** తన నిషిద్ధానుష్ఠానమును గురించి యితరులడిగినప్పుడు తాను ప్రవర్తింపవలసిన విధము. ***

ఒకవేళ యిట్లు నిషిద్ధానుష్ఠానపరుఁడై తిరుగుచున్నను;
యెవ్వరయిన తమ నడిగినప్పుడు అహంకారపడక, (పాపా
త్ములలో నేను మొదటివాఁడను) అని నేను విన్నవించునదియు సత్య
మనుకొని పెనమూర్ఖమనస్సు వనొప్పించుకొనకుండునట్లు, నేను
విన్నవించునది సత్యమని మీరు సాక్ష్యమిచ్చినారు. మీరు కదా!
మహోపకారకులు! అనుచు వారివిషయమున బహుమానమున్ను
సంతోషమున్ను, ఉపకారస్మృతియును ఉన్నట్లయిన, కా
లాంతరమున గాని, జన్మాంతరమున గాని, పశ్చాత్తాపము

గలిగి భగవంతుని యనుగ్రహమునకు పాత్రులు కాగలరు. ఈ దర్శనమును నవలంబించునట్టి వారి కదియును లేదు కదా?

—* దివ్యజ్ఞాన ప్రమాణంబు లన్నింటికింటెను తిరుమంత్రమే ప్రధానమైన ప్రమాణమనుట *—

కావుననే మన పూర్వాచార్యులందఱును ఇంద్రియ గోచరములుకాని వాటి విషయమున ఐతిహ్య, సంభవ, అర్థాపత్తి, అభావ, ఉపమాన, అనుమాన, ప్రత్యక్షంబులను ప్రమాణములనుగాఁ గొనక, సకలవేదాంత సంగ్రహమగు తిరుమంత్రమునే ప్రమాణముగాఁగొని, దానిలోఁ జెప్పియున్నట్లు, స్వస్వాతంత్ర్య, అన్యశేషత్వ, దేహాత్మాభిమానములను త్యజించి, స్వరక్షణ విషయమున స్వప్రయత్నమునున్ను విడిచి, స్వపారతంత్ర్యము ననుసంధించుకొనుచు, అవిద్యాకర్మ, వాసనా, రుచి, ప్రకృతిసంబంధ మూలకమగు అకృత్యకరణాది నిషిద్ధానుష్ఠానము తొలగిపోవలయునని ప్రార్థించి, సర్వేశ్వరుఁడే యుపాయమని నిశ్చయించుకొని, భాగవత శేషత్వమున నెక్కువ యభినివేశము గలవారై నామములని చెప్పంబడు చేతనాచేతనంబులయెడల శత్రుమిత్ర విభాగము లేకుండునట్లు రాగద్వేషరహితులై, దారాపుత్రాదిబంధు సంబంధమును విడనాడి, అన్నియును సర్వేశ్వరుండేయని తలంచుకొని, తాను కర్తయనిగాని, భోక్త యనిగాని తలంపక, సర్వవిధకైంకర్యనిరతులై ప్రవర్తింపుమనట్లు, ప్రవర్తించుననే తప్పు అధికారులయినట్టివారు అప్రామాణికకృత్యములయందుఁ బ్రవర్తింపరు కదా!

“మీరిట్లు అనేకవిధములుగా దూషించితిరి. అయితే అజ్ఞానమునకు విషయము ఆచార్యదోషమనియు, భగవద్భాగవత విషయమున దోషమున్నప్పటికిన్ని అది గుణము వలెనే యుపాదేయంబనియు, ఈ పై మూఁడు విషయముల యందును దోషమున్నప్పటికిన్ని నిందింపఁగూడదు, అదియు పాదేయమే కాఁగలదనియు, “ప్రాదుర్భావైస్సురనరసమో దేవదేవస్త్వదీయః జాత్యావృత్తైరపిచగుణతః తాదృశోనాత్రగర్హా” అను ప్రమాణమున్ను అట్లె తెలుపుచున్నదే యనియు నడిగెదవా? చెప్పెదను. అందఱికిని నారములనెడి సంబంధమునుబట్టి సంసారులయం దున్నట్టిదిగాఁ దెలియవచ్చునట్టి దోషమును తనదిగాఁ దలంపవలయునని చెప్పినట్టినేను దూషింపవచ్చినా? మూర్ఖుండవగు నీవు అశాస్త్రీయ ప్రవర్తనము సత్సంప్రదాయమని కొందఱు చెప్పినారని భ్రమింపఁగా, అట్టి భ్రమను పోగొట్టుటకై “సెయి పర్ మూర్ఖ్ రావార్” (అట్టివారు మూర్ఖులు) అని చెప్పినాను. ఇంతియె కాని, నిందించుటయూ నాపని? అది యట్లుండనిమ్ము. “అజ్ఞానమునకు విషయము ఆచార్యదోషము” అనఁగా—సదాచార్యుండైన వాఁడు తన నాశ్రయించినట్టి యాచేతనుండు పూర్వపు వాసనలన బద్ధసంసారియై, దుర్విషయప్రవణుండై, అరింగమాళి వలెనే తిరుగుచున్నట్లయిన, వానియొక్క వినాశము తనదని భావించుకొని హితబుద్ధితో కోపించుకొని, దండించి శిక్షించినట్లయిన, ఆతండు దుర్బుద్ధిగలవాఁ డగుటంజేసి, ఆచార్యుండయినట్టివాఁడు అన్నింటిని సహించి “యస్సాపరాధాన్ స్వపదప్రపన్నాన్ స్వకీయకారుణ్యగుణేనపాతి” అ

న్నట్లు తనయొక్క కార్యమగు నవునవలన రక్షింపవలెనా? ఇట్లు అహంకారపడినట్లయిన ఆచార్యత్వము నిలుచునా అని తలంచుకొనుచున్నారో యనుకొని, అట్లు తలంచుకొనకుండుటకు గాను, వారట్లు కోపించుకొనినదియును హితముగఁ దలంచినదే కాన, నది యుపాదేయంబని తెలిపినారు. ఇంతియేకాని, వేఱు కాదు.

—* దోషంబులన్నియును ఉపాదేయంబు లయినట్లయిన కాబోవు అనర్థములు. *—

దోషంబులన్నియును ఉపాదేయంబులే యని చెప్పినట్లయిన, అకృత్యకరణాద్యసహ్యాపచారము వరకును చెప్పఁబడిన ప్రకృతిగుణములవలన సంభవించునట్టి నిషిద్ధానుష్ఠానంబులన్నియును ఉపాదేయంబులు కావలసివచ్చునే? అట్లగునేని, ఆచార్యస్వభావమును తెలుపునట్టి శ్రుతిస్మృత్యాదులును, శ్రీవచనభూషణాది విశేషశాస్త్రములును వ్యర్థంబులగును. కావున నట్లు చెప్పకూడదు.

శ్రుత్యాదులయందుఁ జెప్పియుండుట మాత్రమే కాకుండ. తాను ఆచార్యుండనియు, శిష్యుండు తనకు శిష్యుండనియు, తన యుపదేశమువలన కలుగునవి దృష్టఫలాదులనియును దలంచినట్లయిన, అట్టివాని కాచార్యత్వపూర్తి లేదు. అట్టివానితోఁ గల సంబంధము వినాశహేతువని తెలుపునట్టి శ్రీవచనభూషణమునందే కదా! అజ్ఞానమునకు విషయము ఆచార్యదోషమని చెప్పియున్నది. అయితే దాని కర్థమేమని యడిగెదవా! చెప్పెదను. మనవలెనే ఆచార్యుండును నిద్రాహారపరివశుండై, మలమూత్రోత్సర్గనాదుల నొనర్చుచు, తిరు

గున్నట్టి యొకమనుష్యుండు కాఁడా! అనుచు నిట్లు శరీరధర్మ ములఁబట్టి మనుష్యమాత్రునిగాఁ దలంపకూడదు. జ్ఞానానుష్ఠానసంపత్తినే చూచి, "గురురేవపరంబ్రహ్మ" (గురువేపర బ్రహ్మము) అనెడి నిశ్చయము ఉండవలయు నని చెప్పినారు. ఇంతియే.

—* భగవద్భాగవత దోషంబు లుపాదేయంబులనుటకు హేతువు. *—

ఇఁక, భగవద్భాగవత దోషంబు లుపాదేయంబులని చెప్పినది యెందులకనఁగా — భగవంతునియం దొక్కదోష మున్నా స్వముకుఉండదు. అయినను తనకు శేషభూతులై పరతంత్రులయినట్టి యాత్మలను గర్భసంధమునైనను చూడక నిర్దయుఁడై అపరాధానుగుణముగ దండించునని యీశనికి మనుష్యదృష్టివలనఁ దోచునట్టి దోషముకదా! వానియం దుండ నది. ఇష్టమొచ్చినట్లు వినియోగపఱచుకొనుట కీచేతనుండు అచేతనమువలెనే జ్ఞానశూన్యమైన వస్తువుకాదుకదా! "అదా వీశ్వరదత్తమైవపురుషః స్వాతంత్ర్యశక్త్యస్వయంతత్ జ్ఞాన చికీర్షాప్రయత్నాన్యుత్పాదయన్వర్తతే" అన్నట్లు సర్వేశ్వ రుండే చేతనులకు దేహేంద్రియాదులనొసంగి, జ్ఞానశక్తి ప్రవ ృత్తినివృత్తి శక్తులనున్ను యిచ్చి, హేయోపాదేయంబులను వివేచనతోఁ దెలిసికొనుటకై వేదశాస్త్రాదులనొసఁగి, రామ కృష్ణాద్యవతారములద్వారా తెలియవలసిన వాటినన్నింటిని తేటతెల్లముగఁ దెలిపినను, సంసారబద్ధులై శబ్దాదివిషయ ప్రవణులై ప్రవర్తించినట్లయిన, మన్నుతినమరిగిన బిడ్డను నోట్లో కొఱివిపెడతానని భయపెట్టునట్టి తల్లివలెనే, హితబుద్ధి తోఁ జేసిన దయినందున నది యొక దోషము కాదు.

* కృష్ణావతారమున నారోపించు దోషమును నివర్తింపఁజేయుట. *

ఇఁక కృష్ణావతారమున జారత్వమును, చౌర్యమునున్ను చేసినాఁడనెడి ప్రసిద్ధికలదు. సర్వేశ్వరుండు ఆశ్రితుల నను గ్రహించుటకై చేసినదైనందునను, వాఁడు సర్వశరీరియైనందున, తన శరీరమును తానే యాలింగనముచేసికొనుటవంటి దయినందునను, "గోప్యః కామాత్" అన్నట్లు కామము వలన గోపికలను ముక్తలనుగాఁ జేయవలయునని తలంచి చేసినదైనందునను, "యదిమే బ్రహ్మచర్యం స్యాత్" అన్నట్లు తాను అస్ఖలితబ్రహ్మచారియై యట్టిభోగముతో లేశ కెట్టి సంబంధము లేనివాఁ డగుటం జేసియును, వాఁడు చేయునవియన్నియును ఆశ్రితులను రక్షించుటకుఁ గానయినదైనందున అది యొకదోషముకాదు. నిందయును లేదు. అదియుపాదేయము కాఁగలదు.

—* భాగవతులవిషయమునఁ దోచునట్టి దోషములను నివర్తింపఁజేయుట *—

ఈ ని చెప్పినవిధమున భగవంతునియందు దోషం బెట్టిగును లేనట్లు, వానిభక్తులును స్వరూపానురూప జ్ఞానానుష్ఠానపరిపూర్ణులై స్వరూపవిరుద్ధంబులగు ప్రాతికూల్యము లెట్టివియు లేనివారైయున్నను, తనదోషమువలన వారియందు దోషమున్నట్లు తోఁచినట్లయిన, వారిని నిందింపకూడదు. వాటిలోను దేహపరవశతవలనఁగాని, వర్ణగోత్రకున్నట్లు చేయునర్చినవి గాని కాకుండ, స్వప్రయోజనము నపేక్షింపక ఆశ్రితులను రక్షించుటకై చేసినవియైనట్లయిన, నవి యుపాదేయంబులు కాఁగలవు. "నాత్రగర్హా" అనిచెప్పి "కింతు శ్రీ

మద్భవనభవనత్రాణాత్ః" అనుటచే ఆశ్రితులకై యొనర్చిన
వైనందున, నది యొకదోషముకాదని చెప్పియున్నదికదా!

ఇవ్విధమున గ్రహింపక, నామరూపములనుధరించిన శ్రీ
భాగవతులైనవారు యెవ్విధమునప్రవర్తించినను అది యుపా
దేయమే యంటివేని, "వోర్తునెంజే మున్నవరుం పిన్నవరుం
మూర్ఖరెనవిట్టు నడుచ్చొన్నవర్ నాళుంతుడర్" అను తావు
న నాస్తికులను ఆస్తికనాస్తికులనున్ను మూర్ఖులని విడిచి,
ఆస్తికుల నాశ్రయింపుమని చెప్పనక్కఱ లేదు కదా! "మ్లే
చ్ఛుండయినను, భగవద్భక్తుం డయినట్టయిన, వాని తీర్థ
ప్రసాదంబులు పావనంబులు" అనుటచే పరమవిలక్షణుల
సంబంధము స్వీకరింపవలసినదని జగత్ప్రసిద్ధము. భగవంతుం
డు ఆజ్ఞాపించినాడని నిర్భయముగ గ్రంథములయందు విధించి
యున్నట్టి మన పూర్వాచార్యులైనవారయినను, ఒక్కరహ
స్యమునందయినను, భగవంతునికి ప్రపత్తిచేసినవాడు అహం
కారనివృత్తికిగాను, స్వధర్మపరిత్యాగమునకుగాను ఉల్లిగడ్డ
మొదలగువాటిని భుజింపవలయునని చెప్పియుండలేదుకదా!

ఒకవేళ గ్రంథములయందు చెప్పియుండకపోయినను,
నిషేధించియుండనట్టయిన, గ్రంధములయందు చెప్పియు
న్నట్టి యహంకార నివృత్తికిగాను ఉపయుక్తంబులయిన
వాటి జేయవచ్చును కదా? యంటివేని, ఉద్గ్రంథములగు శ్రీ
వచనభూషణాది దివ్యశాస్త్రములయందు అనేకవిధములుగ
నిషేధింపఁబడినట్టి అకృత్యంబుల నాచరించుట భగవన్మా
యాప్రభావంబని తలంపవలయునే తప్ప, అది శిష్టాచారము
చెప్పకూడదు కదా!

గ్రంధములయందుఁ జెప్పినట్లయిన, అనధికారులు తిరస్కరించి నశించి పోదురు. కావున, ఇతిహాసములయందుఁ జెప్పియున్నందున సాంప్రదాయికమని ప్రవర్తించుదు రంటివేని పూర్వాచార్యుల శ్రీసూక్తులతోను, అనుష్ఠానంబులతోనును విరోధము లేకుండ యుండినటయిన, అట్లయినను కావచ్చునని గ్రహింపఁదగునే కాని, లౌకిక, పరమవైదిక విరోధము లనేకములుండుటంజేసి, అట్లు గ్రహింపఁదగదు. శాస్త్రమునందెద్దియయిన నొక పరమార్థము చెప్పియున్నట్లయిన, దానికిఁ గావలసిన యంగోపాంగములను ఇతిహాసములనుండియు, సంప్రదాయమునుండియును గ్రహింపనగునది యని చెప్పియున్నది ఇంతియకాని, సకలశాస్త్రదూషితంబులై శిష్టగర్హితంబులగు వస్తుంబులను ఉపదేశపరంపరా ప్రాప్తంబులని గ్రహింపఁకూడదుకదా! వీటినన్నింటిని శాస్త్రమునుబట్టియే తెలిసికొనవలయునా? రజస్తమోగుణములను వృద్ధిపొందించునవియై "ఆహారదోషము జ్ఞానవిరోధి" అన్నట్లు అర్థపంచకజ్ఞానోత్పత్తికి విరుద్ధంబులై జాతిదుష్టములై, ప్రాకృతజనస్పర్శదూషితములై, అత్యంతహేయములై, సామాన్యజనులును త్యజించునవియును నింద్యములు నగు నిషిద్ధపదార్థములు వేలాక్ర విధమున సరియయినవియేయని రాక్షసస్వభావముగలవారికి తోచునే తప్ప, విశేషశాస్త్రవశ్యులగు శిష్టులకుఁ దోచదుకదా! అనధికారులు నిందింతురనెడి భయములేకుండ, విలక్షణ జన్మముగలవాఁడగు వైష్ణవుని యనువర్తించుటయు వాని తీర్థప్రసాదంబులను స్వీకరించుటయును పవిత్రంబని విధించునట్టి యధికారులే దీనిని చెప్పినట్లయిన, అధికారి

భేదమునుబట్టి యిదియును తగునని తోచునుగదా! అన్నైదికత నుబట్టిచూచితే దానికంటెనున్న ఇదియెక్కువ విరుద్ధము కాదా? ఇకను దీనిని గురించి భాష్యమతస్థులకు అగమ్యంబు లయినను కలవు

భగవత్ప్రియత్న విరోధియగు స్వప్రయత్నప్రవృత్తిని విధించుటచే నది స్వతస్సిద్ధముగానే తెలియవచ్చునది కాకూడదా? యంటివేని, అట్లయిన, శాస్త్రపరిగ్రహముగాని, భగవద్వచనముగాని, శిష్టాచారముగాని యొక్కటియును లేకుండ యుండఁగా, బద్ధమతస్థులవలెనే ఆభాసవచనంబులఁగొన్ని విపరీతార్థములఁ జెప్పుచు భగవన్మాయాకల్పితంబులగు కొన్ని ప్రత్యక్షములఁజూపించి, భ్రమింపఁజేసి, తిరుగుచుండినట్టి అప్రామాణికులను కొందఱివచనంబులనుగాని అనుష్ఠానంబులనుగాని ఉజ్జీవింపవలయుననెడి యిచ్ఛగలవారు ప్రమాణములనుగాఁ గొనకూడదు.

అదియేమి? వారు స్వతంత్రముగ ఒక్కయనుష్ఠానమును కల్పించుచుండలేదే?" "ధర్మజ్ఞసమయః ప్రమాణం" అనియు "యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనాః" అన్నట్లు శిష్టాచారమునే ప్రమాణముగా నంగీకరించి, "ఆచార్యస్య ప్రసాదేన మమ సర్వమభీప్సితం ప్రాప్నుయామీతి విశ్వాసో యస్యాస్తి స సుఖీ భవేత్" అన్నట్లు స్వాచార్యునియెడలఁగల విశ్వాసమువలన వాని యాజ్ఞప్రకారము ప్రవర్తించినట్లయిన. అనర్థము కలుగునా? యంటివేని చెప్పెదను. స్వాచార్యాజ్ఞయనునది యంగీకరింపఁదగినది యెప్పుడనఁగా, వారు యథార్థాచార్యలక్షణములు కలవారై శాస్త్రపాణులై ప్రబలప్రమాణపర

తంత్రులై, శ్రీవచనభూషణాది దివ్యశాస్త్రములఁ జెప్పియున్నట్లు ఈతనిని శిక్షించినప్పుడు గదా? అట్లు శిక్షింపక, తమ మనస్సునకుఁ దోచినట్లుచెప్పి యిది శుద్ధమైనట్టి యుపదేశమని కొన్ని విపరీతార్థములను కల్పించి "ఉణాంగుక్కుఱుమ సుంతెట్టం గోరాడుంకిన్గం పరాయ్" (ఆవేశముచే అపహాస్యమైనమందని యచట అడుచు కల్లువాఁరాయాలను తెచ్చి) ఇట్టి నిషిద్ధానుష్ఠానమే సిద్ధోపాయమని శిష్యులకుఁ దెలియరాకుండునట్లు, ఒక్కరినొక్కరు *సంకేతశబ్దములచేఁ దెలుపుకొనుచు, ఒక్క గ్రుడ్డివాఁడుపోయిన దారిని పోయి అనేక గ్రుడ్డివాండ్రు బావిలోఁ బడునట్లు, అప్రామాణికుల నాశ్రయించి, వారి యిష్టప్రకారము నడుచుకొనినట్లయిన, ఓటిపోడ మీఁద ప్రయాణము చేయువారివలెనే గురుశిష్యు లిద్దఱును అనర్థపడుదురు గాన, అట్టి వారితో సహవాసము నెన్నటికిని చేయఁ గూడదు.

* అన్నింటికిని సాధకమైనది తిరుమంత్రమనుట. *

ఆచార్యుఁడెటులనఁగా — అహంకారార్థ కామపరుండు కానివాఁడై లోకహితముఁ గోరువాఁడై ॥సాక్షాత్ నా

* సంకేతశబ్దములు: — ఎవ్వరింట్లోనయిన సమారాధనము జరిగితే ॥భగవత్ప్రియమా? భాగవతప్రియమా? అని యడుగుదురు. భగవత్ప్రియమనఁగా మద్యమాంసములు లేనిదనుట. భాగవతప్రియమనఁగా మద్యమాంసములు కలిగియున్నదట. చేపలను జలపుష్పములందురు. కోడిని కొండ [illegible]. ఉల్లిగడ్డలను సాలగ్రామములందురు. కోడిగుడ్లను తిరుమణి వుండలందురు. నారింజకాయను [illegible] గోవిందరాజులందురు. కాలజ్ఞానికరియామడు సాలగ్రామములుంచిన జలపుష్పములపులి ఇత్యాదులు.

రాయణో దేవః కృత్వా మూర్తిమయీంతనూం మగ్నానుద్ధరతే లోకాన్ కారుణ్యాత్ శాస్త్రపాణినా" అన్నట్లు శాస్త్రముఁగొని రక్షించునట్టివాఁడు కదా! అట్టి శాస్త్రమన్ననో, గుణానుగుణముగ అనేకవిధములుగానుండుటంజేసి, "అసారమల్పసారంచ సారంసారతరంత్యజేత్ భజేత్సారతమం శాస్త్రంరత్నాకరఇవామృతం" అన్నట్లుఅసారమగు వేదబాహ్య శాస్త్రమును,అల్పసారమగు పూర్వభాగమును (కర్మకాండమును), సారమగు ఉత్తరభాగమును (వేదాంతమును), వీటి నన్నింటిని విడిచిపెట్టి సారతరమగు విష్ణుగాయత్రింటెనున్న సారతమమైనట్టిదిగాను మొట్టమొదట చెప్పఁబడినదియు, సంసారనివర్తకమునగు తిరుమంత్రమును ఉపదేశించి, అందులకనుగుణంబులగు అనుష్ఠానంబులను విధించి, ఆళ్వారులును ఆచార్యులును గ్రంథములయందుఁ దెలిపియుంచియు, తాము స్వయముగా నాచరించియుండిన విధమున తప్పకుండ తానున్ను ఆచరించి, తనను ఆశ్రయించినట్టి యీ చేతనుని చేతనున్ను ఆచరింపఁజేసినట్లయిన, ఉభయులును ఉజ్జీవింపఁగలరు. "నీచస్పర్శముగల గురు, మంత్ర, దేవతలు పరిత్యాజ్యంబులు" అని ఆచార్యులుగారు సాయించియున్నారు కదా!

వాస్తవస్థితి యిట్లుండఁగా, సంసారనివర్తకమగు తిరుమంత్రమును ఉపదేశించినవాఁడే యాచార్యుండని పైకి మాత్రము చెప్పుచు, "కృపాతో యేమదనపవనోద్ధతమోహార్మిమాలేదారావర్తే తనయసహజగ్రాహసంఘాకులేచ" అని చెప్పియున్నట్లు సంసారసముద్రములో మునిగిపోయి, తామున్ను దరిచేరజాలక, తమను ఆశ్రయించినట్టి వారినిన్ని

ఆచార్యనిష్ఠ యిక్కాలి పరిపూర్ణముగా నుండగలదు. అదియు న్నంతమాత్రమున పరమపురుషార్థమును, విలక్షణమును నగు మోక్షము లభించునని చెప్పజాలము కదా? గురు మంత్ర, దేవతా, భేషజముల (ఔషధముల)యందు దివ్యశక్తి యున్నప్పటికిన్ని, విశ్వాసము లేకున్నట్లైన, ఉపయోగపడదని తలంచి విశ్వాసము ఆవశ్యకమని చెప్పఁబడినది. ఇంతియె కాని, ముత్యపుచిప్పను వెండియని నమ్మినచో,నది సత్యముగ వెండి యగునా! కాదు కదా!

ఆచార్యుండు జ్ఞానాధికుండై శిష్యునియెడల యెక్కువ ప్రీతిగలవాఁడుగా నున్నట్లయిన. ఈతనియందు కొన్ని దోషంబులున్నను, ఆచార్యునియం దీతనికి ప్రీతియున్నట్లైన. చాలును కదా! ఇట్లుండ. సర్వేశ్వరుండు దండించుటకై తలంచినప్పుడు, ఆచార్యుం డీతనిని తన వెనకనుంచుకొని రక్షింపగలఁడా" యంటివేని, "స్థాలిత్యే శాసితారం" అన్నట్లు అట్టి దోషములు రాకుండునట్లు యీతనిని దిద్దుపాటుచేసి, భోగయోగ్యునిగాఁజేసి రక్షించుటయే యాచార్యునిపని కాని,తనను ఆశ్రయించి తనను ప్రేమించినట్లయిన, శిష్యుండు దుర్జనడవడిక కలవాఁడయినను, ఆచార్యుండు రక్షింపఁగలడని తలంపకూడదు. ఆచార్యుండనఁగా పడవమీఁద చుక్కానిత్రిప్పువంటివాఁడు. ఆచార్యుండనెడి చుక్కాని త్రిప్పువాఁడు విష్ణువనెడి పడవమీఁద స్థిరముగా నున్నట్లయిన, ఉత్తారకుండగుటకు సందియము లేదు. ఈ చేతనుండు రెండుచేతులను వదలి యుండునప్పుడు నిశ్చింతుండై యొక్కపనినిన్ని చేయకుండియుండక, అగాధమైనట్టి సంసారసాగరమున మునింగి, తో

్రటుపాటుపడుచున్నట్లయిన, సర్వశక్తుండగు సర్వేశ్వరునికే యీతని నుజ్జీవింపఁజేయుట యశక్యమని "కూవికూవి క్కొడువినైత్తూఱ్ఱుళ్ నిన్ఱు పావియేన్ పలకాలంపటితిగ్రత్తి లమరుకిన్ఱేన్ మీవియన్ఱానిలకాత్తవనలకమెల్లాం తావియవ మ్మానెయెంగిని వన్దెయ్దువనే" అనుతావున. సర్వశక్తుండగు నీవు రామకృష్ణాదిరూపములతో నీదివ్యమంగళవిగ్రహమును అందఱికిన్ని కెంపుతో నొసంగి గీతాశాస్త్రాదుల మూలముగ హితోపదేశముఁజేసి, చేయిచ్చి పైకి తీయుట కిచ్ఛయించినను, అట్లు పైకితీయుట (ఉజ్జీవింపఁజేయుట) యశక్యమగునట్లు, పాపరూపముగు పొదలోనుండి పలుమాఱు ప్రార్థించుచు, పాపిష్ఠుండనగు నేను దాటితప్పి అడ్డాడుచున్నాడను. అందఱికిని సర్వసాధారణముగా నొసంగినప్పుడే లక్షింపనట్టి దౌర్భాగ్యుండను నేను. ఇఁక నిన్ను పొందుట యెన్నటికో!" అని శ్రీ నమ్మాళ్వారులు సాంచియున్నందున, ఆచార్యుండు రక్షించుట యశక్యము కదా!

అట్లు సర్వేశ్వరుడు రామకృష్ణాది రూపములుగా నవతరించి, విస్తృతముగ హితోపదేశముఁ జేసినప్పటికిన్ని, అధికారులైన వారిని లభింపనందున విజాతీయుఁడగు తనవలన నిది కాఁజాలనిదని తలఁచి, సజాతీయులగుటవలన వీరిని నియమించి, భోగ యోగ్యులనుగాఁ జేసి, బాగుగ దిద్దుపాటు చేయవలయునని కదా! నమ్మాళ్వారులు మొదలగువారిని అవతరింపఁజేసెను. వారున్ను అట్లయితరులను బాగుగ దిద్దుపాటుచేసి కైంకర్యపరులనుగాఁ జేసిరి కదా! వారివలెనే ఆచార్యుండైనవాఁడు దిద్దుపాటుచేయ సమర్థుండైనట్లయిన, ఈతండు ముక్తుండుకాఁ

గలదు. వాస్తవస్థితి యిట్లుండ, దుర్బుద్ధివడికలవారినిన్ని ఆచా ర్యుండు రక్షింపసమర్థుండని చెప్పజాలము. శ్రీరామానుజుల వారే అరంగమాళిగై ముదలానారనువారిని పశురానిపాట్లు పడి దిద్దుపాటుచేసినారు కదా? కావున, బాల, మూక, జడ, అంధాదులనున్ను తిర్యగ్జంతువులనున్ను, స్థావరపదార్థము లనున్ను ముక్తులనుగాఁ జేసినవారగు శ్రీ రామానుజులవారు మొదలగువారికిన్ని ప్రతికూలంబులుగల చేతనుల నుజ్జీవింపఁ జేయుట దుర్లభమగుటంజేసి, తక్కిన యాచార్యులు అట్టివా రిని రక్షించుటయనునది పేనుగబొమ్మల పోరాటమువలెనే నామకార్థము మాత్రమేయని యెఱుంగునది.

సర్వేశ్వరుఁడయినవాఁడు సర్వస్వతంత్రుండై, సర్వశ క్తియుక్తుండై, లీలారసలోలుండై పరమదయాళువయినట్టి వాఁడగుటంజేసి, జగత్తుయొక్క యుత్పత్తి స్థితి, సం హారాదులకు తానే సమర్థుండై సర్వనిర్వాహకుండై యుండియును, ॥పురమొరుమూన్రెరిత్తమరర్కుమఱివియన్ద అ రనయనెన వులకళిత్తమైత్తుళనే" అన్నట్లు ,గ్రద్రతృణ మితరు లకు అశక్యమగుటంజేసి, దానిని తనపైబెట్టుకొని, సృష్టిసంహా రంబులకుగాను ॥నన్మైప్పునల్పణ్ణినాన్ముకనైప్పణ్ణి" అన్నట్లు ఒక మట్టిబొమ్మను చేసినట్లు, చతుర్ముఖబ్రహ్మను సృజించి, ॥సృష్టిం తతః కరిష్యామి త్వామావిశ్య ప్రజాపతే" అన్నట్లు వానిలో నంతరాత్మగానుండి జగత్తును సృజించి, దేవతలకు జ్ఞానముఁ గలుగఁజేసి చతుర్ముఖబ్రహ్మమే సృజించినాడని ప్రసిద్ధపఱచు నట్లును, ముందుగ వానిఁగొని రుద్రునిసృజించి వానిలోనంత రాత్మయై సంహారమొనర్చుచు, త్రిపురదహనమును వాఁడే

చేసినాడని ప్రసిద్ధపడుచున్నట్లును, దుఃఖాకులులగు చేతనులఁ
జూచి వారిని సంసారమునుండి తొలగించుటకుగాను ఆచార్యుం
డనెడి కొయ్యబొమ్మను నిర్మించి (పిల్లలు) కాకిబంగారముతో
సలంకరించునట్లు, జ్ఞానానుష్ఠానంబులనెడి వైష్ణవాలంకార
ములను గలుగఁజేసి, వానిలో నంతర్యామియై వానిమూల
ముగ చేతనులను వశపఱచుకొనుచు రక్షించువాడని చెప్పి
యున్నందున ప్రత్యేకముగా నాచార్యుండనువాడు వేఱొ
క్కరుండు లేడు కదా! పయికిచూచినట్లయిన, సృష్టిసంహారంబు
లను వీనే చేసినారని తెలియవచ్చును. ఇంతియెకాని, వీటి
మూలకారణమునుగురించి సూచించితిమని, "విష్ణురాత్మా
భగవతో భవస్యామితతేజసః" అన్నట్లు అనంతునకు నారాయణభూ
తుండు సర్వేశ్వరుండని కదా యేర్పడును. ఈయర్థమును, "ఈ
శ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి భ్రామయన్ సర్వ
భూతాని యంత్రారూఢాని మాయయా" అనుతావున లీలకు
విషయభూతులగు వారందఱును అచేతనపదార్థములవలెనే ప
రతంత్రులనియు, తానే సర్వస్వతంత్రుడనియు ననుటచే సర్వే
శ్వరుండు తానే స్వయముగ తెలిసియున్నాడుకదా? అట్లే "వి
ష్ణుశ్శేషీ తదీయశ్శుభగుణనిలయో విగ్రహశ్శ్రీశఠారిః శ్రీ
మాన్ రామానుజార్యః పదకమలయుగం భాతి రమ్యం తదీ
యం" అన్నట్లున్న సంతుఁడై భాగమున వినియోగపడుచున్నా
నునప్పుడును తానె యంతరాత్మగానుండి శేషియై, ఆధేయ
త్వ, విధేయత్వ శేషత్వలక్షణంబులుగల శ్రీనమ్మాళ్వారు
లను శరీరముగానును, మహాగుణంబుల కాశ్రయంబయినట్టి
శ్రీరామానుజులవారిని శ్రీపాదంబులనుగానునుగాని ఆచా

ర్యంబుగా నవతరించుటం జేసి, అతండే యన్నింటిని నిర్వ
హించుకొని పోవువాడు. వాని కెట్టి యిష్టమైనదో అదియే
అందరికిన్ని ఇష్టమైనది. తక్కినవారందరున్ను వానికి నిత్య
పరతంత్రులు. స్వతంత్రముగా నొకనికిన్ని ఒక ప్రవృత్తియు
నుండజాలదు. ‘ఏతత్త్వం వాలాగ్ర ముప్యాసి శక్తియుమ్ అ
ప్యేతో ష్ఠియము...ప్ప’? అన్నట్లు వానిసంకల్పము లేనట్లయిన
గడ్డిపోచనైనను కదలింప సమర్థుం డెవ్వండును లేడు. ఈయా
చార్యుండు హితము నుపదేశించి దిద్దుపాటుచేయుటకై ప్ర
యత్నించుటయు ననది కోడలు సిద్ధము చేసిన వంటకములో అ
త్తగారు చెయ్యిపెట్టినట్లు యిమిడియుండునది.

* చేతనుండు దిద్దుపాటుగుటలో నుపకరించునట్టియాన్నియును
సర్వేశ్వరునియనుగ్రహకృత్యములనుట. *

ఈ జీవుడు అచేతనప్రాయుడై పడియున్నప్పుడు దేహేం
ద్రియంబుల నొసంగి, ఒక్కదాని జేయుటకుగాని వినుచుటకుగాని
కావలసిన శక్తుల నొసంగి, వాటిగొని చెడ్డదారి పోకుండ వేద
శాస్త్రము నొసంగి, రామకృష్ణాద్యవతారముగా వచ్చి యవ
తరించి హితము నుపదేశించినను, దుర్జ్ఞాననామూలముగా
నొక్కరును శాస్త్రమర్యాదకు లోబడిరానప్పుడు, కృపపొంగి
పోయి, తానే స్వయముగ ప్రయత్నించి రక్షింపవలయునను
కొని, ఈ విభూతియందు తానులీలారసమునకై యేర్పఱచిన నియ
మంబుల నతిక్రమించి రక్షించుట తనకే యశక్యమగుటం జేసి
మధ్యాహ్నవుతరవపంక్తియుపకారము నిరీక్షించియుండి, విశే
షముగ కటాక్షించి, అద్వేష, అభిముఖ్య, సత్సంగములనున్ను
సాత్త్వికగుణములనున్ను గలుగజేసి, మోక్షాపేక్షను గలు

గాఁ జేసి, ఆచార్యుండనువాని నొక్కని నలంకరించి, వాని నా
శ్రయించుటకుఁ గావలసినట్టి శమదమాదిగుణంబుల నీతనికిఁ
గలుగఁ జేసి, వానితోఁ జేర్చినపిమ్మట కదా అతం డీతనికి హి
తము నుపదేశింపఁగలఁడు. అట్లు హితము నుపదేశించినపిమ్మ
టనున్ను, "ఉపదేశోపసరర్థకః" అన్నట్లు దురభ్యాసము పైఁబడ
కుండ "తం దేవమాత్మబుద్ధిప్రసాదం" అనియు, "ఏష ఏవ సా
ధుకర్మ కారయతి" అనియు, "సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తస్స్మృతిర్జ్ఞానమపోహనంచ" అనియును చెప్పియున్న
ట్లు హృదయమునం దున్నవాఁడై ఆత్మగుణములను గలుగఁ
జేసి, పరమాత్మేతరములగు వాటివిషయమున వైరాగ్యమును
గలుగఁజేసి, తనవిషయమున ప్రీతిని సంపూర్ణముగాఁ గలు
గఁ జేసి, పరమాస్తికుండగునట్లు చేసి, ప్రాప్తప్రతిబంధకంబులగుసమ
స్తపాపములును తొలఁగిపోవునట్లు అనుగ్రహించి, ప్రారబ్ధకర్మ
విమోచనము మొదలుకొని సత్యసంకల్పప్రాప్తి (పరమపద
ప్రాప్తి)వరకును లభింపవలసిన ఫలంబులనన్నింటిని వరుసగా
లభించునట్లు చేయుట యనునది సర్వేశ్వరునియొక్క యనా
ధాసాధారణకృత్యము కదా!

—* ఆచార్యునిచే యుపదేశింపఁబడిన యీచేతనుండు మొట్టమొదట
తలంపవలసినది. *—

శాస్త్రపద్ధతి యిట్లున్నను, అనాదికాలముగ సంసారములోఁ
బడియుండునట్టియీచేతనియుజ్జీవనమునుగుఱించి మొట్టమొదట
యీతనికిఁ ఉపకారస్మృతి గలుగుటయనునది "ఆత్మనో హ్యతిసంచస్య
మోగిన్యయపదార్థతాం కృపయై వోపకర్తారమాచార్యం సం
స్మరేత్సదా" అన్నట్లు అనాదిగ సర్వేశ్వరుం డుండియు

న్నను, పిరాట్టియుండియుండియున్నను, ఆళ్వారులును తక్కిన యాచార్యులును అందఱున్ను ఈ యాత్మనుజ్జీవింపఁజేయుటకై యత్నతరించియున్నను, ఈ జన్మమున తనకీలాభమును ఆచార్యసంబంధముద్వారా కలుగఁజేయుటంజేసి, యది స్వాచార్యుని విషయమున నుండఁగలదు. ఈ యుపకారమునకు ముఖ్యకారణ మెద్దియని పరిశీలించి చూచితిమేని సర్వకారణుండగు సర్వేశ్వరుండేయని యేర్పడుటంజేసి, యది వానియందే పర్యవసింపక వీలు లేదు. కావుననే "ఉపకారస్మృతికి మొదటికారణము ఆచార్యునివిషయమునఁగల కృతజ్ఞత. తుట్టతుది కారణము ఈశ్వరునివిషయమునఁగల కృతజ్ఞత" యని శ్రీవచనభూషణమున సాధించియున్నారు.

-*ఆచార్యుండును సర్వేశ్వరుని యవతారములలో నొక్కటియనుట.*-

ఈ యాచార్యరూపమగు అవతారమున్ను వానిజ్యైసంమున "ఆచార్యదేవో భవ" అనియు, "గురురేవ పరంబ్రహ్మ" అనియు, "న పరాన్నారాయణోదేవః" అనియు, "ఐహికాముష్మికం సర్వం" అనియు, "మాతా పితా యువతయః" అనియునిట్లు పూర్వాధికారియయినట్టి వానివిషయమున ననుసంధించుకొనవచ్చును. కావుననే కదా విపరీతానుష్ఠానంబులకవకాశము గలుగకుండునట్లు "రామానుజార్యే గురురితిచ పదంభాతి" అనుతావున ఇతరులయందుండరాని యుపాయాత్మకమగు ఆచార్యత్వమును శ్రీరామానుజులవారియందున్నట్టి దానినిగాను పూర్వాచార్యులందఱును అనుసంధించుకొనియు, ఉపదేశించియును పోయియుండిరి.

ఇందుల కభిప్రాయ మేమనఁగా — నానాటికి అజ్ఞానము ప్రబలమై తమతమ ఆచార్యులు చెప్పినట్టి విపరీతార్థములను విని అజ్ఞులయినవారల్లు అనుసరించుకొని పోకుండునట్లు, శ్రీరామానుజులవారి శ్రీసూక్తులును వారి యనుష్ఠానంబులునే ఉద్దేశ్యములని యెందఱును యెఱింగి యుజ్జీవించునట్లు సిద్ధియించినవారయిరి. కావుననే తామేదో యొక దానినాచరించి అది శ్రీరామానుజులవారు సాధించినట్టి యనుష్ఠానంబని చెప్పునట్టివారి మాటలను నమ్మక, గురుపరంపరా ప్రభావము మొదలగు గ్రంథములయందు సాధించినట్టి యర్థంబులను పూర్వాచార్యుల వచనానుష్ఠానంబులతో పరోక్షము రాకుండునట్లు, బాగుగాఁ బరిశీలించి, నిర్ణయింపఁగల పరమవైదికులకు అధికారుల వచనానుష్ఠానంబులే యుద్దేశ్యంబులని గ్రహింపవలయును. ఇంచుకైనను ప్రమాదములేనట్టి జ్ఞానానందమును లభించినవారలకు శ్రీనమ్మాళ్వారులు "ఉపదేశ మిడరో మీరు కురిడియుల్" అని యారంభించి, పలుతావుల వేదప్రామాణ్యము నంగీకరించి, "సర్వం ఖల్విదం బ్రహ్మ నేహ నానాస్తి కించన" అనియు "ఏకోహవై నారాయణ ఆసీన్న బ్రహ్మా నేశానః" అనియు ని[illegible]రంభించి చెప్పినట్టి వేదాంత వాక్యములను ద్రావిడభాషలో వివరించి, ముముక్షువులచేఁ దెలిసికొనవలసినయర్థంబులనన్నింటిని తమ ప్రబంధములద్వారా బయలుపఱచిన వైదికాగ్రేసరులగుటం జేసియే కదా ప్రపన్నజనకూటస్థులై సకల శిష్టాగ్రగణ్యులచేతను నున్న శిరసావహింపఁదగినట్టి వారుగా నుండిరి. కావుననే యెంతజ్ఞానవంతులైనను, వేదవేదాంత విరుద్ధముగ చెప్పుదారిని పోయినట్లయిన, భగవంతుని లీలకు

విషయమగుదురే కాని, వాని కృపకు విషయభూతులు కాఁజాలరు.

—* మహాజ్ఞానవంతులైనను, నిషిద్ధానుష్ఠానముగలవారుగా నుండుట సర్వేశ్వరుని లీలార్థము *—

జ్ఞానవంతులు మాత్రమే కాకుండ, యెక్కువ వైరాగ్యము గలవారై యెక్కువ భక్తియున్ను గలవారై యుండియును, దురనుష్ఠానంబులతో సంబంధముగలవారయినట్లయిన, వారిని యెవ్విధమున తలంపవలయుననంటివేని, చెప్పెదను. సర్వేశ్వరుండు తన లీలకు సహకారులనుగా నుంచినట్లు వారినిగాఁ దలంచి, వారివద్దకు తాను పోకుండ దూరముగానుండునది. సర్వేశ్వరుండు నిరంకుశస్వతంత్రుండై, పరమకృపావంతుఁడై భోగార్థమును లీలార్థమును యేర్పడియుండు నిత్యవిభూతి లీలావిభూతులకు నాయకుండగుటం జేసి, లీలయును భోగమును వానికి యిష్టంబులై, యొకప్పుడు లీలాలోలుండై కొందఱి నరులకు సహకారులనుగాఁ గాని వారి మూలముగ కొందఱిని లీలలో నుపయోగపఱచు కొనుటయును, వేఱొకప్పుడు దయాపరవశుండై కొందఱిని తానే ముక్తులనుగాఁ జేసి, భోగమునందు పయోగపఱచు కొనుటయును, కొందఱికి విలక్షణసంబంధమును గలుగఁజేసి యందుమూలముగా నుజ్జీవింపఁజేయుటయును వానికి స్వభావమగుటం జేసి, "శ్రుతిర్నష్టాస్మృతిస్సుప్తా ప్రాయేణ పతితా ద్విజాః అంగానిచ విశీర్ణాని హావృద్ధో వర్ధతే కలిః" అన్నట్లు పాపము ప్రబలమై వేదవైదికమర్యాదల నతిక్రమించి యాగములును నాస్తిసములై నశించిపోవలసి వచ్చినప్పుడు, దయాపరవశుండై పరాంకుశ, పరకాల, యతివరాదులను

నియమించి వారిమూలముగ దిద్దుపాటుచేయుటకై ప్రయత్నింప
చుండగా, "నడుమక్కిన్ఱియాత్తోన్నుమిల్లై కలియుంకెడుమ్ కం
డుకొళ్ళుమిన్" అన్నట్లు కలిదోషమంతయును నశించిపోయి,
"పెరియకితయుగంపస్సేరిన్ బవళ్ళ పిటక కరియముకిల్ వణ్ణ
నెమ్మాన్ కడల్ వణ్ణన్ పూతంగళ్ మణ్మేలిరిదుప్పుకుందిశై
పాడి యాడుమిడంకొండనవే" (కృతయుగమువచ్చి ఆనం
దము పెంపొందినీలమేఘశ్యామునంతను సముద్రమువంటి వర్ణ
ముగల నాస్వామి భూమిపై జీవరాసులఁ గలుగఁజేసి పాట
పాడుచు వాటిలో నంతట సంతరిస్తూ నున్నాడు) అని
పాయించినట్లు ఇఁకలీలకు విషయభూతులయినట్టివారొక్క
రును లేరని చెప్పఁదగినట్లు,చూచినజీవులనంతటను వైష్ణవులేయై
గొప్ప యభిమానమువలన అనధికారులు సయితము ముక్తు
లగుటంగని "మొళ్ళిరుంపిడుపెత్తల లక్కై" (అందఱును శ్రీవై
కుంఠముకుఁబోయిన దో ఈలోకమే లేకపోవును) అన్నట్లు ముక్తి
కిఁ గావలసిన అధికారసంపత్తి ఇంచుకైనను లేకున్నను, ప్రా
తికూల్యములు లేనంతమాత్రమున గొప్ప యభిమానము
గలవారై బాల, మూక, జడ, అంధ, పంగు, బధిరాదులున్ను
ముక్తులయినట్లయిన, శాస్త్రమర్యాద తప్పిపోవుననియు, లీ
లావిభూతియున్ను తగ్గిపోవుననియును తలంచి, నిషిద్ధానుష్ఠా
నమున్ననే కాని, లీలలో నుంచ యోగ్యపలచుకొనుటకు వీలు
లేనందున, పూర్వకాలమున అసురులును రాక్షసులును
"అగ్నిహోత్రాశ్చ వేదాశ్చ" అన్నట్లు వేదవైదిక శ్రద్ధగల
వారైనను, దేవతలను ద్వేషించునట్టివారై, సాధువులను బాధిం
చునట్టి వారుగానుండుటచే, వైదికశ్రద్ధను పోగొట్టి విపరీతా

నుష్ఠానపరులనుగాఁ జేసిననే తప్ప వారిని నశింప జాలమను కొని "తిణ్కళ్ కాలశురర్కు తింగిళైక్కుమ్ తిరుమాలై" అన్నట్లు పిరాట్టియును, తానును ఒక యుపాయమును గల్పించి "కళ్ళవేడత్తై క్కొండుపోయ్ ప్పురంపుక్కవారుంకలంద శురర్కళైయుళ్ళం పేదం శెయ్దిట్టు యుయిరుండవుపాయంగళుమ్" అనిసా యించినట్లు తానే బుద్ధవేషమును ధరించుకొని వారితోఁగలిసి వారిబుద్ధిని చెడిపి వైదికశ్రద్ధనుపోగొట్టి విపరీతానుష్ఠానపరులను గాఁజేసియును, "బృహస్పతేః శ్రుతిస్మృతిషు సర్వేషామతిశయిత జ్ఞానానాంనిదర్శనేన సంకీర్తనాత్" అన్నట్లు జ్ఞానాధికులం దతిఁని నిదర్శన భూతుఁడగు బృహస్పతిని తన్మతస్థాపకునిగాఁ జేసి, అందుమూలముగ కొందఱిని విపరీతార్థప్రవర్తకులను గాఁ జేసియును, ఇంకను "పలశమయ మతికొడుత్తాయ్" (అనేక మతములనేర్పఱచినావు) అనియు, "శమయంగళ్ పల్లాంపాతువాకినిన్ఱాయ్" (అన్నిమతములకును సమానముగా నున్నావు) అనియును సాయించినట్లు తననైపుణ్యమునకు మనస్సుపోకుండునట్లు, అనేక వేదబాహ్యమతములనున్ను కుదృష్టులను న్ను కల్పించి ఆయాగుణములుగల పురుషుల మూలముగ ఆయామతములను ప్రవర్తింపఁజేసి, వాటిమూలముగ రాక్షస స్వభావముగల వారిని బద్ధసంసారులనుగాఁ జేసి, వాటిని యభివృద్ధిలోకిఁగొని వచ్చినచందంబున, ఈసిద్ధాంతమునందును ఖ్యాతిని, లాభమును, గౌరవమునున్ను సంపాదింపవలయునను కొని, నామరూపములను ధరించుకొనియుండి, స్వరూపాను రూపములగు అనుష్ఠానములలో నొక్కటినిన్ని అనుష్ఠింపక, స్వరూపవిరుద్ధములైనవాటిలో నొక్కదానిన్ని త్యజింపక,

దగుటంచేసి, దావాగ్నివలెనే వ్యాపించుకొనిరాఁగా, ఆకా
లమున శ్రీరామానుజులవారు కొందఱిని పట్టుకొని, శిక్షించి,
గ్రంథములఁగొని చింపివేసి, కాల్చి పేరుమాసిపోవునట్లుచేసి
నను, కలికాలదోషమువలన తిరిగిన్నీ నానాటికివృద్ధిఁబొంది, శి
ష్టులుచూస్తే నిందింతురనుకొని బయలుపెట్టక, తమతో
ననుకూలించువారికే ఇది శిష్టాచారమని బోధించుచు, ఈ
సిద్ధాంతమున కనర్థమును గలుగఁజేయుచు వ్యాప్తిఁజేయుచుండిరి.

—* శ్రీవచనభూషణగ్రంథములు ప్రవర్తించుటకు హేతువు *—

శ్రీపిళ్ళైలోకాచార్యులవారి కాలమునను మీ రడిగి
నట్లు కొందఱు విపరీతప్రశ్నల నడుగఁగా, [illegible]వారు భగ
వదాజ్ఞవలన శ్రీవచనభూషణమను దివ్యశాస్త్రమును రచి
యించిరని కొందఱు జ్ఞానాధికులు చెప్పుదురు. పూర్వులు త
మ ప్రబంధములయందు మిక్కుటముగా నధికారి కుండవలసిన
లక్షణంబులనే తెలుపుచు వచ్చినట్లయిన, ఒక్కరును చేరరని
తలంచి, శరణ్యుండగు సర్వేశ్వరుని ప్రభావమునే యెక్కువ
గాఁ దెలుపుచువచ్చి, దానివిషయమున నెక్కువ విశ్వాసమును
గలుగఁజేసిరి అధికారి కుండవలసిన లక్షణంబులను కదా
చిత్కుగా వచ్చుటవలనఁగాక తావున సూచింపఁజేయుచు పోయినం
దున, అందులను గుఱించిన నాస్తికబుద్ధి బాగుగాఁ దెలియక,
శరణ్యుండగు సర్వేశ్వరుని ప్రభావమునందే మనస్సునుంచి
స్వరూపము నశించిపోవునట్లు సంసారబద్ధులై దారాపుత్రా
సక్తమనస్కులై, మఱివిషయములయందెక్కువ ప్రీతిగలవా
రై నామరూపములుతప్పి, సంసారులకున్ను తమకున్ను తా
రతమ్యము లేకుండ. ఈ విపరీతానుష్ఠానంబుల నన్నింటిని బో

ధించుచు సంచరించుచుండుటం జేసి, ఇట్టి ప్రవర్తనను నివారించుటకు గానే శ్రీవచనభూషణ దివ్యశాస్త్రమును నాయించి నందున "ఉయ్యావినవృత్తయాగుంగళుక్కు చ్చిగ్నిగ్గ్గ్ర" అనఁగా ఉజ్జీవింపవలయునని కోరికగల వారికి శ్రీవచనభూషణాములయాను, జెప్పఁబడినట్లు నిష్ఠ యవశ్యముగా నుండవలయునని మామునాచార్యులవారుగు శ్రీమణవాళమహాముసులు సాయించి యున్నారు.

* "మద్భక్తజనవాత్సల్యం" ఇత్యాది శ్లోకార్థమును వివరించుట. *

భగవంతుని యాశ్రయించి యుండువారైనను, సహవాసాదులకు యోగ్యులని చెప్పకుంటిరి. అయితే "మద్భక్తజనవాత్సల్యం" అను తావున (నన్నాశ్రయించియుండువారియందుండు దోషమును భోగ్యముగాఁ దలంచి ప్రవర్తింప వలయును" అని సర్వేశ్వరుండు తానే స్వయముగ చెప్పియున్నాడే యంటివేని చెప్పెదను. దాని యభిప్రాయము అకృత్యకరణ, కృత్యాకరణ, భగవదపచార, భాగవతాపచారంబులను భోగ్యములుగ నన వాటినిగాఁ దలంపవలయునని కాదు. అచ్చటనే "నాత్రగర్హా" అనియు "నిందాంకుర్వన్తి మేనరాః" అనియు సితావులఁ జెప్పియున్నట్లు, అట్టివారిని నిందింపగూడదనియు, నిందించినట్లయిన నిగ్రహపాత్రుండగుననియును తెలుపుటయే వివక్షితము. భోగ్యములనుగా గ్రహించుటయనఁగా—తన పాలను త్రాగి జీవించునట్టి కూడ కాలితో తన్నినను, తలతో పొడిచినను, పళ్ళతో కరచినను, ఆవు సహించి సుఖముగాఁ గొనునట్లు భాగవతులు తనను పరిభవించినను, కఠినముగా మాట్లాడినను, దానిని సహించుకొనియుండవలయుననియు ఇంతియె కాక. వి

షయప్రవణుండు ప్రక్కమీఁద పడుకొనియున్నప్పుడు తన శిష్యు
రాలగు స్త్రీ భోగసమయమున కాలితోఁ దన్నినను, గోళ్ళతో గిల్లి
నను, నోటితోఁ గరచినను, పరుషముగా మాటలాడినను, ఇంక అ
నేకవిధములుగా తిరస్కరించినను, ఒకరితోను నోరు తెఱచి
చెప్పక, వాటినన్నింటిని భోగ్యముగాఁ గొనునట్లు, భాగవతులై
నట్టియును, వారు తానొక్క యపరాధమునున్ను చేసియుండకపో
యినను, తనపై ఇతరులు చాడీలుచెప్పఁగా విని తనను తిట్టికొట్టి భ
యపెట్టి ఇవ్విధమున శిక్షించినను, అందువలన తనకుహితము
జేసినారనుకొని, దానిని భోగ్యముగాఁ గొని, సర్వజ్ఞులగు భగ
వద్భాగవతసన్నిధియందు విన్నవింపక, వారిచే విడిచినవాఁ డుండ
జాలనని చెప్పకొనుచు, "మత్పాపమేవాత్ర నిమిత్తమాసీత్"
అనియు "శంకిష్యే విప్రయోగే" అనియును చెప్పియున్నట్లు వా
రిమనస్సు నొప్పింపఁబడినందులకు చింతించి, అందులకు హే
తువు తనయొక్క సంచితకర్మమనుకొని, తననే నిందించుకొని
వారెట్లు సంతోషపడుదురో. అట్లు వారియెడల ప్రవర్తించుచు,
గోష్ఠిలో తమను నిష్కారణముగ పరిభవించిన కందాడై తోడ
ప్పర్ అనువారిని వినయముతో ననువర్తించినట్లు సంబళ్ళగారి
వలెనే నడచుకొనవలయును. నిష్కారణముగా నన్నేల ఇట్లు
పరిభవింపవలయుననుకొని యందులకుగాను ప్రత్యుపకారముచే
యకుండుట మాత్రమే కాకుండ, దానిని భోగ్యముగాఁ గొనుట
యనునది తనభక్తిని కుండవలసిన లక్షణమని భగవంతుండు
చెప్పియున్నాఁడే కాని, అకృత్యములనాచరించువారై వేశ్యాగృ
హంబులయందు సంచరించుచు అన్యకామములమూలముగ పరి
భవించువారై తిరుగుచున్నను "మాగన్ప్రవర్తించినను అది

యే మాకు ఎక్కువప్రియము" అని తమ ప్రియంబులఁ జెప్పుచు, ఒక దమ్మిడియైనను నీయక, ప్రీతితో నొక్క కైంకర్యమును ఉపయోగించక, శ్రీపాదతీర్థము ను ప్రసాదింపవలయునని కోరి దానిని స్వీకరించి, వారికి సంతోషముగలుగునట్లు ప్రవర్తింపవలసినదని చెప్పియుండలేదుకదా? సుంచేటున్నను జ్ఞానము గలిగినపిమ్మట యనన్యప్రయోజనుఁడై యున్నట్టియున అట్టివాఁడు ఆదరణీయుడని భగవద్గీతాది గ్రంథములయందుఁ జెప్పియున్నందున నివ్విధముగనే యీ శ్లోకమున కర్థమని యెఱుంగునది. అట్లుకాకున్న, భగవదభిప్రాయము నెఱింగియున్నట్టి పూర్వాచార్యులు నాస్తికులనున్న ఆస్తికనాస్తికులనున్న మూర్ఖులని వదలి మధ్యను పేర్కొనిన శ్రీవచనభూషణాదిశాస్త్రవశ్యులగు ఆస్తికుల నాదరింపవలసినదయని చెప్పియుండరు కదా! కావున నామరూపములను ధరించినవారైనను, వారి నడవడికలను నిందింపఁబోక, తనకు వారొకకష్టముఁ గలుగఁజేసినట్టియున దానిని భోగ్యముగాఁ గొనవలయుననుటయే భగవంతుని యభిప్రాయము.

అట్లుకాకున్న, వారాచరించునట్టి యకృత్యంబులను భోగ్యముగాఁగొని అదియే తమకురక్షకమని యనుసంధించుకొనవలయునని చెప్పినట్లయిన, స్వస్వరూప పరస్వరూపములను బాగుగా నెఱింగియుండువారగు శ్రీ నమ్మాళ్వారులే పలుతావుల "కొయ్యుమిన్ తొండీర్ కళ్ కళ్ త్తుత్తొడిమిన్" అనియు "శెత్తిరళ మడనార్ తాట్చియైమదియా తుమొళుపతుపయనే" ప్రయావ్వన స్త్రీలు మీయందు చూపునట్టి ప్రీతిని విశ్వసింపక తిరుమాలిరుంజోలమలయందు వేంచేసియుండుస్వామిని యాశ్రయింపు

ము) అనియు "శీరియ దైవత్తాల్ తీవినై ప్పోగుక్కాతు" (బలము చేత పాపములను పెంపొందింపవలదు) అనియు "శీరియ ననినమిల్ శీర్ ప్పై శెయ్యాతే" (విషయాంతరములకై యాశపడక మంచి యుపాయమగు భగవంతుని యాశ్రయింపండి) అనియు "వఙ్గ కేన్ననినమిల్ వల్ వినై మూర్ఖ గాదే" (అవిహితమే న్యాయమని పాపములను జేయకుము) అనియు "నూదెన్న కళవున్ శూదుం శెయ్యాతే" (ధనార్జనమునకు సాధనమని దొంగిలింప వద్దు జూదమాడవద్దు) అనియు నీ తావుల అకృత్యంబుల నాచరించి నరకమునఁబడకుండ, వీటినన్నింటిని వేళ్ళతోఁ గూడ ఛేదించివేసి, "పత్తిలైయాయవన్ ముత్తిలడంగ్" (ప్రీతితో సర్వేశ్వరుని కైంకర్యములలో ప్రవేశింపుడు) అని నోరు నొక్కుకొని, "ఇత్తై కండీర్ ఇంబమందో" అనఁగా సంసారమున సుఖములేదు సుమీ! ఆయ్యో నేను ఈవిషయమును ఉపదేశింపవలసివచ్చెనే యని పరితపింపక అలేకుండ, చేస్తే చెయ్యాని మంచిదేయనుకొని తాము వాటిని భోగ్యములనుగా నంగీకరింపవచ్చునే?

వారు ఇట్లు ఉపదేశించినది సంసారులకేకాదా? వైష్ణవులకుగాను ఇట్లు ఉపదేశించియున్నారా? యంటివేని చెప్పెదను. "కణ్ణనైత్తోండీర్" అనుతావున భగవంతుని పొందవలయు ననేటి కోరికగల మీరు అకృత్యకరణాదులనువిడువండి, విడనాడి యాశ్రయించండి. వానిని ఆశ్రయించుచుండ, అవిక్రమముగ శమింతతామే పోవునని తలంపవద్దు అవశ్యముగ వాటి నన్నింటిని విడిచిపెట్టిన పిమ్మటనే యాశ్రయింపవలసినది.

„విషవండి విడిచిపెట్టిన పిమ్మటనే ఆశ్రయింపుడి" అనుటచే ఇతరవిషయవిరక్తియే యుద్దేశింపఁబడినది.

ఇవ్విధమున వాటినన్నింటినీవిడనాడి భగవంతుని యాశ్రయించినట్లాయిన, మధ్యనుండి భగవత్ప్రాప్తిని అడ్డగించునట్టి ప్రబలకర్మంబులను పోగొట్టినపిమ్మట కదా పునరావృత్తిరహితమగు మోక్షమునిచ్చునని తెలుపఁబడినది. ఇట్లుండ, వారు ఉపదేశించినది భాగవతులై మోక్షాపేక్షగలయధికారులకా? కేవలసంకలకా? నీవే యోచించిచెప్పుమని యప్పాగారడిగిరి.

„శెయ్ తారేల్ నన్ఱు శెయ్ తార్" అను దాని యర్థమును వివరించుట.*

అంతట నమ్ములు అది యట్లుండనియ్యండి. „శెయ్ తారేల్ నన్ఱు శెయ్ తార్" అనుతావున శ్రీభక్తులు అకృత్యంబుల నాచరించినను మంచిదే అని భగవంతుండే చెప్పియున్నాడే? అది యెట్లో తెలుపండనిరి. అంతట అప్పాగారిట్లు సమాధానము చెప్పిరి. పిరాట్టి సాడీలుచెప్పినదే కదా! యకృత్యములను వారాచరింపరని చెప్పినది. „సాడీయుచెప్పినట్లయిన" „ చేసినట్లయిన " అన్నంతమాత్రముననే పురుషకారభూతురాలగు పిరాట్టి యీచేతనుని యందు దోషంబులను నిరూపింపదనియు, ఆమెను పురుషకారముగాఁగొనినట్టి యధికారి యకృత్యంబుల నాచరింపడనియును తోచదా? ఇట్లు ఘటింపనివన్నియును ఘటించినను, సర్వేశ్వరుఁడు తనను శరణుజొచ్చినట్టి యీచేతనుని విడనాడడని శరణ్యుఁడగు సర్వేశ్వరుని ప్రభావము చెప్పఁబడినది. ఇంతియె „ ఎన్నడియారదు శెయ్యార్"(నాదాసులు అట్టి యకృత్యముఁ జేయరు) అనుతావున నాదాసులే యయినట్లయిన, అకృత్యంబుల నాచరించుదురా?

...ళ్ మొళ్లినే ప్రమాణమును గాను పదేపదే చెప్పి
...రు. ఇందుల కభిప్రాయంబెద్ది? యని యడిగిరి.

“విస్ఫారిత్వ శేషాధిష్ఠానమయః పిండాగ్నివన్మతం” అన్న
రివ్యాచిద్రూపమగు శరీరముకంటెను వీరియందు విశేష
...నిలిచియుండి, యిట్టిగ కాలిన యినుముగుండు వలెనే స్వ
...ము యెక్కువగా ప్రకాశించి పరమానందముసందు వలెనే
...లక్ష్మిపా పారతంత్ర్యములు కలిసియుండక, “కారుణ్యా
చ్ఛాస్త్రపాణినా” అన్నట్లు కేవల కారుణ్యమువలన శాస్త్ర
...నొసగి “పోయ్గలవాగై యొయ్కలందాయ్” అన్నట్లు
తమోగుణవంతులగువారిని మోహింపఁజేయుటకై అసత్య
ప్రతిపాదకమగు శాస్త్రమును దెలిపియున్నట్లు యవతారము
నలెఁగాక, అసత్యమెంతమాత్రము చేరకుండునట్లు వీరితోఁజేరి
“మగ్నా నుద్ధరతే” అన్నట్లు సంసారసాగరమున మునిగి
పోవుచున్నవారిని దరిచేర్చుటనే ప్రయోజనముగ చేతనుల
హితమునకుఁ గావలసిన యర్థంబులనన్నింటిని “ఇగ కవిపాడుం
పరమకవి కళాల్ నక్ కవితా తన్నైపాడు వియాదేనక్కు
వందెన్నుడ నాక్కియెన్నాల్ తన్నైవణక్క విపాడుం” అన్నట్లు
వ్యాసపరాశరాదులును, ముదలాళ్వారులును మొదలగు
వారుఉన్నప్పటికిన్ని వారిచే పాడింపక సకలోపనిషత్తులతో
సమానమైన తిరువాయ్మొళియనఁబడు ప్రబంధరత్న
ములమూలముగ బయలుపడునటుంజేసియు, ఈ నమ్మాళ్వా
రులును తక్కిన యాళ్వారులవలెనే ప్రాకృత పదార్థములే
ధారక, పోషక భోగ్యములని తలంచియుండక, అన్నైదకాదు

లన్నియును సర్వేశ్వరుండేయని బాల్యమునుండియు స్తన్యములను సయితమపేక్షింపక, భగవదనుభవైకరసులై యుంటంజేసి ప్రకృతి సంబంధమువలనఁ గలుగునట్టి భ్రమ, విప్రలంభ, ప్రమాద, అశక్తిదోషంబులు లేనివారగుటంజేసి యుక్తయాళ్వారు లందఱును ఏరికనయనంబులగుటంజేసియు నొక్క శ్రీసూక్తులను అనుష్ఠానంబులనున్న ప్రమాణము సంగీకరించియుండుటంజేసియును అట్లు చెప్పియుంటిమి. యభిప్రాయము.

—* పరవ్యూహాదుల కంటెనున్ను ఆచార్యుండు విలక్షణమైన యవతారమనుట. *—

ఇఁక, ఆచార్య స్వరూపము "ఆచార్యదేవోభవ" అనియు "సాక్షాన్నారాయణో దేవః" అనియు, "ఆచార్య స్సహరిస్సాక్షాత్" "గురురేవ పరంబ్రహ్మ" అనియు నీమొదలగు తావుల సాక్షాన్నారాయణుండని చెప్పియున్నది.

మనవారందఱు "సర్వేశ్వరు నాశ్రయించుట" యొక్క నినైననొక్కనిని వానిచేతులు పట్టుకొని పనిచేయించుకొనునట్టి నియు, ఆచార్యునియాశ్రయించుట యనునది వాని కాళ్లు పట్టుకొని పనిచేయించుకొనుటవంటిది" అనుటచే నీతావున సర్వేశ్వరుండన్నను ఆచార్యుండన్నను ఒక్కటె వస్తువుగాఁ దెలిపియున్నారు. "ఆచార్యుండు ఈచేతనునికిన్ని సర్వేశ్వరునికిన్ని ఉభయులకున్ను ఉపకారకుండు" అను తావున భిన్నవస్తువులనుగాఁ దెలిపియున్నారు. దీనియొక్క వాస్తవస్థితిఁ దెలుపుండని యడిగిరి. అందుకు అప్పాగారిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి:— ఆచార్యుండు కేవలము భగవత్స్వరూపమనియును చెప్పఁదగ

కేవలము పరిశుద్ధాత్మ స్వరూపమున్ను సింహస్వరూ
పమున్ను రెండును కలిసియుండునట్టి నరసింహావతారము వలెనే
దియునొక యత్యద్భుతమైనట్టిది. అదియెట్లనిన, ఆచార్యుండ
నగా — కేవల భగవత్స్వరూపమంటిమేని, గురుపరంపర
నుండు వారందరును ఒక్కరేయై స్వరూపైక్యదోషము సంభ
విం(చు)ను. ఆచార్యుండును ఒకయాత్మయేయంటిమేని, ప్రమాణం
బు లనేకంబులు విరోధించును. కావున "భలభద్ర స్త్వృతీయస్తు"
అన్నట్లు బలరాముండు శేషావతారమైయున్నను, కొం
చము భగవదంశమున్ను కలిసియుండుటచే నిదియును ఒక్క
భగవదవతారమైన దశావతారంబులలో నొక్కటియైన దగున
ట్లు, ఆధేయత్వ, విధేయత్వ, శేషత్వ లక్షణములుగల ముఖ్య
మైన శరీరమైనవారై, పరమైకాంతికులకు విలక్షణాత్మల సధి
ష్ఠించి, మెఱుగకాలిన యినుపగుండు వలెనే బయటికి కన
బడునదై, అత్యంతము ప్రకాశించునదియై, యుండునట్టి వైలక్ష
ణ్యముతోఁ గూడియుండునట్టి భగవత్స్వరూపమునుగా నెఱుంగు
నదియని శ్రీజవన్యాచార్యులవారు సాయింపుదురు. కావున పర,
వ్యూహ, విభవాంతర్యామ్యర్చావతారంబుల కంటెనిది
విలక్షణమైనట్టి యవతారముగా నుండును. "విశేషణభేదా
ద్విశిష్ట భేదః" అన్నట్లు విశిష్టమగు భగవత్స్వరూపంబున
కున్ను ఆచార్యస్వరూపంబునకున్ను విశేషణవిశేష్య భేదముం
డుటం జేసి, విశిష్టవస్తువునందు భేదముండినదై విశేషణమునుబట్టి

భేదమును విశేష్యమునుబట్టి యభేదమును రెండును కలవ
చెప్పఁదగి యుండును.

ఇట్టి యాచార్యత్వ మనునది ఇతరుల యందుండ
శ్రీనమ్మాళ్వారులవారియందు మాత్రముండునదియగుటం
వారి శ్రీపాదస్థానీయులగు శ్రీరామానుజులవారే సర్వో
లగు ఆచార్యులనెడి విషయము పూర్వాచార్యులందఱుఁ
ఒప్పుకొనినదియే. మరియు వీరు మనపాదస్థానీయులై మన
ఉద్దేశించిన (జగదుజ్జీవనరూపమగు) కార్యమునకు నిర్వాహకు
గా నుండగలరని శ్రీనమ్మాళ్వారులే స్వయముగ తెలిపియు
న్నందున, శ్రీరామానుజులవారి విషయమున తనయొక్క య
నన్యార్హ శేషత్వాదుల ననుసంధించుకొనుచు ,,జగదాచార్య
రచితే — శ్రీమద్వచనభూషణే — తత్త్వజ్ఞానంచ తన్నిష్ఠాం — దే
హినాథయతీంద్ర మే'' అని ప్రార్థించుచు, అనుకూలంబులయి
నవాటి ననుష్ఠించుటకు శక్తిలేకపోయినట్లయిన ,,ఇడకిలేనొట్ట
క్కిళ్ళై'' అని సాయించిన విధమున యనుతాపపడి, ప్రతి
కూలంబులయినవాటి ననుష్ఠించుటను నిశ్శేషముగాఁ బరిత్యజించి,
,,ఎంబెరుమానార్ తిరువడిగళే శరణం'' అని నమ్మి
యుండునట్టి యధికారులై, పరమవిలక్షణులగు వైరాగ్య
సంపత్తితోఁగూడి శ్రీవచనభూషణాది రహస్యముల యర్థం
బుల ననుసంధించుకొనుచు కాలము గడుపుచు, ,,ఇదం తేనా
తపస్కాయ'' అన్నట్లు జితేంద్రియులు కానట్టి యనధికారుల

పరమార్థమును తెలుపక, భక్తులయినట్టివారికే తెలుపుచు "రామానుజం ప్రపన్నా యే రక్షాదీక్షా కృపానిధిం । కరం వక్షసి నిక్షిప్య నిద్రాం కుర్వన్తి నిర్భయాః" (భక్తులను రక్షించుటయే దీక్షగాఁగల కృపాళువగు శ్రీరామానుజులవారిని శరణుజొచ్చినవారు నిశ్చింతగా రొమ్ముమీఁద చెయ్యివేసికొని నిద్రపోవుదురు) అన్నట్లు భయపడక సుఖముగా నుండుదురు అని వ్రాయించినవారయిరి.

పెరియజియ్యర్ తిరువడిగళే శరణమ్.

కర్త॥ ఇది, శ్రీకృష్ణావద్ధ్యా వాహినీతీరస్థ బస్థవిరమ క్షేత్రాపరనా
మక నైకంఠపురవాస్తవ్య, శ్రీమదలర్మేల్మంగానమేత శ్రీవేంకటేశ్వర
సాన్నిధ్యధ్యాపక కైంకర్య ధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్
కందాడై అప్పన్ ప్రణతార్తిహరాచార్య కృపాపాత్ర,
శ్రీపెరియకోయిల్ రామానుజయతీశ్వర పరమానుగ్రహసమధిగత సకల
శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత సంప్రదాయ గ్రంథ తత్త్వార్థ, వాధూల
కులతిలక వేంకటాచార్య రంగమాంబాతనూజ కావ్యరత్న,
వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతీత్యాద్య
నేక బిరుదాలంకృత, గీర్వాణాంగ్ల ద్రవిడాంధ్ర
శుద్ధమాగధ్యాశ్మాది ద్వాదశభాషావిశారద
శ్రీమదాంధ్ర శ్రీభాష్యశ్రీవచనభూషణాచార్యహృదయాది గ్రంథకర్త
కందాడై, శేషాచార్యులవారిచే నాంధ్రీకరింపఁబడిన,
విలక్షణ మోక్షాధికారి నిర్ణయము.